




ముఖచిత్రం : తెలుగుతల్లి

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య




సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 43 ఏప్రెల్ 1981 సంచిక 4

**1981-82** సంవత్సరానికి బడ్జెటు ప్రతిపాదనలను ఫిబ్రవరి 28న, ఆర్థిక మంత్రి, పార్లమెంటులో ప్రకటించారు. అనేక సంవత్సరాల తరువాత, కొత్త పన్నులు ఏమీలేని బడ్జెటు యీ ఏడు వచ్చింది. ఫిబ్రవరి యువలో మేము అర్థించిన ప్రకారము, ఆదాయపు పన్ను కట్టనక్కరలేని మెట్టు 15,000 రూపాయలకు పెంచబడింది. అంతేకాక, ఏ మెట్టునుంచి పన్ను నిర్ణయింపబడుతున్నదో ఆ మెట్టునుంచే పన్ను కట్టాలి గాని, అంతకు లోపునుంచి కట్టనక్కరలేదనికూడా నిర్ణయింపబడింది. గత సంవత్సరంలో, పన్ను కట్టనక్కరలేని మెట్టు 12,000 రూపాయలుగా నిర్ణయింపబడినా, 12,000 రూపాయలకుపైన ఆదాయం వచ్చినవారు, 8,000 రూపాయలనుంచీ పన్ను కట్టాలనే నిబంధన వుండేది. ఇది చాలా అవకతవక నిబంధన అనీ, దీనిని రద్దు చేయవలసిందనీ కూడా మేము ఫిబ్రవరి యువలో అర్థించాము. అలాగే జరిగింది. ఆర్థిక మంత్రికి మా అభినందనలు.

1981-82 బడ్జెటు లోటుబడ్జెటు. ప్రభుత్వ ఆదాయంకన్న, వ్యయం సుమారు 1600 కోట్ల రూపాయలు ఎక్కువగా అంచనా వేయబడింది. 1600 కోట్ల రూపాయలంటే సామాన్యమైన మొత్తం కాదు. అంతమొత్తం లోటుగా అంచనా

వేయబడినప్పటికీ, దేశపు మొత్తపు ఆదాయాన్ని దృష్టిలో పెట్టుకొని, వ్యయపు అంచనాలను పరిశీలిస్తే, ఆ లోటు అలాగే వుండవలసిన అవసరం కనిపించదు. ప్రభుత్వ వ్యయంలో, ఎన్నో రంగాలలో ఎంతో పొదుపు చెయ్యవచ్చును. అంచనా వేసిన ప్రకారం అన్ని ఖర్చులనూ పెట్టవలసిన అవసరంకూడా వుండక పోవచ్చును. అభివృద్ధి ప్రణాళిక ప్రకారం కార్యక్రమాలకు పెట్టవలసిన ఖర్చును జాగ్రత్తగా పెట్టినట్లయితే, ఆ కార్యక్రమాలవల్ల ఎన్నో రంగాలలో ఆర్థికాభివృద్ధి వుంటుంది. దానివల్ల ప్రభుత్వాదాయం పెరుగుతుంది. ప్రభుత్వ పరిపాలనా శాఖలవారు తమ శాఖల దైనందిన వ్యయాన్ని పొదుపుగా పెట్టినట్లయితే, ప్రభుత్వపు ఖర్చు ఎంతో తగ్గుతుంది. ఈ సంవత్సరపు ప్రభుత్వ వ్యయం 24,87 కోట్ల రూపాయలుగా అంచనా వేయబడింది. ఈ వ్యయంలో నూటికి ఒక్క రూపాయి చొప్పున పొదుపుగా ఖర్చుపెట్టినా దాదాపు 248 కోట్ల రూపాయలను ఆదా చెయ్యవచ్చును. దేశ ఆర్థికస్థితిని కాపాడడమే బాధ్యతగాగల ఉద్యోగులు పరిపాలనా వ్యయాన్ని తగ్గించడానికి శాయశక్తులా కృషి చెయ్యగలరని ఆశిస్తున్నాము.

ఆదాయపు పన్ను వేసే ఆదాయపు మొదటి మెట్టును పన్నెండువేల రూపాయల నుంచి పదిహేనువేల రూపాయలకు పెంచినందువల్ల పన్ను కట్టేవారిలో సుమారు 14 లక్షలమంది పన్ను కట్టనవసరంలేదని అంచనా. అంటే 14 లక్షల రికార్డులు వుండవన్నమాట. దీనివల్ల ఇన్‌కంటాక్సు ఆఫీసర్లకు సహజంగా చాలా పని తగ్గుతుంది. నాలుగైదు సంవత్సరాలుగా ఫైసలు చెయ్యని రికార్డులను, వారు త్వరత్వరగా ఫైసలుచేసి, ముదరా ఇవ్వవలసినవారికి ముదరా ఇచ్చినట్లయితే, లక్షల సంఖ్యలో పన్నుకట్టినవారు సంతోషిస్తారు. ఈ విషయంలో ఇన్‌కంటాక్సు అధికారులు శ్రద్ధచూపడం అవసరం.

కొత్త పన్నులు ఏమీ లేకుండా, వున్న పన్నులను కొన్నింటిని తగ్గించి బడ్జెటును ప్రతిపాదించడానికి ఆర్థిక మంత్రికి ఎంతో ధైర్యం కావాలి. అలాటి ధైర్యాన్ని ప్రదర్శించిన ఆర్థిక మంత్రి, ప్రభుత్వ వ్యయాన్ని పొదుపుగా జరిపించడంలో శ్రద్ధ తీసుకున్నట్లయితే, దేశ ఆర్థికస్థితి చాలా పటిష్టమౌతుందన డానికి సందేహం లేదు. ఆర్థిక పరిస్థితి పటిష్టమైననాడు, ఇంకా కొన్ని పన్నులను తగ్గించవచ్చును. అసలు పన్నులేని పరిస్థితి ఎప్పుడూ ఏర్పడదు. ప్రభుత్వం పరిపాలన సాగించవలసిందే. పరిపాలన సాగించాలంటే, దానికయ్యే ఖర్చును పన్నులద్వారా రాబట్టవలసిందే. కాని, ఆర్థిక పరిస్థితి పటిష్టంగా వున్ననాడు,

ఎంతో తక్కువ పన్నులతో పరిపాలనకు కావలసిన ఆదాయాన్ని చేకూర్చుకో వచ్చును.

అలాంటి పరిస్థితిలో, కొన్ని పన్నులను, ముఖ్యంగా ఆస్థి పన్నును రద్దుచేయ వచ్చును. ఆస్తిపన్ను అంటే, ఆదాయంమీద పన్నుకట్టగా మిగిలిన ఆస్తిపై మళ్లీ పన్ను కట్టడమనీ, దానిని రద్దుచేయడం న్యాయమనీ ఇదివరకు మేము ఎన్నో సార్లు సూచించాము. ఎన్నో సంవత్సరాలుగా అమలులోవున్న యీ పన్నును రద్దు చెయ్యాలంటే, ఆర్థికమంత్రికి ధైర్యం కావాలి. మళ్లీ బడ్జెటునాటికి, దేశ ఆర్థిక వ్యవస్థ పటిష్టమై, ఆస్తి పన్నును రద్దుచేసే ధైర్యం ఆర్థిక మంత్రికి వస్తుందని ఆశిస్తున్నాము.

# రూపవాణి

## చెళ్లూరి సీతారాజేశ్వరరావు

**సు**షమ కారుదిగి రివ్వున బెడ్‌రూంలో ప్రవేశించి సోఫాలో కూలబడి పోయింది. భరించలేని నిరాశ శరీరమంతా వ్యాపించింది.

పోచమ్మ గది తలుపు త్రోసి 'భోజనానికి రండమ్మా' అని పిలిచింది. సుషమ పలకలేదు. ఆమె గంభీరత చూసి పోచమ్మ తిరిగి పిలవలేకపోయింది. కొంచెం సేపు చూసి వెళ్లిపోయింది.

గడియారం తిరుగుతోంది. సుషమకి ఏం తెలియడంలేదు. దేనిమీదా ధ్యాస లేదు. ఆలోచనలు! అంతరంగాన్ని మండించే ఆలోచనలు!

ఆకలి వేస్తున్నా ఏం తినాలని లేదు. మనఃశాంతి లేనపుడు మలయమారుతం కూడ వేడిగా వుంటుంది. మనసు మూగబోతే జీవనవీణ మంచి సంగీతం వినిపించలేదు. సుషమకి ఏసీ గదిలో కూడ చెమటలు పోస్తున్నాయి. ఫోంబెడ్ రాయిలా వుంది.

రేపట్నుంచి రోడ్డు ఎక్కుతుంది తన జీవితం. ఈ భోగాలు, వైభోగాలు వుండవు. ఇక్కడున్నది ఏదీ తనది కాదు.

మార్పు! అవును. శిఖరాల నుంచి శిథిలాలకి. దివినుంచి భువికి. ఆమని నుంచి అంధకారానికి.

సుషమ మేడ దిగి హాల్లోకి వచ్చింది. ట్యూబ్ వెలుగుతోంది. తలుపులు తుంగ చాపలో గురకపెట్టి నిద్రపోతున్నాడు. గడియారం పదకొండున్నర చూపిస్తోంది. సుషమ తోటలోకి వచ్చి సిమెంటు బెంచీ మీద మోకాళ్ల మీద తలపెట్టుకుని కూర్చుంది.

నల్లటి ఆకాశం నిండా చుక్కలు. అమావాశ్య ఆకాశం నల్లటి యవ్వనవతి కురులు ఆరబెట్టుకున్నట్లు వుంది.

తోట చూడగానే సుషమ గుండె చెరువయిపోయింది. తోట చాలాభాగం ఖాళీగా కనిపిస్తోంది. అక్కడక్కడ వున్న మొక్కలు కూడ పోషణలేక బలహీనంగా వున్నాయి.

తనకి ప్రాణప్రదమైన తోట ఎండిపోయింది!

సుషమ మేడకేసి చూసింది. ఇన్నాళ్లు తనకి చోటు యిచ్చింది....రేపట్నుంచి మరొకరికి ఆశ్రయమిస్తుంది. యాజమాన్యం మార్పు దానికేం సంబంధం

లేదు. ఇంటిని కొన్నవాడు తిరిగి తోటను పెంచుకుంటాడు. కొత్త మొక్కలు నాటతాడు. తోటమాలీ వుంటాడు.

తోటకి తిరిగి వెన్నెల వస్తుంది. మరి తనకి? తన భవితవ్యం ఏమిటి? తన గమ్యం ఏమిటి?

జవాబు రాని ప్రశ్నలు! తెలియని ప్రశ్నలు.

తలుపులుకి మెలకువ వచ్చింది. వీధి తలుపు తీసి వుంది. ఏమిటాని వచ్చి చూశాడు. తోటలో సుషమ కనిపించింది. "ఎందుకమ్మా చీకటిలో?" అన్నాడు దగ్గరకి వచ్చి.

"చీకటిలోనే వున్నాను కదా తలుపులూ?" వెర్రిగా నవ్వింది.

"రండమ్మా....వచ్చి పడుకోండి."

వాడి బలవంతం వల్ల వచ్చి పడుకుంది. కాస్సేపటికి నిద్రపట్టింది. మెలకువ వచ్చేసరికి తొమ్మిదయింది. బజర్ నొక్కింది. బెడ్ కాఫీ రాలేదు. విసుగ్గా కిచెన్‌లోకి వెళ్లింది.

పోచమ్మ స్టవ్ వెలిగిస్తోంది. "గేస్ లేదమ్మా. కిర్సనాలు తెచ్చి అంటిస్తున్నా!" ఎందు కాలస్యమైందో చెప్పింది.

సుషమ ఏమనలేకపోయింది. స్టూలు మీద కూర్చుంది. పోచమ్మ ఏదో అడుగుతోంది. కాని సుషమకి ఏం మాట్లాడడానికి అసక్తి లేదు.

తలుపులు డైలీ తెచ్చియిచ్చాడు.

సుషమ దృష్టి ఒకచోట నిలిచి పోయింది. దాన్ని మరి మరి చదివింది. కొత్త ఆశ కలిగింది. చీకటిలో చిన్న దీపం. అగమ్యమైన బ్రతుక్కి గమ్యం చూపిస్తోంది.

సుషమ మేడమీద కెళ్ళి వుత్తరం రాయసాగింది.

* * *

పూసిన పూలు అనేక చోట్లకి పోతాయి. కొన్ని కొప్పుల్లోకి పోతాయి. కొన్ని గుడికి పోతాయి.

బిడ్డ కలిగితే... ఒకచోట వేడుక. సంబరం. ఆనందం.

బిడ్డ పుడితే .... ఒకచోట వేదన. సమస్య. చీకటి.

భాస్కరం దేవయాని ప్రేమించుకున్నారు. పెళ్ళి చేసుకోవాలనుకున్నారు. కాని అప్పటిదాకా వయసు పూరుకోలేదు. ఇద్దర్నీ కలిపింది.

దేవయాని అమ్మయింది. భాస్కరం సరదా తీరింది కనుక మరో అప్పలమ్మని ప్రేమించడానికి పోయాడు. దేవయాని బిడ్డని పెంచే ధైర్యంలేక అనాధ శరణాలయానికి అప్పగించింది.

ఇలాంటి పిల్లలకి శరణాలయం అమ్మ.

దాన్ని నడిపే కుమారస్వామి నాన్న.

కుమారస్వామి ఆ పిల్లకి సుభద్ర అని పేరు పెట్టి పెంచసాగాడు. అలా కొన్నాళ్లు........కొన్నేళ్లు.

ఆరోజు మెట్రిక్ ఫలితాలు వచ్చాయి. సుభద్ర ముఖంలో కళ లేదు. ఆమె

పరీక్ష పోలేదు. ఫస్ట్ క్లాసులో ప్యాసయింది. ఆమె బాధ యితరులని చూసి. ప్యాసయినవారు 'అమ్మకి చెప్పాలి, నాన్నగారికి చెప్పాలి' అంటూ యింటికి పరుగుతీస్తున్నారు. తను ఎవరితో చెప్పుకోవాలి. అనాధననే భావం ఆమెని వుక్కిరిబిక్కిరి చేసింది. బరువుగా శరణాలయం చేరుకుంది.

శరణాలయం చెరువుగట్టుమీద వుంది. ఎదర రకరకాల చెట్లు నీడగా వుంటున్నాయి. కుమారస్వామి రావిచెట్టు అరుగుమీద కూర్చుని వున్నారు. 'ప్యాసయ్యావట ఫస్టు క్లాసులో?' సుభద్రని పలకరించాడు.

తలూపింది.

"సంతోషపడవల్సిన సమయం. విచారం ఎందుకమ్మా?"

"ఏం లేదు స్వామీజీ!"

"ముందు ఏం చెయ్యాలని వుంది?"

"మీ యిష్టం."

"నిన్ను యింకా చదివించే శక్తి శరణాలయానికి లేదమ్మా. గిరిజ, భవాని, లత వుద్యోగాలు చేస్తామంటున్నారు. మనోరమకి పెళ్లి కుదిరింది. ఇక నీ సంగతే తేలాలి. రామాయణంగారు నీకు భరతనాట్యం నేర్పుతామంటున్నారు. చుట్టూ తిరిగితేనే ఒప్పుకోడు. నిన్న తనంతట తానే అడిగాడు!"

"నేర్చుకుంటాను!"

సుభద్రకి పద్ధెనిమిదేళ్లు. మెరుపులా వుంటుంది. మైమరపించే అందం, ఆకర్షణ ఆమెలో వున్నాయి. మైదానంలోని ఒంటరి పూలచెట్టులా కళగా వుంటుంది. అందుకే రామాయణం కోరి శిష్యురాలిని చేసుకున్నాడు. మెట్రిక్ ప్యాసయ్యాక శరణాలయం ఇక పోషించదు. కుమారస్వామి కమిటీకి నచ్చచెప్పుకున్నాడు సుభద్రపై.

నాలుగేళ్ళలో సుభద్ర గజ్జె కట్టింది! శభాష్ అన్నారు జనం.

ఒకసారి వరదబాధితుల సహాయంకోసం పట్టణ లయన్స్ క్లబ్బువారు సాంస్కృతిక కార్యక్రమాలు ఏర్పాటు చేశారు. అందులో సుభద్ర నాట్యం కూడ వుంది. చూసినవారందరూ ఆనందించారు. గంగూలీ ఆనందించడంతో వూరుకోలేదు. కుమారస్వామిని కలుసుకున్నాడు.

"సుభద్రని నా సినిమాలో హీరోయిన్‌గా బుక్ చేస్తాను."

కుమారస్వామి సందిగ్ధంలో పడ్డాడు. ఒప్పుకోవడమా? మానడమా? అదే ఏ కొత్తవాడయినా నిరాకరించేవాడే. కాని గంగూలీ ప్రఖ్యాత దర్శక నిర్మాత. పెద్ద నటులే ఆయన సిన్మాలో ఛాన్స్ కోసం చూస్తారు.

సుభద్ర ఎదగడం తన కిష్టమే. కాని చిత్రరంగం విచిత్రరంగం. కుమారస్వామి భయాలను కొట్టిపడేశాడు గంగూలీ!

"ఈ సినిమా ఎక్కడో తీయడం



లేదు. మీ వూరు ప్రక్కనే గోదావరి మీద తీస్తున్నాను. సుభద్ర గురించి మీరు భయపడవద్దు. ఆమెకోసం బంగారు భవిష్యత్తు కాచుకుని వుంది."

కుమారస్వామి అంగీకరించాడు.

సుభద్ర 'సుషమ'గా తెర ఎక్కింది.

గంగూలీ సినిమా 'జవాబు రాని ప్రశ్న' అటు కళాత్మకంగానూ, ఇటు వ్యాపారపరంగానూ విజయవంతమైంది.

సుషమకి యిరవై ఆఫర్లు వచ్చాయి.

"ఏం చెయ్యమంటారు స్వామీజీ!" బేలగా అడిగింది.

"అవకాశం అదృష్టం కలిసివచ్చి పిలుస్తున్నపుడు వెనకడుగు వెయ్యకూడదమ్మా. నీలోని కళని సమాజానికి అంకితం చెయ్యి."

'శరణాలయం'లోని మిగితా వారందరూ సుషమని చూసి ఈర్ష్యపడసాగేరు. తమకి రాని అవకాశం ఆమెకి వచ్చిందని వారంతా ఇదివరకులా సుషమతో మాట్లాడటం లేదు. ఈ వాతావరణం సుషమ భరించలేకుండా వుంది.

ఓ మంచిరోజున కుమారస్వామి ఆమెని మద్రాసు తీసుకుపోయాడు. ఇల్లు వగైరా చూసి కొన్నాళ్లు తోడుగా వున్నాడు,

ఇంతలో సుషమ అంగీకరించిన మూడు చిత్రాలు ప్రారంభమయ్యాయి. కుమారస్వామిని అక్కడే వుండమని కోరింది.

"మరి శరణాలయం మాటేమిటి తల్లీ...."

ఆయన వెడుతూంటే సుషమ ఏడ్చింది.

"పిచ్చిపిల్లా.... నిన్ను వదిలేస్తానా? ఛ ఛ.... నెలకోసారి పరిగెత్తుకురానూ చిట్టితల్లి దగ్గరికి!" తల నిమురుతూ

వాత్సల్యంగా అన్నాడు. ఆయనకి ప్రారంభంనుంచి ఆమె అంటే ఎందుకో మమకారం!

సినీప్రపంచంలో అడుగు వేస్తోంది సుషమ. ఆమె నటించిన రెండు చిత్రాలు బాక్సాఫీసు దగ్గర ఘనవిజయం సాధించాయి. సుషమ ప్రేక్షకుల అభిమాన తారయింది. నిర్మాతలకి కల్పవృక్షమయింది.

నెల పోయాక కుమారస్వామి వచ్చాడు. ఆయన్ని చూడగానే పండగలా వుంది సుషమకి. సుషమ వైభవం ఆయనకీ పండగలాగే వుంది.

తిరిగి ఆయన వెడుతూంటే సుషమ లక్షరూపాయల చెక్ ఆయన చేతిలో పెట్టింది. "ఇదేమిటమ్మా?" విభ్రాంతిగా అడిగాడు.

"నాలాంటి అభాగ్యులను మరికొంత మందిని పెంచడానికి పుట్టింటికి చేస్తున్న సాయం. మీ ఋణం ఎలాగూ తీర్చుకోలేను. శరణాలయానికయినా సాయపడనివ్వండి." వినయంగా అంది.

కుమారస్వామి తల నిమిరాడు. సుషమ ఎదిగిపోయి ఆకాశంలో ప్రకాశిస్తున్నా భూమిని మరచిపోలేదు. తనెవరో గుర్తుంది.

శరణాలయంలో పెరిగిన చాలామంది ఏరుదాటి తెప్ప తగలేసేరకం. శరణాలయం జీవితం పీడకలగా భావిస్తారు.... కాని సుషమ అలాంటి రకం కాదు. సుషమమీద అభిమానం రెట్టింపయింది.

రోజులు గడుస్తున్నాయి. సుషమ తారాపథాన్ని ఏలుతోంది. ఔట్‌డోర్స్‌కి వెళ్ళినపుడు శరణాలయాన్ని చూసి వస్తుంటుంది. అక్కడివారికి బట్టలు, మిఠాయిలు పంచిపెడుతుంది.

కుమారస్వామి నెలనెల వస్తున్నాడు మద్రాసు.

"ఆయన ఎవరు?" వెళ్ళిపోతున్న కుమారస్వామిని అడిగాడు హీరో నవీన్. సెట్స్‌మీద విశ్రాంతి సమయం అది.

సుషమ నిజం చెప్పివేసింది.

"పదేసేవాడు ఒకడుంటే పరుగెత్తే వాడుకూడ కుంటుతూ నడుస్తాడు. సెంటిమెంట్సుకి దూరంగా వుండండి. కుమారస్వామి అందర్నీ పెంచినట్లే మిమ్మల్నీ పెంచాడు. ఆ వంక పెట్టి యిపుడు పీక్కుతుంటున్నాడు. అతడి దాహం తీరేది కాదు. అయినా ఈ విషయం ఎక్కడా చెప్పకండి. అద్దాల ప్రపంచం మనది. చిన్నప్పట్నుంచి అమ్మా, నాన్నలు గారంగా పెంచుతారు మనల్ని. కాన్వెంటులో చదువుకుంటూండగా సినిమా పిలుపువస్తుంది...కళాసేవ ప్రారంభిస్తాం ఎవర్నో వుద్ధరించడానికి...." చివర్న నవ్వాడు నవీన్.

ఇంతలో సెట్స్‌మీదనుంచి పిలుపు వచ్చింది.

ప్రవాహంలో పందెంకాస్తున్నా సుషమ తన వ్యక్తిత్వాన్ని మరచిపోలేదు. మానవత్వం మరచిపోలేదు.

ప్రాయపడే అవకాశం వస్తే అందరికీ ప్రాయంచేస్తోంది. ఆమె మంచితనం చూసి నిర్మాతలు చాలమంది బాకీ ఎగ వేశారు. ఆమె తాబేదారులు, పియ్యేలు, లాబీవర్గం మనుషులు ఏరియా వైజ్‌గా ఆమెచేత సినిమాలు కొనిపించి, తాము బాగుపడ్డారు.... నష్టాలు ఆమెవే.

తిని పూరుకోక యాగీ ప్రారంభిం చారు. కాకా సినిమా పత్రికలు మరింత రంగుపూసి ప్రచారం చేసేవి.

ఈ ప్రచారంవల్ల ఆఫర్స్ తగ్గాయి. చేతిలోవున్న సినిమాలుకూడ ఘనమైనవి కావు!

అవి ఫెయిలయితే తన జీవితం ఫెయిలవుతుంది. తనపై జరిగే దుష్ప్ర చారాన్ని ఒంటరిగా ఖండించలేక పోతోంది.

ఈ పరిస్థితిలో..........

"మనం పెళ్ళిచేసుకుందాం" అన్నాడు నవీన్.

సుషమ ఆలోచించింది. నవీన్ పేరున్న హీరో. అతడి అండవల్ల తన స్టార్‌డం తిరిగి లేస్తుంది.

"నా కిష్టమే!"

నవీన్‌కి అంతకు ముందే పెళ్ళయింది. ముగ్గురు పిల్లలున్నారు. ఆమెని పెళ్లాడ డానికి కారణం?

భార్య అనారోగ్యమన్నాడు పైకి. లోపలకి కారణం వేరు.

నవీన్‌కి సుషమకి పెళ్ళయిపోయింది. భట్రాజుల్లాంటి సినిమాపత్రికలు ప్రత్యేక సంచికలు విడుదలచేశాయి పెళ్ళిపై.

సుషమ నవీన్ యింటికి మకాం మార్చివేసింది. మొదటి భార్య గౌరీశ్వరి ఆమెని చూసి ముఖం మాడ్చుకోలేదు. చెల్లీ అంటూ ఆప్యాయంగా పిలిచింది. పిల్లలుకూడ సుషమ దగ్గర మాలిమి అయ్యారు. సుషమ చాల సంతోషం చింది. నవీన్ ప్రేమ, గౌరీశ్వరి పిల్లలు చూపించే ఆదరణవల్ల ఏకాకిగా బ్రతికిన ఆమెకి సంసారం రుచి తెల్సింది.

"పెళ్లయ్యాక రిటైరవుతానని కొన్ని పత్రికలు ఊహాగానాలుచేసినై. అదితప్పు. నేను సినిమాలనుంచి వైదొలగడంలేదు. నేను నటించడం మా వారికి అభ్యంతరం లేదు!" సుషమ పత్రికలవారికి యింటర్వ్యూ యిచ్చింది.

సుషమ తిరిగి సినీజీవితం ప్రారం భించింది. చేతిలో డజన్ పిక్చర్లున్నాయి. రెండు షిఫ్టులు పనిచేస్తోంది.

ఆమె ఆశయం తీరింది. కాని....? ఏ నిర్మాత ఆమె దగ్గరికి రాడు. నవీన్‌ని కల్సుకుంటాడు. నవీన్ నిర్ణయిస్తాడు.

సుషమ సంతకంపెట్టి, షూటింగ్స్‌కి పోవడమే. ఏ బాదరబందీ లేనందుకు సుఖంగానే వుంది. కాని...? అది ప్రశాంతా?

ఒకసారి కుమారస్వామి వచ్చినపుడు సుషమ స్టూడియోకి వెళ్ళింది. పెళ్ళికి అనారోగ్యంవల్ల ఆయన రాలేదు.

నవీన్ రొంపపట్టే అనుమానం వుండటంవల్ల షూటింగ్ కాన్సిల్ చేసుకుని యింటిదగ్గరే వున్నాడు.

కుమారస్వామిని గుర్తుపట్టి... వెట కారంగా నవ్వాడు. "వచ్చారా? వస్తారనుకుంటున్నాను."

"వచ్చే నెల శరణాలయం స్వర్ణోత్స వాలు. ముఖ్యమంత్రి వగైరాలు వస్తున్నారు. అమ్మాయిని పిలుద్దామని వచ్చాను." కుమారస్వామి చెప్పాడు.

నవీన్ మాట్లాడలేదు. ఇంతలో సుషమ షూటింగ్‌నుంచి వచ్చి భర్త ప్రక్కన కూర్చుంది. కుమారస్వామిని మామూలుగా పలకరించింది. అయన తిరిగి వచ్చినపని చెప్పాడు.

"చాలు చాల్లేవయ్యా.... వదుక్కో వోడానికి ఏదో కారణం అప్పగిస్తారు. అనాథ పీనుగులకి వైభవాలెందుకు? పట్టుకెళ్లింది చాల్లే. ఇంకెప్పుడూ యిక్కడికి రాకు. నువ్వు రావడం సుషమ గ్లామర్‌కి దెబ్బ?" నవీన్ చిరాకుపడ్డాడు.

కుమారస్వామి నిర్ఘాంతపోయాడు.

"నువ్వు వస్తే చాలమ్మా. ఏం విరాళం యివ్వక్కర్లేదు."

నవీన్ వేళాకోళంగా నవ్వాడు. "ప్లేటు ఫిరాయించావన్నమాట. ప్రఖ్యాత సినీతార సుషమ వస్తోందని చెప్పి ప్రజల దగ్గర్నుంచి టిక్కెట్లరూపంలో డబ్బు గుంజుతావు... నీ నాటకం తెలియదా?"

కుమారస్వామి వస్తే ఏం చెప్పాలో, ఎలా ప్రవర్తించాలో నవీన్ యింతకు ముందే ఆమెకి చెప్పాడు. అలా చెయ్యడం ఆమెకి బాధగానే వుంది. కుమారస్వామి దేముడిలాంటి మనిషి. ఆయన్ని బాధపెట్టడమా?...కాని తప్పదు. లేకపోతే నవీన్‌కి కోపం వస్తుంది.

"నేను రావడం కుదరదు. ఎప్పుడూ రాకండి" సుషమ లోపలకెళ్లింది.

కుమారస్వామి ఖిన్నుడై వెళ్లిపోయాడు.

షూటింగులు....సన్మానాలు .... విహారాలతో సుషమ జీవితం వేగంగా దొర్లిపోతోంది.

గౌరీశ్వరికి మళ్లీ ఆడపిల్ల.

"నేనుకూడ అజాగ్రత్తగా వుంటాను" అంది సుషమ ఓరాత్రి.

నవీన్ ఆమెని దగ్గరకి లాక్కొని "నువ్వు పిల్లల్ని కంటె నిర్మాతలు, ప్రేక్షకులు గోలపెట్టేస్తారు!" చుంబించాడు.

"మరి నా గోల...."

"దానికి టైం వుంది...."

అమ్మ కావాలన్న కోరికని గుండెల్లో దాచుకుంది. ఈ తెరజీవితం కోసం ఎన్నో త్యాగాలు!

అలా చినుకులా సుషమలో బాధా బీజం పడింది. క్రమంగా బీజం మొక్కయింది. అసంతృప్తి పెరగ సాగింది.

ఆంధ్రదేశంలో తుఫాను వచ్చింది. ప్రజానాయకులు బాధితులకి సాయం చెయ్యడానికి విరాళాలకి తిరగసాగేరు. కొందరు సుషమ దగ్గరికి వచ్చారు. నష్టం భారీగా జరగడం వల్ల సుషమ లక్షరూపాయల విరాళం ప్రకటించింది. చెక్కు పుస్తకం కోసం భర్తదగ్గర కెళ్లింది.

"నీ లక్షతో వారి బాధలు తీరి పోతాయా ? అయినా ఈ సాయం అసలు వారికి అందుతుందా ?....అయిదు వంద లియ్యి, చాలు." నవీన్ చెక్ యిచ్చాడు. అతడు చాల పొదుపుమనిషి.

సుషమ ఆ చెక్ యివ్వడానికి సిగ్గు పడిపోయింది.

"ఆంధ్రులు ఆరంభశూరులు" కార్య కర్తలు నవ్వారు.

నవీన్ కోడంబాకంలో మరో నాలు గంతస్థుల మేడ కట్టించి గౌరీశ్వరితో గృహప్రవేశం చేశాడు. సుషమతో మాటవరుసకయినా చెప్పలేదు. యాంత్రి కంగా పార్టీలో మసలింది. సాయంత్రం ఏదో పనిమీద భర్త గదిలోకి వెళ్లింది సుషమ.

లోపల్నుంచి మాటలు.

"సుషమని డబ్బుకోసం చేరదీశాను. నా భార్యవి నువ్వే. ఈ మేడ నీ పేర్నే వుంది కదా! అది పూరికే మనకి డబ్బు తెచ్చే యంత్రం" నవీన్ అంటున్నాడు గౌరీశ్వరితో.

సుషమకి నషాళం అంటింది. వాస్తవం తెల్సింది. తను ఎక్కడవుందో కూడ తెల్సింది. ఏమైపోతోందో కూడ తెల్సింది.

"చంచల ప్రౌఢక్షన్సు వారికి కాల్ షీట్లు యివ్వనన్నావుట " మర్నాడు నవీన్ కోపంగా అడిగాడు.

"తలాతోకా లేని కథల్లో నటించను."

"మనకు కథ లక్కర్లేదు. డబ్బు కావాలి. గుర్తుంచుకో."

"డబ్బు కోసం యిమేజ్ పాడు చేసుకోను."

సుషమ ఆ రోజునుంచి చిత్రాల గురించి అన్ని నిర్ణయాలు తనే తీసు కుంటోంది. ఇది నవీన్‌కి గుర్రుగా వుంది. తన పాపులారిటీ వల్ల సుషమకి కొత్త ఆఫర్స్ రాకుండా చేస్తున్నాడు. 'సుషమ వుంటే నేను నటించను.' అని బెదిరిస్తున్నాడు. నిర్మాతలు హీరోముందు బసవన్నలు కదా! నవీన్ చెప్పినట్లే చేస్తున్నారు! ఇంట్లో గౌరీశ్వరి, పిల్లలు ఆమెతో మాట్లాడటం లేదు. ఆ పరిస్థితిలో అక్కడ వుండలేక తన పాత యింటికి వెళ్లిపోయింది.

ఆరు నెలల్లో సుషమ పూర్తిగా దెబ్బ తింది. స్టార్‌డం పెంచుకోడానికి తీసిన కాస్ట్లీ పిక్చర్ ఫ్లాప్ అయింది. నిర్మాతలు ఆమెని పిలవడం లేదు. సుషమ పోయి అడిగితే 'అమ్మ వేషాలు' యిస్తామంటు న్నారు.

"వచ్చి కాళ్ళమీద పడు. క్షమిస్తాను" నవీన్ కబురుచేశాడు.

సుషమలో ఆత్మాభిమానం. 'ఆ పని చస్తే చెయ్యను' అనుకుంది. ఆస్తులు అమ్మి అప్పులు తీర్చివేసింది.

* * *

శరణాలయంలో ఆయా కోసం యింటర్వ్యూ జరుగుతోంది. 'సుభద్రా' జవాను పిలవగానే లోపల కెళ్ళింది.

"కూర్చోమ్మా" కుమారస్వామి సాదరంగా పిలిచాడు.

ఆయన పాదాలమీద వాలిపోయింది ఏడుస్తూ. "నేను ఘోరంగా మోస పోయాను స్వామీజీ! అందరూ నన్ను వంచించారు. ఆ మాయలో పడి మిమ్మల్ని కూడ అవమానించాను.... మన్నించరూ!"

"సుభద్రా" ఆమెను లేవనెత్తి కళ్ళు తుడిచారు. "జరిగింది పీడకల అను కోమ్మా... మనం ఓడిపోయినా నెగ్గడం కోసం ప్రయత్నించాలి కాని ఓడిపోయా మని జావకారిపోకూడదు."

"నన్ను క్షమించారా? శరణాలయంలో చోటు యిస్తారా?"

"నా చిట్టితల్లి ఎవరి ప్రేరణవల్లో ఏదో అందని మనసు పాడుచేసు కుంటానా? ఛ....ఛ.... నువ్వేలాంటి దానివో పాతికేళ్ళు పెంచిన నాకు తెలియదుటమ్మా. ఈ రోజు నుంచి శరణాలయాన్ని నీ చేతిలో పెడుతున్నాను. నాకా వయసు ముంచుకు వస్తున్నది. పదిమంది బాధలు తుడిచే బాధ్యతలో నీ బాధ పెద్దగీత ముందు చిన్నగీతయి పోతుంది."

"చాలు స్వామీజీ! మీ అండదండ లుంటే ఏదయినా సాధిస్తాను. అదే శ్రీరామ రక్ష నాకు." తృప్తిగా అంది.

కుమారస్వామి ఆమెని ఆశ్రమం లోకి తీసుకువెళ్లారు. అక్కడ కొత్త వాళ్లు చాలామంది వున్నారు. సుభద్ర బెరుగ్గా ఆగిపోయింది.

"రామ్మా! ఇది నీ యిల్లే" అన్నారు కుమారస్వామి.





# శాంతికిరణాలు

షాజేదా బేగం

సంధ్యా సమయమది. పశ్చిమాద్రిన కొండల మాటున క్రుంగిపోతున్న సూర్యుని నుండి వచ్చే ఎర్రని కాంతి పచ్చటి పొలాలపై బడి వినూత్న శోభను చేకూర్చుతూ వుంది.

అపుడే వదిలిపెట్టిన స్కూల్ నుండి పరుగెత్తుకుంటూ వచ్చి గుడి మెట్ల దగ్గర ఆగిపోయింది పధ్నాలుగేళ్ల శాంతి. రంగు వెలసిపోయిన పచ్చ లంగాపై తెల్లరంగు జాకెట్టు వేసుకుంది. భుజాన వున్న పుస్తకాల సంచిని మరో భుజం వైపు మార్చుకుంటూ.... చెదరిపోయి కళ్ల మీదుగా పడుతున్న ముంగురులను వెనక్కి తోసుకుంటూ....తను నిలబడి గుడిలోంచి లీలగా కన్పించే శివలింగానికి నమస్కరించే చోటున ఒక అబ్బాయి అడ్డుగా నిలబడివుండటం చూసి....ముఖం చిట్లించుకుంది.

“వోయ్! వోయ్! నా చోటులోకి వచ్చి నిలబడ్డావేం? అటువైపుకు జరుగు. నేనక్కడ నిలబడి....స్వామికి దండంపెట్టుకోవాలి తెలిసిందా?” ఆయాసంతో రొప్పుతూనే గట్టిగా హెచ్చరించింది శాంతి.

"ఆయా ప్రసాదం తీసుకురావడానికి వెళ్ళింది. ఎటువైపుకు జరగాలో నాకు తెలీదు. ఆయా రావాలి.... అపుడు నేను కదలాలి." నెమ్మదిగా అన్నాడా అబ్బాయి. ఇంతలో ఒక నడివయస్కురాలు సాదా తెల్లచీర ధరించి, చేతిలో ప్రసాదం... పూలూ పట్టుకొని వచ్చింది. ఆ అబ్బాయి చేతిని పట్టుకొని నడిపించుకుంటూ వెళ్ళిపోయిందామె. శాంతి కళ్ళు ఆశ్చర్యంతో రెపరెపలాడాయి. ఆ అబ్బాయి కదిలి వెళ్ళిపోయిన చోటున నిలబడి....అక్కణ్నుండి కన్పిస్తున్న శివలింగాన్ని చూసి భక్తితో కళ్ళుమూసుకొని చేతులు జోడించింది. కళ్ళు తెరచి.... వాళ్ళకోసం నలువైపులా పరికించి చూసింది శాంతి. ఉహుఁ వాళ్ళు కన్పించలేదు. శాంతి మనసులో ఒక్కటే ప్రశ్న వేధించసాగింది.

'అతను గ్రుడ్డివాడా ?! అదెలా సంభవం ! అతని కళ్ళు ఎంతో విశాలంగా.... అందంగా ఉన్నాయి....మరి చూపు ఎలా పోయిందో ?' అతని గురించి ఆలోచిస్తూ.... యింటి వైపుకు దారితీసింది శాంతి. గుడి దగ్గర జరగమని ఆ అబ్బాయితో చెప్పగానే.... కలువపూవులా ముడుచుకున్న అతని మోములోని బాధను అపుడే గమనించలేకపోయినందుకు తనను తాను తిట్టుకున్నది. ఆలోచిస్తూనే యింటికి చేరుకుంది శాంతి.

* * * * *

"తాతయ్యా ! పొలంనుండి అమ్మ యింకా రాలేదా ? మాలతి ఏదీ ? ఎక్కడికెళ్ళింది ?" అంటూ చుట్ట వెలిగించుకుంటున్న సుబ్బయ్య తాత ప్రక్కనే వచ్చి కూర్చుంది శాంతి. "మాలతీ ఆడుకోడానికి వెళ్ళిందీ....అమ్మ యింకా రాలేదుగానీ నా క్కాస్త మజ్జిగ పట్టా తల్లీ.... బాగా వేడిచేసిందిలా వుంది."

"అలాగే" అంటూ లోపలికెళ్ళి గ్లాసెడు మజ్జిగ తెచ్చి, తాతయ్యకు అందించింది. గ్లాసు ఖాళీ చేసి, క్రింద పెడుతూ "ఇప్పటి వరకూ యింటికి రాకుండా ఏం చేస్తున్నావే శాంతీ ! నీకు యీ మధ్య తిరుగుళ్ళెక్కువయిపోయాయి.... అక్కడా యిక్కడా షికార్లుచేయకుండా.... అమ్మకు పన్లో సాయం చేయకూడదూ ?" అన్నాడు సుబ్బయ్య.

"ఏమిటి తాతయ్యా.... నువ్వు మరీనూ అంటావు. ఇపుడేగా స్కూల్ నుండి వస్తూ గుడిదగ్గరకెళ్ళి యిటు వచ్చాను. ఊళ్ళెమ్మట ఎక్కడ తిరిగా నేమిటీ ?" గునిసింది శాంతి.

"తాతయ్యా ! తాతయ్యా ! మరే.... యీ రోజు గుడిదగ్గర ఏం జరిగిందంటే...." మాట పూర్తి కాకుండానే మధ్యలో అందుకున్నాడు సుబ్బయ్య.



"ఏం జరిగింది? గుళ్లోకి వెళ్ళి చీవాట్లూ, దెబ్బలూ బాగా తినివచ్చావా?" అంటూ కసురుకున్నాడు.

"అబ్బా! నువ్వెపుడూ యింతే తాతయ్యా! నన్ను పూర్తిగా చెప్పనీయవు. నేనూ.... ఆ రోజునుండి గుళ్లోకి వెళ్లడం లేదుగా. మెట్ల దగ్గరే నుంచుని స్వామికి దండం పెట్టి వచ్చేస్తున్నాగా. మరే....తాతయ్యా.... యీ రోజుమైందంటే....నేను రోజూ నిలబడే చోటులో ఓ అబ్బాయి అడ్డుగా నిలబడివుంటే.... నేనేమో.... అది నా చోటూ.... అక్కణ్నుంచి కదలమని గట్టిగా చెప్పాను. పాప మా అబ్బాయికి కళ్ళు కన్పించవేమో.... ఎవరో ఆయానట. ఆ అబ్బాయి చేయి పట్టుకొని నడిపిస్తే నడుస్తున్నాడు. నేను స్వామికి దండం పెట్టి వాళ్ల ఎటు వెళ్లారో చూద్దామని చూస్తే వాళ్ళు కన్పించలేదు. తాతయ్యా! మరే.... ఆ అబ్బాయి కళ్ళు చాలా అందంగా ఉన్నాయి. పాపం చూపు ఎలా పోయిందో?" బోలెడు జాలిపడిపోతూ గుడిదగ్గర జరిగిన సంఘటనంతా తాతయ్యకు చెప్పింది శాంతి. కాస్సేపు ఆలోచించి, "ఎంత పని చేశావమ్మా? ఆ అబ్బాయి మనూరి ప్రెసిడెంటు గోపాల్రావ్‌గారి అబ్బాయి. ఈ మధ్యనే ఏదో రాయి తగిలి కళ్ళు పోయాయంట. మొన్ననే వచ్చాడు పట్నం నుంచి. ఆ అబ్బాయి నెందుకు

కసురుకున్నావ్? ప్రెసిడెంటు గారికి తెలిస్తే యింకేమయినా వుందా?" అంటూ రెండు దమ్ముల పొగ పీల్చి, చుట్ట ఆర్పేశాడు సుబ్బయ్య.

"ఆ అబ్బాయి ఎవరయిందీ నాకు తెలీదుగా!"

"ఇంకెపుడూ అటెళ్ళకు. మనకూ.... ఆళ్ళకూ.... జన్మల నుంచి పడదు. తెల్సిందా" శాంతిని హెచ్చరించాడు సుబ్బయ్య.

తాతయ్య చెప్పే మాటలు వింటూ అలాగే కూర్చుండిపోయింది శాంతి.

* * * * *

పక్షుల కిలకిలారావాలతో జగతి మేలుకుంటున్నది. ప్రెసిడెంటు గోపాల్రావ్ యింటిలో పూజామందిరం నుండి సుప్రభాతం వినరాసాగింది. అద్దాల తలుపుల నుండి లోపలికి చొచ్చుకొని వస్తున్న సూర్య కిరణాలను అరికట్టడాని కన్నట్లుగా అందమైన డిజైన్లతో వున్న కర్టెన్స్ గాలికి రెపరెప లాడుతున్నాయి. ఆ గ్రామంలో అందమైన డాబా అదొక్కటే. ఆ డాబాకు చుట్టూ చిన్న కంచెలాంటి తీగలు నాటబడ్డాయి. చిన్న గేటు. ఆ గేటు దాటి లోపలికి వెళ్తే చక్కటి అందమైన పూలతోట.

ఆ గ్రామంలో ఒక హైస్కూలు, ఒక చిన్న ఆసుపత్రి ఉన్నాయి. ఉన్న ఆ ఒక్క ఆసుపత్రిలోనూ ఎలాంటి వైద్య సదుపాయాలు గానీ సౌకర్యాలుగానీ లేవు. అత్యవసరమైన పరిస్థితుల్లో పెద్ద ప్రమాదాలు సంభవించినపుడు ఆ వూరికి పదిమైళ్ళ దూరంలో వున్న పట్నానికి వెళ్ళాల్సిందే. బస్సు సౌకర్యం ఉంది గానీ.... ఉదయం పది గంటలకూ; సాయంత్రం నాలుగు గంటలకు మాత్రమే పట్నానికి పోయే బస్సు లక్కడ ఆగుతాయి.

ఆ వూరి ప్రెసిడెంటు గోపాల్రావు. ప్రెసిడెంటు గోపాల్రావ్ మాటంటే ఆ వూళ్ళో అందరికీ హడల్. అతనిదే వేదవాక్కు. అతని భార్య పార్వతమ్మకు పూజాపునస్కారాలంటే చాలా యిష్టం. పెద్ద కూతురు కస్తూరి పెళ్ళయి ఏడాది గడిచిపోయింది. పెళ్ళికి చేసిన అప్పు తీర్చడానికి కొన్ని ఎకరాల భూమిని అమ్మేయాల్సి వచ్చింది అయినా గోపాల్రావ్ పరపతి ఆ వూళ్ళో తగ్గలేదు. ఆ వూళ్ళో వున్న ఏకైక ధనవంతులతనే. అందరూ అతని చెప్పుచేతల్లో నడచే వాళ్ళే. ఐశ్వర్య ముంది. అధికార బలముంది. అయితేనేం? అతని ఒక్కగానొక్క కొడుకు....అతని వంశోద్ధారకుడు....కిరణ్‌బాబు....అంధుడై పోయాడు. పట్నంలో పదవతరగతి చదువుతూ అక్క కస్తూరి యింట్లో ఉండేవాడు కిరణ్. ఆటల పోటీ సమయంలో పరుగెత్తుతున్నపుడు దురదృష్టవశాత్తు రాళ్ళ

గుట్టపై పడిపోయాడు. కళ్లకు గట్టి దెబ్బ తగిలింది. ఫలితంగా చూపుపోయింది. అక్కడి డాక్టర్లు ఏమీ చేయలేకపోయారు. గత్యంతరం లేక కిరణ్‌బాబును యింటికి తీసుకొచ్చేశారతని తల్లిదండ్రులు. ఆయాను కుదిర్చిన తర్వాత కిరణ్ బాబుకు రోజూ గుడికి రావడానికి వీలయింది.

ఎక్కడో మంచి తాయెత్తు లిస్తున్నారనీ.... రోగాలు నయమవుతున్నాయనీ పార్వతమ్మకు తెలిసింది. కిరణ్‌ను అక్కడకు తీసుకొని వెళ్ళి చూపించాలని ప్రయాణానికి ఏర్పాటు కూడా చేసింది. "బాబూ! కిరణ్! ఇంకా తయారు కాలేదా? టయిమయిపోతే స్వామీజీ వెళ్ళిపోతారు."

"నేను రానమ్మా.... నాకు ఏ తాయెత్తులూ వద్దు." పదహారేళ్ళ తన ముద్దుల కొడుకు నోటివెంట యీ పలుకులను విన్న ఆమె మాతృ హృదయం తల్లడిల్లిపోయింది.

"ఎందుకని కిరణ్ అలాగంటావు. నీ కెందుకింత వైరాగ్యం! నువ్వు పుట్టుగ్రుడ్డివి కావుగా అంతలా నిరాశపడటానికి. మా మంచి బాబువి కదూ..." బుజ్జగిస్తూ "ఆయా.. అన్నీ సిద్ధంచేయి." అంటూ ఆయాకు ఆజ్ఞాపించింది.

కిరణ్‌బాబును మెల్లగా నడిపించుకుంటూ.... జట్కాబండి మీద ఎక్కించి, పార్వతమ్మతోపాటుగా తనూ ఎక్కి కూర్చుంది ఆయా.

పొలాల మధ్య నుండి రోడ్డుమీదుగా యీసుకుపోసాగింది జట్కాబండి. పొలాల నుంచి మందంగా వీస్తున్న గాలి.... పక్షులు చేసే సవ్వడులు, గుర్రపు డెక్కల సవ్వడి అపుడపుడూ కార్ల హారన్.... అన్నీ విన్పిస్తూనేవున్నాయి. కాని.... కాని.... అంతా చీకటి.... నల్లని నలుపు.... చిమ్మచీకటి.... బ్రతుకే చీకటిమయం.... కిరణ్ హృదయం బాధతో మూలిగింది. కళ్ళు చెమర్చాయి. "ఎంతకాలమిలా తను యీ చీకటిలో నడవాలి? ఇపుడు తనకు ఆప్తులు.... స్నేహితులూ ఎవరు? ఈ చీకటా!? చీకటి.... ఇంకా ఎంత దూరమని నాతో కలసివస్తావు? చీకటితో సంభాషిస్తూ.... వెలుగులేని తన జీవితంలో స్నేహానికే తావుండదని బాధపడ్డాడు కిరణ్.

* * *

"శాంతీ! శాంతీ! ఏమ్పొద్దు నిద్రే నీది.... దర్జాగా నిద్రపోడానికి నువ్వేమయినా జమీందారు బిడ్డవా? లే....లేచి నాతోపాటు రా" అంటూ దుప్పటి లాగేసిన తల్లివైపు విసుగ్గా కళ్ళుతెరచి చూసింది. "అబ్బ! ఉండమ్మా!" అంటూ అటుతిరిగి పడుకున్న కూతుర్ని చూసి యింకా రెచి·పోయింది చంద్రమ్మ.

"ఇంకెపుడు లేస్తావే? అపుడే బారెడు పొద్దెక్కింది. కమలమ్మ వాళ్ళకు నువ్వు యీ రోజునుండి పాలు పోసి రావాలి. తెల్సిందా." అంటూ మాలతికి తల దువ్వి, పిన్నుతో కనకాంబరాలు నాలుగు గ్రుచ్చి.... అందంగా అమర్చింది. కొద్దిసేపటికి లేచి, గబగబా మొహం కడుక్కొని.... జడేసుకొని తల్లితో పాటుగా బయల్దేరింది శాంతి.

"కమలమ్మగారూ యీ రోజునుండి నా బదులు మా అమ్మాయి వచ్చి మీకు పాలు పోస్తుంది. నాకు కొద్దిగా పనుంది....అందుకనీ" తల్లి కమలమ్మతో చెబుతూ వుంటే శాంతి మౌనంగా నిలబడిపోయి ఆ యింటి కెదురుగా కన్పిస్తున్న అందమైన డాబావైపు కళ్లార్పకుండా చూడసాగింది. ఇటువైపుకు ఎపుడూ రాలేదు. అబ్బ! ఆ యిల్లు ఎంత బాగుందో! గేటు కూడా వుంది! ఆ యింటి ముందు ఎన్నెన్ని పూలమొక్కలో?! ఆ తోటలో కెడితే?! అనుకుంటూ సంబరంగా చూస్తూన్న శాంతి "ఇక పద...." అంటూ తల్లి తన చేయి పట్టుకోగానే తేరుకుంటూ....

"అమ్మా! అలాంటి యిల్లు కట్టుకుందామా" మురిపెంగా తల్లివైపు చూస్తూ అంది.

"అదీ... ప్రెసిడెంటు గోపాలావుగారి ఇల్లే పిచ్చిమొద్దా....మన మలాంటివి కట్టుకోవాలంటే పది జన్మలైనా ఎత్తాలి, తెల్సిందా."

"అమ్మా! నేను వాళ్లింటి కెళ్లనే. నువ్వే వెళ్ళు." అంటూ గోల చేసింది శాంతి. "చెప్పిన మాట వినకపోతే వీపు చీరేస్తా" అంటూ పొలంపనులకు వెళ్లిపోయింది చంద్రమ్మ.

ఇంటికెళ్ళి సుబ్బయ్య దగ్గర చేరి రాగాలు తీసింది శాంతి.

"ఏమిటి శాంతీ. నీ అల్లరి రోజురోజుకూ పెరిగిపోతూంది. నీ కసలు బుద్ధనేది వుందా? ఆ ఒక్క పన్లో అమ్మకు సాయం చేయలేవూ. ఆపాటి పని చెయ్యలేవా?" మెత్తగా మందలించాడు సుబ్బయ్య. తాతయ్య మందలించగానే శాంతి 'సరేనంటూ' తలాడించి, పుస్తకాల సంచి తీసుకొని.... స్కూల్‌కు పరుగెత్తింది.

* * *

సుబ్బయ్యకు యిద్దరు కొడుకులు. పెద్ద కొడుకు సీతారామయ్యను చంద్రమ్మ కిచ్చి పెళ్ళిచేశాడు. ఎంతో అన్యోన్యంగా ముచ్చటగా సంసారాన్ని సాగిస్తున్న ఆ దంపతులను చూసి....సుబ్బయ్య యెంతగానో ఆనందించేవాడు. రెండో

తరువాత పేజీల్లో చూడండి....




కొడుకు గోపి. అక్కడే ఎనిమిదో క్లాసు వరకు చదువుకున్నాడు. సుబ్బయ్య గోపాల్రావు తండ్రి అప్పటి ప్రెసిడెంటు భుజంగరావు యింటి పాలేరుగా పని చేశాడు. గోపి.... కలవారి కోపానికి ఎరగా మారి.... తనువు చాలించాడు. పెద్ద కొడుకు ఓదార్పు మాటలతో.... బాధను ఓర్చుకొని కాస్త నిలబడగలిగాడు సుబ్బయ్య. సీతారామయ్య, చంద్రమ్మల తొలి సంతానమే శాంతి. శాంతి మూమ్మూర్తులా గోపి పోలికే. మనవరాలిలో తన చిన్నకొడుకు గోపిని చూసుకొని ఆనందించేవాడు సుబ్బయ్య. అలా నాలుగేళ్ళు గడచిపోయాయి. అనుకోని విధంగా పొలానికెళ్ళిన సీతారామయ్య త్రాచు కాటుకు బలై మరణించాడు. అప్పటికి మాలతి పుట్టి నెలరోజులు కూడా కాలేదు. అయినా చంద్రమ్మ మనసు దిటవుచేసుకొని, కుటుంబ భారాన్ని తనే మోయ నిశ్చయించుకొంది. ఇద్దరు కొడుకులూ తన ముందే చనిపోవడం వల్ల సుబ్బయ్యకు జీవితమే స్తంభించి పోయినట్లయింది. వాళ్ళకు మిగిలిన ఆస్తి ఒక గేదె, ఒక చిన్న గుడిసె. చంద్రమ్మ పొలాలలో కూలీ పనులు కూడా చేయడానికి వెడుతూంటుంది.

ఆ గూడెంలో ఉన్న వాళ్ళందరికీ ఆ కుటుంబం పట్ల సానుభూతి మెండు. శాంతి అంటే వల్లమాలిన అభిమానం.

ఆ గూడెంలోని వాళ్లందరూ గ్రామ పెద్దలచే తక్కువ కులస్థులుగా వెలివేయబడ్డవారే. ఆ గూడెంలోని వారికి గుడిలో ప్రవేశం లేకపోయినా.... అక్కడి స్కూల్‌లో చదువుకోడానికి పట్టుబట్టి వీలు కల్పించారు శంకరం మాష్టారు. శంకరం మాష్టారు కొన్ని ఆదర్శాలతో బ్రతుకు గడుపుతున్న ఒంటరి మనిషి. ఆ వూళ్లోని వారందరికీ శంకరం మాష్టారిపట్ల మంచి అభిప్రాయముంది. ప్రెసిడెంటు గోపాల్రావు, శంకరం మాష్టారు మంచి స్నేహితులు. అయితే వారిద్దరి స్వభావాలకు, చేతలకు నక్కకూ నాగలోకానికి మధ్య వున్నంత వ్యత్యాసముంది. కులతత్త్వాలుండరాదని మాష్టారి అభిప్రాయమైతే.... కుల హీసులను నెత్తికెక్కించుకోరాదు; కులమతాల భేదాలను దేవుడే నిర్దేశించాడనీ; కులం తక్కువ వాళ్ళు అనాగరికులనీ.... వక్రబుద్ధి కలవారనీ.... గోపాల్రావ్ అభిప్రాయాలు. అభిప్రాయ భేదాలున్నా వారిద్దరి స్నేహంలో ఎపుడూ పొరపొచ్చాలు రాలేదు.

* * *

ఎండ పూర్తిగా తగ్గిపోయింది. చల్లటిగాలి తనువుకూ, మనసుకూ హాయినిస్తూ వీస్తూ వుంది. తోటలో సిమ్మెంటు బెంచీమీద కూర్చొని గోపాల్రావు, శంకరం గంట నుంచి, అదేపనిగా వాదించుకుంటున్నారు. ఆ వాదనలు తెగేవికావు.

"నువ్వేన్నయినా చెప్పు. కులహీనులనీ, వెనుకబడిన జాతి, వర్గమనీ.... ఆ గూడెంలోని వాళ్లను అంటరానివాళ్లుగా నిర్ణయించడం ఏమీ బాగాలేదు. వాళ్లంతా క్షుద్రులనీ అనామకులనీ నీవనే మాటల నే నొప్పుకోను. వాళ్ల విధిచేత పరిహసించబడి అలాగయిపోయారే కాని.... లేకపోతే వాళ్లూ నాగరికులే. సభ్యతా సంస్కారాలు గల మంచివాళ్లే. ఈ సమాజమే.... వాళ్లనలా తన పాదాలక్రింద త్రొక్కిపట్టి వుంచింది. నువ్వు కుల మతాల వాదాలకు దిగకుండా వాళ్ల హృదయాల్లోకి ఓసారి చూడు.... మానవత్వమనే జ్యోతి వాళ్లలో ఎలా వెలుగుతుంటుందో గమనించగలవు."

శంకరం మాటలకు గోపాల్రావ్ గట్టిగా నవ్వాడు.

"ఆదర్శాలంటూ ఏవేవో వల్లిస్తావే గానీ.... నీవూ ఎప్పటికయినా తెలుసుకుంటావు. ఈ అనాగరికులెంత నిజాయితీపరులో ! వాళ్ల జాతి ఎలా వెనకబడి వుందో అలానే వాళ్ల బుద్ధులు కూడా హీనమైనవే. అది కూడా నువ్వు తెలుసుకుంటావు."

గోపాల్రావ్ మాటలు శంకరాన్ని బాధించాయి.

"గోపాలం నీలో చాలా మార్పు రావాలిరా! నీ అంతట నువ్వే తెలుసు కోవాలి. హీనమైనవారనీ, కులహీనులనీ, నువ్వు ఎవరినైతే నీచంగా భావిస్తు న్నావో వాళ్లల్లోనే ఎంతటి ఉదారత్వ ముంటుందో నీ అంతట నువ్వే తెలుసు కుంటావు. ఆ రోజు తప్పక రావాలి.... వస్తుంది కూడా." అంటూ అక్క ణ్నుంచి కదిలారు శంకరం మాష్టారు.

అతను వెళ్ళిపోగానే ఆలోచనల్లో పడిపోయాడు గోపాల్రావు. అతని ఆలో చనల కంతరాయం కల్గిస్తూ యింటిముందు జట్కాబండి వచ్చి ఆగింది. ఆయా కిరణ్‌ను జాగ్రత్తగా క్రిందకు దింపి లోపలికి తీసుకెళ్లింది. "అక్కడికి వెళ్ళిన పని ఏమయింది?" అడిగాడు గోపాల్రావ్. "తాయెత్తు కట్టించాను. స్వామీజీ ఎప్పటికయినా కిరణ్‌బాబుకు చూపు వస్తుందనే చెప్పారు." భర్తతో చెప్పి, లోపలికి వచ్చేసింది పార్వతమ్మ.

* * *

మరునాడు తల్లి చెప్పినట్లే కమలమ్మకు పాలు తీసుకొనివెళ్ళి యిచ్చింది. తిరిగి గిన్నె తీసుకొని వస్తున్న శాంతి పాదాలు డాబాయింటి గేటు దగ్గర ఆగి పోయాయి. గేటు తెరిచే వుంది. బయట మనషు లెవ్వరూ లేరు. గేటు లోపలికి తొంగిచూసింది. అక్కణ్నుంచి కన్పిస్తున్న పూలమొక్కల అందాల్ని తనివి తీరా చూస్తూ నిలబడిపోయింది. లీలగా మృదు మధురంగా ఎవరో పిల్లనగ్రోవి వాయిస్తున్నట్లుగా శాంతి వీనులకు పిల్లతెమ్మెర సమాచార మందించింది. అటు యిటు పరికించి చూసి, అప్రయత్నంగా తోటలోకి నడిచింది. ఆ రోజు గుడి దగ్గర కన్పించిన అబ్బాయి మల్లెపందిరి కింద కూర్చుని ఎంతో తన్మయత్వంగా పిల్లనగ్రోవి వాయిస్తున్నాడు. ఆ దృశ్యం చూసిన శాంతి చకితురాలయింది. నెమ్మదిగా అటువైపుకు అడుగు లేసింది. కాలి అందెలు ఘల్లు మన్నాయి. కాలి అందెల సవ్వడి విని "ఎవరది?" అంటూ ప్రశ్నించాడు కిరణ్. "నేను.... నేను .... నేను శాంతిని...." జవాబు విన్న కిరణ్ "శాంతి అంటే....?" అడిగాడు.

"నేను .... నేను అదే.... సుబ్బయ్యతాత మనవరాలిని.... గుడిదగ్గర.... మిమ్మల్ని...." అంటూ ఆగిపోయింది....

"ఆ.... గుడిదగ్గర నీ చోటులో నుండి నన్ను జరగమన్నది నీవేనా?.... నీ పేరు శాంతా? బాగుంది...." అన్నాడు.

"ఆ.... అవును.... గుడిదగ్గర మీ గురించి ఏమీ తెలీక ఏదో వాగేశాను.... నన్ను క్షమించండి బాబూ...." దీనంగా అర్థించింది శాంతి.

"ఏమీ తెలీక.... అంటే....? యిపుడు తెలిసిందా....నాకు చూపు లేదనీ....-బాధగా అంటూన్న అతని మోముపై విచారరేఖలు చూసి. చలించిపోయింది శాంతి.

"బాబుగారూ. అలాగని మీరు బాధపడకండి....మీరు చాలా మంచివారు.... మీకు తప్పకుండా చూపువస్తుంది. నేనేది చెప్పినా నిజమవుతుందని మా తాతయ్య చెప్తూంటాడు కూడా....మీకు తప్పకుండా చూపు వస్తుంది." ఎంతో నమ్మకంగా ....ఏదో ఆత్మీయతతో చెబుతున్న శాంతి రూపాన్ని చూడాలన్పించింది కిరణ్‌కు. కానీ.... చీకటి నీడలు అతని కోరికను నెరవేర్చలేకపోయాయి.

"బాబుగారూ! మీకు పిల్లనగ్రోవి వాయించటం బాగా వచ్చా? మీరు వాయిస్తుంటే యింకా యింకా వినాలన్పిస్తుంది. అది వినే.... యిక్కడికి వచ్చాను. ఇక నేను వెళ్తాను బాబుగారూ.... స్కూల్‌కు ఆలశ్యంగా వెళ్తే శంకరం మాష్టారు క్లాసులోనికి రానివ్వరు," మెల్లగా అంది.

"అయితే.... పిల్లనగ్రోవి ఎవరు వాయిస్తున్నారో చూద్దామని వచ్చావన్న మాట. ఏం చదువుకుంటున్నావు?" అడిగాడు.

"ఎనిమిదో క్లాసు" చెప్పింది శాంతి.

"నీవు మాట్లాడుతూంటే....నాకెంతో బాగా వుంది. నే నొక్కడ్నే ఇక్కడ కూర్చుంటుంటాను. నాకు స్నేహితులు కూడా ఎవరూ లేరు. అసలే చూపు పోయి గుడ్డివాణ్ణయ్యానుగా.... అంతా చీకటే.... ఎవరూ ఏ కబుర్లూ చెప్పరు. అమ్మ లోపల పని చూసుకుంటూ వుంటుంది. ఆయా....పదిగంటలకు వచ్చి.... సాయంత్రం వెళ్ళిపోతూంటూంది. నీలా చక్కగా కబుర్లు చెప్పేవాళ్ళే లేరిక్కడ. శాంతీ.... నువ్వు రోజూ యిక్కడకు వస్తుంటావా? నీవు పలకరిస్తూంటే.... ఎంతో హాయిగా; తృప్తిగా వుంది." ఆతృతగా అడిగాడు కిరణ్. కిరణ్‌కు పట్టిన గతి చూసి చాలా బాధపడిపోయింది శాంతి. "అలాగేనండీ.... రోజూ.... వస్తూంటాను. ఇక నే వెడతాను బాబుగారూ...."

"నన్ను యిక నుండి బాబుగారని నువ్వు పిలవవద్దు. నువ్వూ నేనూ స్నేహితులం మరి. అందుకనే నన్ను కిరణ్ అనే పిలుపు శాంతీ." చెప్పాడు కిరణ్.

"అలాగే.... కిరణ్‌బాబూ.... మళ్లీ వస్తా" నంటూ వెళ్లిపోయింది శాంతి.

*   *   *

శాంతి వెళ్లేసరికి శంకరం మాష్టారు పద్యాలు శ్రావ్యంగా పాడి విన్పిస్తూ.... అర్థాలు విశదీకరిస్తున్నారు. ఆలస్యంగా వచ్చిన శాంతివైపు తీక్షణంగా చూశారు

మాష్టారు. "ఏమిటి శాంతీ యింతాలస్యం? ఇంకెపుడూ యిలా ఆలస్యంగా రాకు. లోపలికి రా"

లోపలికి వచ్చి కూర్చుందన్న మాటేగాని శాంతికి మాష్టారు చెప్పే పాఠాలేవీ అర్థంకావడం లేదు. జాలిగొలిపే కిరణ్ మోము పదే పదే గుర్తుకువస్తూంది.

'ఎంత దురదృష్టవంతుడు కిరణ్!? చూపు పోకుండా వుంటే ఎంత బాగుండేది? తనతో స్నేహం చేయాలని వుందట!' కిరణ్ గురించి ఆలోచిస్తున్న శాంతి కళ్లల్లో కన్నీళ్ళు లీలగా కదిలాయి. బెల్ ఎపుడు కొట్టారో.... పిల్లలు గేమ్స్‌కు ఎపుడు వెళ్ళిపోయారో గాని.... మాష్టారుగారు పిలిచేంతవరకు శాంతికి తెలియనే లేదు.

"ఏమిటి శాంతీ! నీకు యీ రోజేమైంది? ఆలస్యంగా వచ్చావు. డల్‌గా అలా కూర్చున్నావేమిటి?" లాలనగా మాష్టరుగారు అడిగేసరికి కొద్దిసేపు తటపటాయించింది.

"మాష్టారూ! ప్రెసిడెంటుగారి అబ్బాయి కిరణ్‌బాబుకు కళ్ళు పోయాయి కదా.... మంచివాళ్లకెందుకు మాష్టారూ దేవుడిన్ని రకాలుగా బాధిస్తాడు. కిరణ్ బాబుతో యీ రోజూ మాట్లాడానండీ.... ఎంత బాగా మాట్లాడ్తాడో. గొప్పవాళ్ల అబ్బాయి కదా....అసలు గర్వమే లేదు. పైగా నాతో స్నేహం చేస్తాడట." ఆరిందలా చెప్పుకు పోతున్న శాంతివైపు ఆప్యాయంగా చూశారు మాష్టారుగారు.

చిన్న వయసులో పెద్ద పెద్ద ఆలోచనలు.... శాంతి మనస్తత్వం బాగా తెలిసిన శంకరం మాష్టారికి శాంతి అంటే ఎంతో ప్రేమ. "అయితే.... యీ రోజు కిరణ్ గురించి ఆలోచిస్తూ నువ్వు పాఠం కూడా సరిగ్గా విన్లేదన్నమాట. కిరణ్ చూపు పోయింది గాని.... ఏ డాక్టరూ చెప్పలేకపోతున్నాడు కిరణ్‌కు చూపు వస్తూందో లేదో.... సంశయంగానే వుంది.... ఇంతకూ నీకు మంచి స్నేహితుడు దొరికాడన్నమాట!" మాష్టారి చివరి మాట విన్న శాంతి చిన్నగా నవ్వుకుంది.

* * * * *

స్నేహమంటే.... అది దేవుడిచ్చిన గొప్ప వరం. ఆ స్నేహంలో పేదా, గొప్పా భేదాలుండవు. నిర్మలమైన పసిహృదయాలలో మల్లెపువ్వుల స్వచ్ఛత ఉంటుంది. ఆ స్నేహంలో వారికి తెలిసిందొకటే....అది వెన్నెలంత చల్లని ఆత్మీయత. ఆ స్నేహానికి తెలిసిందొకటే భాష....అదే....నిష్కల్మషమైన

మమతానురాగం. రంగుభేదాలు, అంతస్థుల తారతమ్యత.... పెద్దలకు తెలిసిన కులమత భేదాలు _ ఇవేవీ తెలియకుండా ఎదుగుతున్న సున్నితమైన హృదయాలు వారిరువురివి. మంచుతో కడిగిన మల్లియలు ఆ మనస్సులు. కొద్ది రోజులకే శాంతి కిరణ్‌ల మధ్య స్నేహం పెంపొందింది ... విడలేని బంధంగా మారింది. శాంతి స్నేహంతో ప్రకృతి నంతటినీ మనస్సుతో చూడగలుగుతున్నాడు కిరణ్. తను చూసినవాటి గురించి, అన్నీ కళ్ళకు కట్టినట్లుగా వర్ణించి చెప్పే శాంతిపట్ల అనురాగాన్ని పెంచుకున్నాడు కిరణ్.

* * *

మల్లెపందిరి కింద కూర్చుని ఏదో ఆలోచిస్తున్న కిరణ్‌కు ఘల్లుఘల్లుమంటున్న కాలి అందెల సవ్వడి వినబడి శాంతి వచ్చిందని గ్రహించాడు. "కూర్చో.... శాంతీ!" అన్నాడే గాని... మళ్ళీ దీర్ఘాలోచనలో పడిపోయాడు.

"ఏమిటి కిరణ్.... ఆలోచిస్తున్నారు?" అడిగింది శాంతి.

"నాకు చూపు వస్తుందంటావా శాంతీ! ఇలా ఎంతకాలమని చీకటిలో ఉండిపోవడం! అమ్మ నా గురించి ఎంత బాధపడుతుందో చూడకపోయినా తెలుస్తూనే వుంది. ఒక్కోసారి నా కేమనిపిస్తుంటుందో చెప్పనా! ఈ చీకటిని భరించేకంటే చచ్చిపోతే బాగుండునని అన్పిస్తూంటుంది." నిరుత్సాహంతో ఎంతో వేదనతో అంటున్న అతని మాటలకు చలించిపోయింది శాంతి.

"ఆ మాటలేమిటి కిరణ్‌బాబూ.... మీకు తప్పకుండా చూపు వస్తుంది.... ఎప్పుడూ అలా నిరాశగా మాట్లాడవద్దు. తప్పకుండా మీకు చూపువస్తుంది." నమ్మకంగా అంటున్న శాంతిమాటలు తనకు జీవించాలనే ఆశను కల్పిస్తున్నాయి. తన కళ్ళల్లో వేయిదీపాలు వెలుగుతాయనే నమ్మకం కలుగుతూవుంటుంది.

"శాంతీ! నీవు చెప్పే ధైర్యం, నీ మాటలూ యివే చాలనిపిస్తుంది నాకు. కళ్ళు వస్తే.... నిన్ను.... నిన్నే మొదటగా చూడాలని కూడా వుంది." అన్నాడు కిరణ్ ఆనందంగా.

"అలాగే.... తప్పకుండా" అంటూ నవ్వబోయిన శాంతి ఎదురుగా తీక్షణంగా చూస్తున్న గోపాల్రావ్‌ను చూసి మూగబోయింది. "కిరణ్!" గర్జనలాంటి ఆ పిలుపుతో స్తబ్దురాలయింది శాంతి.

"కిరణ్ ! అలగాజనంతో ఏవిటా కబుర్లు! అసలా పిల్ల యిక్కడి కెందుకు వచ్చింది? ఇంకెపుడూ ఆ అమ్మాయితో మాటాడకు. తెల్సిందా.... అయా !



అబ్బాయిని గదిలోకి తీసుకెళ్ళు" గోపాల్రావ్ హుకుం జారీచేయగానే అపుడే అక్కడకు వచ్చిన ఆయా కిరణ్‌ను లోపలికి తీసుకెళ్ళింది.

"ఏం? కోటలో పాగా వేద్దామని ప్రయత్నిస్తున్నావా? యిక్కడికి వచ్చి, కిరణ్‌తో మాట్లాడటానికి నీ కెంత ధైర్యం! చేసిన స్నేహం చాలుగానీ.... యిక దయచేయ్" అంటూ గోపాల్రావ్ గదిమేసరికి శాంతి కళ్ళు... కన్నీటి చలమలయ్యాయి. తడబడే అడుగుల్తో వ్యధాభరితమైన హృదయంతో గేటు బయటికి నడిచి....ఇంటికి చేరుకుంది.

ప్రెసిడెంటు ఎంత కోపంగా అలగాజనమంటూ తనని తిట్టాడో తల్చుకుంటూంటే దుఃఖమాగడం లేదు శాంతికి. నులకమంచం వేసుకొని.... కళ్లు మూసుకొని పడుకుంది. అపుడే యింటికి వచ్చిన సుబ్బయ్యకు ఎన్నడూ లేనిది

శాంతి అలా పడుకోవటం ఆశ్చర్యాన్ని కలిగించింది. దగ్గరగా వెళ్ళి నుదుటిమీద చెయ్యివేసి చూశాడు. జ్వరమేమీ లేదు. మామూలుగానే వుంది.

"శాంతీ! ఏవిటి తల్లీ అలా వున్నావ్" తాతయ్య అడిగేసరికి జరిగినదంతా చెప్పి, "తాతయ్యా! కిరణ్‌బాబుతో మాటాడటం కూడా తప్పేనా ?" అంటూ వెక్కి వెక్కి ఏడ్చింది శాంతి.

"లేదమ్మా.... స్నేహం చేయడం తప్పుకాదు తల్లీ!....అసలు సంగతి వేరే వుంది. అది నీకు చెప్పినా అర్థంకాదు. వాళ్ళు.... వాళ్ళు గొప్పోళ్ళు. మనం పేదోళ్ళం. వాళ్ళతో మనకు స్నేహాలు ఎందుకు ? ఇక....అక్కడి కెళ్ళకు" శాంతిని ఓదార్చి ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు సుబ్బయ్య. గతం తాలూకు విషాదచ్ఛాయలు అతని మోముపై క్షణకాలం అల్లుకున్నాయి. తనలో తానేదో గొణుక్కుంటూ చుట్ట వెలిగించుకున్నాడు.

* * *

జరిగిన సంఘటనకు, తండ్రి ప్రవర్తనకు ఖిన్నుడైపోయాడు కిరణ్. 'శాంతి ఎంత బాధపడి వుంటుందో ?' ఆలోచించే కొలది తండ్రి చేసిన పని పట్ల మనస్సంతా చికాకుతో నిండిపోయింది. ఆనాటి సంఘటన తర్వాత అతనికి శాంతి తటస్థపడనేలేదు. ఆయాతోగాని తల్లితోగాని కలసి గుడికి వచ్చినపుడు శాంతి స్వరం ఎపుడయినా విన్పిస్తుందేమోనని జాగ్రత్తగా గమనించేవాడు. కాని....ఎక్కడా శాంతి జాడలే కానరాలేదు. అయినా ఏదో ఆశతో అయాను తీసుకొని గుడికి వస్తూనే ఉన్నాడు. మామూలుగా ఆరోజు కూడా గుడికి వచ్చాడు కిరణ్. దూరంగా శాంతి స్వరంతోపాటు.... కాలిమువ్వల శబ్దం కూడా విన్పించనట్లయి "ఆ వచ్చేది శాంతేనా...." అయా నడిగాడు.

"అవును బాబూ.... కానీ.... మీ నాన్నగారు...." అయా మాట పూర్తికాకుండానే" అయా.... ముందు శాంతి నిక్కడకు పిలు. నాన్నగారికి తెలియాల్సిన అవసరం లేదులే" దృఢంగా అన్నాడు.

దూరంగా వెళ్ళిపోబోతున్న శాంతిని ఆయా పిలిచింది. వెనక్కి తిరిగి వచ్చిన శాంతి కిరణ్‌ను చూసి....మాట్లాడకుండా నిలబడిపోయింది. శాంతి వచ్చిందని ఆయా చెప్పేసరికి "శాంతీ! పిలిచినా మాట్లాడకుండా ఉన్నావేం ? శాంతీ ! నాన్నగారి మాటలకు నే నెంతో బాధపడ్డాను శాంతీ ! నా కారణంగా నువ్వు మాటపడ్డావు. నన్ను క్షమించు శాంతీ."

"కిరణ్ బాబూ ! మీ రంతలేసి మాటలనొద్దు. మేము లేనోళ్లం. మీరు

గొప్పోళ్ళు. ఆ విషయం తెలిసీ.... మీతో స్నేహం చేశాను. ఆ రోజు పెద్ద బాబుగారి చూపుల్లో పడిపోయాను. అప్పటివరకూ నాకీ జ్ఞానమే లేదు." మెల్లగా పెదవి విప్పింది శాంతి.

"కిరణ్ ! ఆ పొగడపూల చెట్టుక్రిందకు వెళ్దాం. ఇక్కడే నుంచొని మాటాడుకుంటే బాగుండదు." సలహా యిచ్చింది ఆయా. ఆయాతోపాటు నడిచాడు కిరణ్. శాంతి వాళ్ళిద్దరినీ అనుసరించింది.

"శాంతీ ! నాన్నగారి మాటలు నిన్నింతగా బాధించడం సబబే.... కాదనను. కానీ.... మనిద్దరి స్నేహంలో అలాంటి వాటికి తావులేదు. నా చీకటి జీవితంలో నీ స్నేహం నాకు వెలుగురేఖలా కన్పించింది. శాంతీ ! ఈ సమయానికే రోజూ వస్తుంటాను.... ఇక్కడికి నువ్వూ వస్తూండు." అర్థిస్తున్న కిరణ్ మాటలను త్రోసిపుచ్చలేకపోయింది శాంతి. వాళ్ళిద్దరి స్నేహాన్ని చూసి మెచ్చకుండా ఉండలేకపోయింది ఆయా.

* * *

శాంతికి పదహారేళ్ళు నిండాయి. చదువు మానేసింది. ఇంటిపట్టునే వుంది.... చెల్లెలు మాలతికి తెలియని పాఠాలు చెబుతూ.... యింటిపనులు చూసుకుంటూ గడపసాగింది. ప్రతి రోజూ గుడిదగ్గరకు వెళ్లడం మాత్రం మానలేదు. కిరణ్‌తో స్నేహంగానే ఉంటుంది. కాని....ఏదో బెదురూ.... జంకూ క్రొత్తగా అలవడుతున్నాయి. కిరణ్‌లో కూడా మార్పు వచ్చింది. కొద్దిగా ఎత్తు పెరిగాడు. అతని కంఠస్వరంలో కూడా కొద్దిగా మార్పు వచ్చింది. ఒకరోజు శాంతి పొగడచెట్టుక్రింద కూర్చొని "కిరణ్ ! నేను పారిజాత పుష్పాల మాల తెచ్చాను. నువ్వు గుళ్ళోకి వెళ్ళినపుడు లింగానికి యీ మాల వేస్తావా ?" సంశయిస్తూ అన్నది.

"నిన్నెపుడు గుళ్లోకి రమ్మన్నా రావేమిటి ? ఎపుడూ గుడి బయట మెట్లదగ్గర నిలబడే నమస్కరిస్తానంటావు. ఎందుకని ?" ప్రశ్నించాడు.

"అదంతే కిరణ్.... మాది తక్కువ కులమట. గోత్రం లేని వారమట. మాది వెనుకబడిన జాతి. మాలాంటి వాళ్ళు గుడిలోపలికి రాకూడదు. మాకు అన్నీ పత్యేకతలే ! ఒక గూడెం; ఒక బావి ... అన్నీ ప్రత్యేకతలే." అంది.

"శాంతీ ! అవన్నీ మనుషు లేర్పరచుకున్నవే. దేవుడి దృష్టిలో అందరూ సమానమే. అటువంటపుడు గుడి లోపలికి ఎందుకు రాకూడదు ?"

"ఎందుకంటే.... ఎలా చెప్పను ? పూల విషయం తీసుకో. కొన్ని పూలు

ఆడవాళ్ల సిగలో అందంగా అమరిపోతాయి. మరికొన్ని మొగ్గ దశలోనే వాడి పోతాయి. కొన్ని పూలేమో పూస్తాయి గాని....రాలిపోయి మట్టిలో కలసిపోతాయి. ఎక్కడో కొన్ని పూలు మాత్రం ఆ దేవుని ఆరాధనకు నోచుకుంటాయి. ఇప్పుడు చెప్పు కిరణ్. గడ్డిపూవులాంటి నేను....దేవుడి సన్నిధిలో నిలవగలనా?" కంఠం గద్గదమయింది శాంతికి. కిరణ్ కొద్దిసేపటివరకు మాట్లాడలేకపోయాడు.

"నువ్వు.... పారిజాత పుష్పానివి శాంతీ! పారిజాతాలు రాలిపోయి కూడా దేవుని పూజకు ఉపయోగపడ్తాయి. నిన్ను నీవు కించపరచుకోకు. అసలు.... యిలా ఎప్పట్నుంచి నీవు.... మీవాళ్ళు గుడిలోకి రావడం మానేశారు?" అడిగాడు.

"చెబుతాను కిరణ్! నా కెప్పుడూ యీ గుళ్లోని దేవుణ్ని కనులారా చూసి సేవించాలనీ, రెండు చేతులూ జోడించి ఆ స్వామి సన్నిధిలో నిలబడి ధ్యానించాలనీ వుంటుంది. ఒక రోజు.... నా చిన్నపుడు ఒకసారి.... గుడి లోపలికి వెళ్లాను. ఇంతలో పూజారి తాతయ్య వచ్చి నన్ను వెళ్లిపొమ్మని మందలించాడు. నేను వినలేదు. అపుడు ఈ వూరి పెద్దలకు తెలిసి.... మరోసారి గుడికి వచ్చినపుడు బాగా కొట్టించారు. నన్నూ, మా నాన్ననూ.... అందరినీ తిట్టారు. నేను ఎదురు తిరిగి, నేను చేసిన తప్పేమిటన్నాను. అంతే నా వీపు దెబ్బలతో వాతలు పడి పోయింది. మా గూడెం వాళ్లందరినీ హెచ్చరించారు. ఇకముందు మీలో ఎవరైనా గుడిలో ప్రవేశిస్తే అంతేనని.... రెండో రోజున.... మా గుడెంలోని కొందరు కుర్రాళ్ళు.... మునసబుగారి గడ్డివాముల్ని తగులబెట్టేశారు. ఆ విషయం తెలుసుకొని.... వాళ్లను పట్నం పోలీసులకు అప్పగించారు.... ఆ తర్వాత ఆ నలుగురి శవాలు మాత్రమే ఊరికి చేరాయి. ఇంత జరగడానికి నేనేగా కారణం.... అయినా.... గుడి బయటనే.... మెట్ల దగ్గర నిలబడి ఆ స్వామికి దండం పెట్టుకొని రావడం అలవాటయిపోయింది," అంటూ చెప్పి; చెమ్మగిల్లిన తనకళ్లను తుడుచుకుంది శాంతి. అంతా విని కిరణ్ నిశ్చేష్టుడయ్యాడు.

అక్కడ దగ్గరే వుండి చదువుకుంటూ పట్నంలో ఉండిపోయిన తనకు యీ విషయాలేవీగానీ.... గ్రామంలో జరుగుతున్న అన్యాయాలుగాని తెలియవు. శాంతి చెబుతుంటే ఇవన్నీ యీ ఊళ్లొనే జరిగాయా అని ఆశ్చర్యంగా వుంది కిరణ్‌కు.

"శాంతీ! ఇన్ని రోజుల నుండీ.... యీ విషయాలేవీ నాకు చెప్పలేదేం?" అన్నాడు కిరణ్.

అంత బాధలోనూ నవ్వింది శాంతి.

"చెబితే, యీ ఊళ్లో పెద్దల అభిప్రాయాల్ని మార్పించేవాడివా?" ప్రశ్నించింది

"నిజమే. మార్పు సహజసిద్ధంగా రావాలి. ఈ కులమతాల పట్టింపులతో తోటి మనిషి జీవితాన్నే నాశనం చేస్తున్నారెందరో. సరే.... ఆ పారిజాత పూల హారం యిటివ్వు." అంటూ తీసుకొని, ఆయాతో కలిసి గుడివైపుకు నడిచాడు కిరణ్. కిరణ్ దగ్గర శలవు తీసుకొని.... యింటికి బయల్దేరింది శాంతి.

* * *

ఒకరోజు శంకరం మాష్టారు కిరణ్‌ను, గోపాల్రావ్‌ను తీసుకొని పట్నానికి వెళ్ళారు. అక్కడ.... శంకరం మాష్టారి బంధువు డాక్టర్ కృష్ణమోహన్.... నేత్రరోగాలను నయం చేయడంలో దిట్ట. అమెరికాకు వెళ్ళి మరిన్ని క్రొత్త విషయాలు నేర్చుకుని కంటి ఆపరేషన్లు చేయడంలో ప్రావీణ్యతను సంపాదించు కొని వచ్చిన డాక్టర్ ఆయన. అక్కడ డాక్టర్ కృష్ణమోహన్ గోపాల్రావ్ ద్వారా అన్ని విషయాలూ తెలుసుకొని, కిరణ్‌ను పరీక్షించారు. ఏవో టెస్టులు కూడా చేసి.... మరుసటి రోజుకు రండి, రిపోర్టు చూసి చెబుతానని డాక్టరు చెప్పగానే ముగ్గురూ తిరిగి ఊరికి వచ్చేశారు.

మర్నాడు ఉదయాన్నే గోపాల్రావ్ పట్నానికి వెళ్లడానికి నిశ్చయించు కున్నాడు.

"పార్వతీ! నేను పట్నాని కెడుతున్నాను. ఈరోజు డాక్టరుగారు రిపోర్టు చూసి చెబుతానన్నారు. నిన్ననే కిరణ్‌ను పరీక్షించారు కదా....ఈరోజు కిరణ్ రానవసరంలేదు. నేను వెడుతున్నాను. శంకరం వస్తే నేను డాక్టరుగారి దగ్గరి కెళ్ళానని చెప్పు," అని భార్యతో చెప్పి బయటకు నడిచాడు గోపాల్రావ్.

అపుడే ఎదురింటినుండి ఖాళీ పాలగిన్నె తీసుకొని వస్తూ ఎదురయిన శాంతిని చూడగానే మండిపడ్డాడు గోపాల్రావ్. శాంతివైపు క్రోధంగా చూస్తూ, "ఛీ... ఛీ! వెధవశకునం....శుభమా అంటూ బయల్దేరితే పాడు శకునం ఎదురయింది" అంటూ లోపలికి వచ్చేసి, అయిదు నిమషాలవరకు ఆగి, దేవుడిపటం చూసి.... మళ్లీ బయల్దేరాడు గోపాల్రావ్.

ప్రెసిడెంటు గోపాల్రావ్ అన్న మాటలు సూటిగా శాంతి హృదయానికి ముళ్లలా తగిలాయి. బాణం దెబ్బకు గురయిన పక్షిలా విలవిలలాడిందా మనస్సు.

అసలు ఆరోజు తలనెప్పిగా వుంది శాంతికి. పాలు సమయానికి అందక పోతే కమలమ్మ అవస్థపడాల్సివస్తుందని ఆ తలనెప్పితోనే పాలు అందించి

వస్తూంటే గోపాల్రావ్ మాటలు వెయ్యిసమ్మెట్ల పోటులా అన్పించింది శాంతికి. నీరసంగా యింటికి వచ్చి, అన్యమనస్కంగానే ఆ పని యీ పనీ చేసి పేను వాల్చిన శాంతి మదిలో బాధ. తీరని అశాంతికి గురయిన కారణంగా.... ఆ రోజంతా తలనెప్పి అధికమై బాధపడింది. రాత్రి గడిచి తెల్లారినా ప్రతిరోజులా లేవలేకపోయింది. అలాగే కళ్ళుమూసుకొని పడుకున్న కూతుర్ని చూసి "తలనొప్పి ఎక్కువయిందా? ఎక్కడికీ వెళ్ళకుండా నిద్రపో. విశ్రాంతి తీసుకో. కమలమ్మ దగ్గరికి నే వెళతానులే" అని చెప్పి, మాలతికి జడవేసి, బడికి పంపించి తను వెళ్ళిపోయింది.

"జ్వరంగాని వచ్చిందేమిటి?" అనుకుంటూ నుదుటిమీద చెయ్యివేసిన సుబ్బయ్య చెయ్యి చురుక్కుమంది.

"జ్వరం వచ్చింది. ఆచార్లు దగ్గర కెళ్ళి ఏదైనా మాత్ర తెస్తానుండు," అంటూ బయటకు వెళ్ళి, ఆచారి దగ్గర్నుండి ఏవో గుళికలు తెచ్చి, శాంతిచేత మింగించి, పజ్జిగ తాగించాడు. ఒళ్ళు పడుకుంది. రెండు రోజులవరకూ మూసిన కన్ను తెరవలేకపోయింది శాంతి. శంకరం మాష్టరుగారు వచ్చి చూసి,

"మందులేమిస్తున్నారు?" అన్నారు.

"ఆచారిగారు ఏవో గుళికలు యిచ్చారండి. అవే వాడుతున్నాము." చెప్పాడు సుబ్బయ్య.

"అయితే యీ రోజు ఆ గుళికలు వేయకండి. నా దగ్గర క్రోసిన్ మాత్రలున్నాయి. పంపిస్తాను. అవి వేయండి. ఆ గుళికలతో జ్వరం తగ్గదు," అని చెప్పేసి యింటికెళ్ళి టాబ్లెట్లు పంపించారు శంకరం మాష్టారు.

ఆరోజు శాంతికి జ్వరం ఎక్కువగా వచ్చేసింది. మూసుకున్న కళ్లనుండి కన్నీళ్లు.... కంటికొనలనుండి జారుతూ దిండు తడిసిపోయింది.

"శాంతీ! నిద్రలో ఏడుస్తున్నావా?" అదుర్దాగా అడిగింది చంద్రమ్మ.

"లేదమ్మా....కళ్ళు బాగా మండుతున్నాయి." ఒక్కొక్క పదం ఒత్తి పలుకుతూ నీరసంగా చెప్పి, మగతనిద్రలోకి జారుకుంది శాంతి.

ఆ రాత్రంతా ఏదేదో కలవరిస్తూనే వుంది శాంతి.

"నేనేమీ పాడుశకునాన్ని కాను.... నేను చెడ్డదాన్ని కాను.... నేనూ మంచి దాన్నే...." ఇలా ఏవేవో పలవరింతలు. నిద్రలోనే వెక్కుతూ వుంది శాంతి. శాంతి పరిస్థితి సుబ్బయ్యకేమీ అర్థంకాలేదు. చంద్రమ్మ మటుకు నిద్రపోకుండా కూతురు ప్రక్కనే కూర్చొని రాత్రంతా గడిపింది. మాష్టరుగారు పంపించిన మాత్ర వేసిన తర్వాత కొద్దిసేపటికి జ్వరం కొద్దిగా నిమ్మళించింది.

తరువాత పేజీల్లో చూడండి....




మరుసటి రోజుకు జ్వరం కొద్దిగా తగ్గింది. చంద్రమ్మ పొలం పనులకు వెళ్లిపోయింది. మాత్రలన్నీ అయిపోయాయి. "మాష్టారి దగ్గర ఏవైనా మాత్ర లుంటే తెస్తాను. జాగ్రత్తగా లోపలే పడుకో. నేనిపుడే వచ్చేస్తా" నంటూ బయటకు వెళ్ళాడు సుబ్బయ్య. కొంతసేపటికి అడుగుల చప్పుడు విని, కళ్ళు తెరిచి చూసిన శాంతికి ఎదురుగా తడికదగ్గర నుంచొని అయ్యా, కిరణ్ కన్పిం చారు. "కిరణ్! నువ్వు.... నువ్వు.... యిక్కడికి మా యింటికి వచ్చావా?" ఆశ్చర్యంతో తలమునకలవుతూ అంది. "లోపలికి రండి" పిలిచి ది.

"శాంతీ! నువ్వు చాలా రోజుల్నుండి గుడికి రావడంలేదు కదూ.... అయ్యా నడిగితే నీకు జ్వరం వచ్చినట్లు చెప్పింది. ఇక అలానే ఉండలేకపోయాను. అయ్యాను ఒప్పించి, పట్టుబట్టి యిక్కడికి వచ్చాను- ఇపుడు నీ కెలా వుంది?" ఆందోళనగా అడుగుతున్నాడు కిరణ్.

"బాగానే వుంది. జ్వరగా కొద్దిగా తగ్గింది. కిరణ్ నువ్వు మా యింటికి యీ గూడెంలోకి వచ్చావని తెలిస్తే మీ నాన్నగారు ఎంత కోపగించుకుంటారో ఆలోచించావా?" ఆతృతతో అడిగింది శాంతి.

"నాన్నగారు యింట్లో లేరు శాంతీ! అయినా....నాన్నగరికి ఎలా తెలుస్తుంది? గుడికి వెళ్తున్నామని చెప్పాను అమ్మతో. అయినా అంతా నీ భయంగానీ.... నాన్నగారు ఏమైనా అంటే భరించేవాడిని నేను. నీ కెందు కంత భయం?

ఎవరేమనుకున్నా సరే.... కష్టసమయంలో వున్న నిన్ను చూడకుండా ఎలా వుండ గలననుకుంటున్నావు ?" అన్నాడు.

"అయ్యో ! ఆ ఆపిల్ పండ్లు శాంతికిచ్చేయ్. శాంతీ ! నీవు త్వరగా కోలు కోవాలి. నాకు యీ ఆరు రోజులూ ఎలా గడిచాయో చెబితే నమ్మలేవేమో ! అసలేమిటో నువ్వు.... కన్పించనపుడు.... నీతో మాట్లాడలేనపుడు ఏదో పోగొట్టుకున్నట్టుగా.... వెలితిగా.... అదోలా అన్పిస్తుంది."

"కిరణ్ ! నేనంటే నీ కెందుకింత అభిమానం ?!"

"ఎందుకంటే.... ఏం చెప్పనూ.... నువ్వంటే నాకెంతో అభిమానం. అది అంతే ! వస్తా శాంతీ." శాంతితో ఒక్క క్షణమైనా మాట్లాడగలిగాను కదా అనే తృప్తితో ఆయన వెంట వెళ్ళిపోయాడు కిరణ్.

"ఏమిటో యీ బంధం. ఎంత ఆలోచించినా అర్థంకావడంలేదు. కిరణ్‌బాబు లాంటి గొప్పోళ్ళతో తన స్నేహం ఎంత ఆశ్చర్యం ! తన నీడనయినా భరించ లేని యింట పుట్టిన కిరణ్‌కు తనపట్ల ఎంత అభిమానముందో ! తలచుకునే కొలది కిరణ్ మంచితనం.... మరీ మరీ.... ఎక్కువగా పెరిగిపోతున్నట్లుగా అన్పించింది శాంతికి.

తండ్రి తనని చూసి చీదరించుకుంటాడు. కానీ.... కొడుకు ఎంతో అభి మానాన్ని కనపరుస్తాడు. తనలాంటి పేదవాళ్ళకు గొప్పవాళ్లతో ఎప్పుడూ పొంతన కుదరదు. అలాంటి స్థితిలో యీ కిరణ్ తనతో స్నేహంచేసి.... తన మనసు కెంతో చేరువగా నిలిచాడు.

కాని.... అతని తండ్రి.... ప్రెసిడెంట్ గోపాల్రావ్ మటుకు తన నెందుకంతగా ఏవగించుకుంటాడు. తరతరాలుగా వస్తున్న కులతత్త్వమే కారణమా ? లేక అధికార హోదానా ? ఈ కులమత భేధాలూ, గొప్పా, పేదా తారతమ్యాలు.... ఎప్పటికి రూపుమాసిపోతాయి ? వయసుకు మించి ఎదిగిన శాంతి మనసులో ఎన్నెన్నో ఆలోచనలు. ఏవేవో భావాలు. శంకరం మాష్టారి శిష్యరికంలో అబ్బిన సంస్కారం; చీదరికంలో.... పెరిగిన మనసూ; తాతయ్య తన అనుభవాల పెద్దరికంతో నేర్పే జీవిత పాఠాలు; ఇవన్నీ కలిసి పదహారేళ్ల శాంతిని బాగా ప్రభావితం చేశాయి. ఎంత చిన్న విషయాన్నైనా సరే బాగా ఆలోచించి, పరిశోధించిగాని ఒక నిర్ణయానికి రాదు. కిరణ్.... తనను పరామర్శించడానికి వచ్చాడు. తల్చుకుంటూంటే ఎంతో ఆనందంగా వుంది శాంతికి. జ్వరమంతా పోయినట్లే అన్పించింది. శాంతి మనసు యీ చిన్న సంఘటనతో సంతోషంతో ఊయల లూగింది.

ఆ రోజు ఎంతో తృప్తిగా.... సంతోషంగా గడిపింది శాంతి. సుబ్బయ్య రాగానే చెప్పింది "తాతయ్యా! కిరణ్! ఆయాను తీసుకొని ఇక్కడికివచ్చాడు. ఆపిల్ పండ్లు కూడా యిచ్చాడు. తాతయ్యా! కిరణ్ చాలా మంచివాడు కదూ." ఆనందంగా చెబుతున్న శాంతి కళ్లల్లో మెరుపు చూసి "పిచ్చితల్లీ, కిరణ్‌బాబు వస్తే నీకెంత సంతోష మొచ్చింది! జ్వరం కూడా తగ్గిపోయిందేమిటి?" నవ్వుతూ అన్నాడు సుబ్బయ్య.

"ఈ ఒక్క రోజు యీ బన్‌రొట్టె తిను. రేపటికి జ్వరం పూర్తిగా తగ్గిపోతే పత్యం తీసుకోవచ్చు" అన్నాడు.

"అలాగే...." రొట్టె తిని, మంచినీళ్ళు తాగి పడుకుంది శాంతి.

* * *

కిరణ్‌బాబు చెంప చెళ్ళుమన్నది. పట్టరాని కోపంతో పూనకం వచ్చిన మనిషిలా వూగిపోతున్నాడు గోపాలరావ్. అంధుడైన కొడుకును కొడుతూవున్న భర్త కడ్డుగా నిలబడి కొడుకును ప్రక్కకు తీసుకెళ్లింది పార్వతమ్మ. "ఎందుకండీ! వాణ్ని అలా కొట్టారు? వాడిపుడేంచేశాడని మీ కంత కోపం వచ్చింది?" భర్తను నిలదీసి అడిగింది. "ఏం చేశాడా? ఆ దరిద్రుల కొంప కెళ్ళి.... పెద్దమనిషిగా ఆ దేబిరిమొహాన్ని పరామర్శించి వచ్చాడు. కళ్ళు పోయాయి కదా అని.... బాధపడుతూంటే.... ఇంటి మర్యాదా.. మన వంశం పరువు ప్రతిష్ఠలన్నీ మంటగలుపుతూ ఆ అంటరాని వాళ్ళతో స్నేహం చేసింది గాక.... ఆ శాంతి యింటికెళ్ళి పరామర్శించి వస్తావా? ఆ జాతే అంత. డబ్బు చూసి దగ్గరికొస్తారు. కల్లబొల్లి మాటలతో వంచించి.... ఆ పైన.... ఏమైనా చేయగలరు. నువ్వేమో దాని చుట్టూ తిరగడమూ, అది నీతో కబుర్లాడటమూ.... ఇంటి మర్యాద మంటగలపడానికి నీకెన్ని గుండెలు! ఇక నుండి నువ్వు గుడి కెళ్ళడం మానెయ్. ఏం తెలిసిందా? అసలు నీతో చెప్పి ఏం లాభం?! ఆయా!" అంటూ కోపంగా పిలిచిన గోపాలరావ్ ఎదుటకు వచ్చి వణికిపోతూ దోషిలా నిలబడింది ఆయా. "ఏం? నీ కిపుడు బాగానే జరుగుబాటు అవుతుందనుకుంటాను ఇక నువ్విక్కడ పని చేయాల్సిన అవసరం లేదు ఇదిగో నీ జీతం. ఇక వెళ్లొచ్చు." అంటూ ఆయాకు పది పదిరూపాయల నోట్లందించాడు గోపాలరావ్.

"బాబుగారూ!...." అంటూ భయంగా గోపాలరావ్ వైపు చూసి, యిక యెంత ప్రాధేయపడినా లాభముండదని గ్రహించి, పార్వతి దగ్గర సెలవు తీసుకొని, కిరణ్ దగ్గరకు వచ్చి కొద్దిసేపు నిలబడిపోయింది. "కిరణ్‌బాబూ....

యిక వెళ్ళొస్తాను" అని చెప్పేసి, వడివడిగా గేటువైపుకు అడుగులేసింది. వెళ్ళిపోతున్న ఆయాను చూడలేకపోయినా ఆమె మనస్థితిని ఊహించుకుంటూ, తన దురదృష్టానికి బాధపడుతూ.... ఏమీ చేయలేని తన నిస్సహాయ స్థితికి కుమిలిపోతూ అక్కడే నిలబడిపోయాడు కిరణ్.

ఆ రోజంతా తన గదినుంచి బయటకు రాలేకపోయాడు కిరణ్. తల్లి పిలిచినా లేవకుండా.... అన్నం కూడా ముట్టకుండా పడుకున్నాడు. తండ్రి పెట్టిన చివాట్లు తాలూకు గాయం తాలూకు మంట హృదయాన్ని కాల్చేస్తుంది. తన తండ్రిలో యింత కఠినత్వం కరుడుకట్టుకొని వుందా? జాతి, మతం, కులం.... హోదా.... ఐశ్వర్యం యివేనా మనిషికి కావల్సింది. అంతకు మించిన అర్హతలు మరేవీ లేవా మనిషిగా సంఘంలో బ్రతకడానికి?! ఈ కులమతాలేనా మనిషికి ఊపిరి నిచ్చేవి?! శాంతి అంటే ఎందుకంత విముఖత? వాళ్ళు ఏం తప్పు చేశారని అంటరాని వాళ్ళుగా మిగిలారు?" తల్చుకుంటూంటేనే బాధగా వుంది. "ఈ పరిస్థితి యిక మారదా? ఈ కులమత వాదాలకు అంతమెపుడు?" ఆలోచనలతో కొట్టుమిట్టాడుతున్న కిరణ్, తల్లి యెంతగా బ్రతిమలాడినా పచ్చి మంచినీళ్ళు కూడా ముట్టుకోలేదు. అంధకార బంధురమైన జీవితంలో మరొక రోజు చీకటిలోనే గడచిపోయింది.

* * *

మరునటిరోజు ఉదయాన్నే కిరణ్‌బాబును తీసుకొని పట్నాని కెళ్లారు శంకరం మాష్టారునూ, గోపాల్రావ్‌నూ.

డాక్టర్ కృష్ణమోహన్ .. దాదాపు అన్ని పరీక్షలూ జాగ్రత్తగా చేసి, "చూడండి రావ్‌గారూ! మీ అబ్బాయి కళ్ళకు తగిన నేత్రాలను ఎవరైనా దానంచేస్తే.... ఆపరేషన్ చేసి, చూపును కలిగేటట్లు చేయవచ్చు. కాని.... నేత్రదానం చేసే వాళ్ళు ఎవరున్నారు? బట్ ఐ విల్ ట్రయ్ ఫర్ ఇట్. అపుడు మీకు కబురు చేస్తాను. తప్పకుండా రండి," అంటూ విశదీకరించారు డాక్టర్. అక్కణ్ణుంచి వాళ్ళ ముగ్గురూ తిరిగి వచ్చేశారు. విషయం తెలుసుకున్న పార్వతమ్మ ఆనందానికి అవధుల్లేకుండా పోయింది. తన బిడ్డకు త్వరగా చూపు తెప్పించమని కోటి దేవతలకు మ్రొక్కుకున్నదా తల్లి.

* * *

"శాంతీ! నీ కిది తెలుసా? ఆయాను పన్లోంచి తీయించేశారుట ప్రెసిడెంటు గారు. ఈ ఊరు విడిచి వెళ్ళిపోయిందట."

"ఎందుకని?" అడిగింది శాంతి. దానికి సమాధానం చెప్పలేకపోయాడు సుబ్బయ్య. కాని.... తెలిసినా తను చెప్పలేడు. ఇపుడిపుడే కోలుకుంటున్నది శాంతి. ఇపుడా విషయం విని శాంతి తట్టుకోలేదు. శాంతి బాధపడితే తను చూడలేడు. అందుకనే మాట మార్చాడు సుబ్బయ్య.

"శాంతీ! కిరణ్‌బాబుకు చూపువచ్చే అవకాశముందట డాక్టరుగారు చెప్పేరుట. కాని.... కళ్ళను ఎవరయినా దానంచేయగలిగితే వాటిని కిరణ్ కళ్ళకు అమర్చి ఆపరేషన్ చేయాలట. శంకరం మాష్టారి సంగతి చెప్పారు నాకు." తాతయ్య తెచ్చిన వార్త విని చాలా సంతోషించింది శాంతి. "నిజంగానా తాతయ్యా! అబ్బ కిరణ్ ఎంత అదృష్టవంతుడు. ఆ దేవుడు ఎన్నాళ్ళకు కనికరించాడు!! కానీ కళ్ళ నెవరు దానం చేస్తారు?" మనసులోని మాట బయటకు వచ్చింది. "భగవాన్! కిరణ్‌కు త్వరలో చూపును ప్రసాదించు" వేడుకుంది శాంతి.

కిరణ్‌బాబు యిక్కడికి.... శాంతి దగ్గరకు వచ్చాడని తెలిసినపుడే తను అనుకున్నాడు. ఇలాంటిదేదో రభస జరుగుతుందని. సరిగ్గా అలానే జరిగింది. ఆయా ఊరువిడిచి వెళ్ళిపోయింది. కిరణ్ బయటకు కదలడం లేదు. గోపాల్‌రావు తనను పిలిపించి చివాట్లేశాడు కూడా.

"నీ మనవరాలిని అదుపులో ఉంచుకోవయ్యా! అపుడు నీ కొడుకు మా పరువు తీశాడు.... ఇపుడు నీ మనవరాలు తయారయ్యింది. ఎక్కడికి పోతాయా బుద్ధులు! మా వాడిని బుట్టలో వేసుకొందామని ప్రయత్నిస్తుందేమో... ముందే హెచ్చరిస్తున్నాను. జాగ్రత్తగా విను. ఇకనుంచి.... ఆ శాంతి.... మా అబ్బాయితో కన్పించినా మాట్లాడినా నేనేం చేస్తానో నాకే తెలియదు. జాగ్రత్త," అని కేక లేసి మరీ పంపాడు.

తన చిన్నకొడుకు గోపీ.... ఎంత సహృదయుడు! ఈ గోపాల్రావ్ తండ్రి కోపానికి ఆహుతయ్యాడు. కళ్లల్లో గతం తాలూకు విషాద జ్ఞాపకాలు మనసును భారం చేశాయి. మానిన గాయాన్ని కెలికినట్లయింది సుబ్బయ్యకు.

అప్పట్లో సుబ్బయ్య.... భుజంగరావు యింటిలో పాలేరుగా వుండేవాడు. ప్రెసిడెంటు భుజంగరావు పెద్దకొడుకు గోపాల్రావ్‌కు పెళ్లి అయి ఒక కూతురు కూడా పుట్టింది. సుబ్బయ్య చిన్నకొడుకు గోపీ; భుజంగరావు కూతురు లక్ష్మి ఒకే బడిలో ఆ ఎనిమిదో క్లాసువరకు చదువుకున్నారు. గోపీతో లక్ష్మి స్నేహం చేయడం భరించలేని ఆమె అన్న గోపాల్రావ్ గట్టిగా మందలించేవాడు. పనివాళ్లతో, జీతగాళ్లతో ఆడుకోవడమేమిటని తిట్టేవాడు. అయినా లక్ష్మి చాటుగా వచ్చి గోపీతో కబుర్లాడేది.

చదువు మానేసిన తర్వాత కూడా గోపీ ఏదో ఒక పుస్తకం చదువుతూనే వుండేవాడు. ఎన్నెన్నో విషయాలు తెలుసుకోవాలని ఉండేదతనికి. అన్యాయాల్ని మూఢాచారాల్ని సహించేవాడు కాడు. ఎదుటివారు తప్పులు చేస్తూంటే పెద్దా చిన్నా లేకుండా సరిదిద్దుకోమని సలహాలిస్తూండేవాడు. ఈ విధంగా గ్రామ పెద్దలకు శత్రువయ్యాడతను. తండ్రితోపాటుగా ప్రెసిడెంటు దగ్గర ఆ పనీ ఈపనీ చేయసాగాడు గోపీ.

భుజంగరావు తన కూతురి పెళ్ళి ఘనంగా చేసి, అత్తారింటికి పంపించాడు. కాని.... లక్ష్మి కొద్దికాలానికే భర్త చనిపోవడంతో పుట్టింటికి వచ్చేసింది. అప్పటి మూఢాచారాలు, సంప్రదాయాలు అన్నీ తిరగబడి లక్ష్మిని జీవంలేని మనిషిగా చేశాయి. గోపాల్రావ్‌కు కొడుకు పుట్టాడు. బారసాల ఘనంగా జరిపించారు. అపుడు విరాగినిలా ఎవరికీ చెందని వస్తువులా జీవితాన్ని పోగొట్టుకున్న మోడులా.... శూన్యంలో చూస్తూ కూర్చున్న లక్ష్మి కనబడింది గోపీకి. ఆ దృశ్యాన్ని చూసి భరించలేకపోయాడు. లక్ష్మిలో మార్పు తీసుకురావాలని కోరుకున్నాడు గోపీ. అందుకు తన మొదటి కృషిగా అభ్యుదయ రచయితలు వ్రాసిన పుస్తకాలు, వితంతు జీవితాలకోసం మార్పులుచేస్తూ జీవితాలనర్పించిన మహామహుల పుస్తకాలూ అన్నీ తెచ్చి లక్ష్మి కిచ్చేవాడు. ఆ పుస్తకాలు చదువుతూ.... తనను తాను సంస్కరించుకోవడానికి ప్రయత్నించేది లక్ష్మి. ఆ ప్రయత్నాలన్నీ తండ్రీ, అన్నయ్యల నిష్ఠూరానికి ఆగిపోయేవి. ఈ నిరాశా నిస్పృహ లెన్నాళ్లు? జీవితాంతం నాలుగు గోడల మధ్య బందీయై, దుఃఖానికి సంతోషానికి అర్థంతెలీకుండా గడుపాల్సిందేనా। అని బాధపడే లక్ష్మికి గోపీ మాటలు, అతను... తను ఉత్సాహంగా ఉండటానికి చేసే ప్రయత్నాలలో కొంత ఊరట కలిగేది. గోపీ, లక్ష్మికి కష్టసమయంలో ఆదుకునే ఆత్మబంధువులా అన్పించేవాడు.

వితంతువయి వుండి, అలగా జనంతో ఆ మాటలేమిటి, కబుర్లేమిటని అన్న గోపాల్రావ్ చెల్లెలిని అనుమానిస్తూ, శంకిస్తూ గదమాయించేవాడు. భుజంగరావు కూతురు ఎక్కడికీ వెళ్లకుండా ఎవరితోనూ మాటాడకుండా కట్టడిచేశాడు. లక్ష్మి అన్నింటినీ సహించింది. చివరకు గోపీ.... వాళ్ల అనుమానానికి గురయి రౌడీ మూకలచేత దెబ్బలు కూడా తిన్నాడు. ఇదంతా తెలుసుకున్న లక్ష్మికి విరక్తి కలిగింది. ఒకరోజు ఎవరికీ తెలియకుండా బయటకు నడిచి, ఊరివెలుపల పాడుబడ్డ బావిలో దూకడానికి ప్రయత్నించింది. మనస్సంతా చికాకుతో నిండి

తరువాత పేజీల్లో చూడండి....




వుండగా....ఏంచేయాలో తోచని స్థితిలో, అక్కడికి వచ్చి, ఆ ప్రశాంత వాతావరణంలో కూర్చున్న గోపీ బావిలో దూకబోతున్న ఆమెను యివతలకు లాగి రక్షించాడు. ఇంటికి వెళ్లి బొమ్మని హెచ్చరించాడు. చావనయినా చస్తాను గాని....యిక యింటికి వెళ్లనని పట్టుపట్టింది. ఆ క్షణంలో ఆ యిద్దరికీ చిత్రమైన అలోచన వచ్చింది. పెద్దవాళ్ల అనుమానాల్ని నిజం చేయాలి. అవునూ ... వితంతువులకు పెళ్ళికాకూడదని....వాళ్లను పెళ్లిచేసుకోకూడదనే సిద్ధాంతాలు అనవసరం. గోపీ, లక్ష్మి ఎవరితో చెప్పకుండా పెళ్లిచేసుకోవాలనే నిర్ణయానికి వచ్చారు. తమలో ఎలాంటి దురభిప్రాయం లేకున్నా మాటలతో చేతలతో బాధిస్తున్నారు. కులాలు వేరయితేనేం, మనసులొకటే కదా! అయినా ఏదో సంకోచం గోపీని ఆలోచింపచేసింది. మోడుబోయిన జీవితాన్ని ఆదుకోవడంలో తప్పు లేదన్పించింది. ఆ తర్వాత యిద్దరూ కలిసి పట్నానికి వెళ్ళిపోయారు.

రెండు రోజుల తర్వాత ఇద్దరూ ఎక్కడో దూరంగా గుడిలో పెళ్లిచేసుకున్నట్లు అందిన వార్తతో భుజంగరావు అగ్నిహోత్రుడయ్యాడు. గోపాల్రావ్ సుబ్బయ్యనూ, అతని పెద్దకొడుకు సీతారామయ్యనూ పిలిపించి తిట్టాడు. ఇంతకంటే వాళ్లకు బుద్ధివచ్చేలా మరోపని చేయాలి. ఏదో ఒకటి చేసి, ఈ సమస్యను శాశ్వతంగా పరిష్కరించాలి అనుకుంటూ తండ్రితో సంప్రదించాడు గోపాల్రావ్. వారం రోజుల తర్వాత పట్నం విడిచి, తమ ఊరికి దగ్గరలో వున్న మరో

పల్లెటూరికి చేరుకుంటున్న ఆ నూతన దంపతులను గోపాల్రావ్ పంపిన కిరాయి రౌడీలు వేరు చేశారు. గోపీని చంపి అక్కడ వున్న చెరువులో విసిరేశారు. ఈ దారుణాన్ని చూసి, ఓర్చుకోలేకపోయిన లక్ష్మి, ఆ గూండాలను తప్పించుకొని, తనూ చెరువులో పడి ఆత్మహత్య చేసుకుంది.

కొడుకు దుర్మరణ వార్త తెలిసి అచేతనుడయ్యాడు సుబ్బయ్య. దరిద్రమంతా తొలగిపోయిందనుకున్నారు లక్ష్మి కుటుంబ సభ్యులు. పుట్టెడు దుఃఖంలో మునిగి వున్న సుబ్బయ్యకు కొడుకు పోలికలతో వున్న శాంతి ఓదార్పుగా కన్పించింది. తన కొడుకును మనవరాలు శాంతిలో చూసుకొని మురిసిపోయేవాడు సుబ్బయ్య. ఆ సంఘటన తర్వాత సుబ్బయ్య భుజంగరావు దగ్గర పని మానేశాడు. పొలం పనంతా పెద్దకొడుకే చూసుకుంటున్నాడు. అప్పుడప్పుడూ గోపీ గుర్తు వచ్చి కంటనీరు తిరిగినా శాంతి చల్లని నవ్వుతో, పలకరింపుతో తనను తాను సంబాళించుకునేవాడు. ఆ దుఃఖాన్ని మరిచిపోతున్న సుబ్బయ్యను చూసి విధి వెక్కిరించింది. ఉదయాన్నే పొలంపనులకు బయలుదేరిన పెద్దకొడుకు సీతారామయ్య త్రాచుకాటుకు బలై మరణించాడు. చిన్నకొడుకు పోయి అయిదు సంవత్సరాలన్నా పూర్తికాలేదు. దానికి తోడు ఈ విఘాతం ఎదురయింది. అప్పటికి మాలతి పుట్టి రెండు నెలలయినా కాలేదు. తన యిద్దరు కూతుళ్ళతోపాటు, సుబ్బయ్యనూ తన బిడ్డగానే చూసుకుంటూ కుటుంబ భారాన్ని తనే మోయ నిశ్చయించుకుంది, కోడలు చంద్రమ్మ. వృద్ధాప్యంతో, విషాద సంఘటనలతో క్రుంగిపోయిన సుబ్బయ్య నిల్రదొక్కుకోలేకపోయాడు. పేరుకు కోడలే అయినా అన్నీ తనే అయి సంసార రథాన్ని అతికష్టంతో యింతవరకూ లాక్కొని వచ్చింది. ఈరోజు గోపాల్రావ్ మాటలతో గతం తన కళ్లముందు మెదలగా, రెండు కన్నీటిచుక్కలు సుబ్బయ్య కళ్లల్లో నిలిచాయి.

తండ్రి భుజంగరావు అడుగుజాడల్లోనే నడుస్తున్నాడు యిప్పటి ప్రెసిడెంటు గోపాల్రావ్. బ్రాహ్మణ వంశంలో పుట్టినంత మాత్రాన....తక్కువ కులస్థులంటూ తమని వేడచేస్తూ....హీనంగా చూడటం; కులహీనులు గుడిలో ప్రవేశించడానికి అనర్హులని ప్రకటించడం....యివన్నీ గోపాల్రావ్ తన హోదాలో పెద్దరికంలో నిర్ణయించడం ఏమైనా సబబుగా వుందా ?! గోపీ రూపంతో అవే పోలికలతో పుట్టిన శాంతి అంటే గోపాల్రావ్‌కు.... శాంతి ఛాయలే గిట్టవు. అసలు ఆ గూడెంలోని వాళ్లంతా అనాగరికులనీ క్షుద్రులనీ....కేవలం తన దగ్గర ఊడిగంచేసుకొని బ్రతకాల్సినవారనీ అతని అభిప్రాయం.

"తాతయ్యా! నేను గుడిదగ్గరి కెళ్లొస్తా తాతయ్యా....అక్కడ కిరణ్‌బాబు కన్పిస్తే ఒక్కసారి పలకరించి వస్తాను," శాంతి మాటలు విని ఉలిక్కిపడ్డాడు సుబ్బయ్య.

"వద్దు తల్లీ! వద్దు! ఆ పని మాత్రం చేయకు. ఆళ్లంతా గొప్పోళ్లు. మనం పేదోళ్లం. వాళ్లకు కులాల పట్టింపులున్నపుడు... అటువైపుకే వెళ్ళకూడదు. స్నేహానికయినా అంతస్థు లెరిగి మసలుకోవాలి. ఇంకెపుడూ ఆ బాబుతో మాటాడకు. ఆ గోపాల్రావ్ కోపమొస్తే ఏమయినా చేయగలడు." తాతయ్య చెప్పే మాటల్లో నిజం గ్రహించడానికి క్షణం పట్టలేదు శాంతికి. తాతయ్య మొహంలోని గాంభీర్యత... ఆ మాటల వెనక దాగిన క్షోభను గుర్తించి, మౌనంగా ఉండిపోయింది శాంతి.

* * *

ఆరోజే దీపావళి పండుగ. ఎపుడు చీకటి పడుతుందా, ఎపుడు మతాబులు కాల్చుదామా అని ఎదురుచూస్తున్నారు పిల్లలు. పండుగపూట ఏదైనా పిండి వంట చేయాలనుకొంది చంద్రమ్మ. శాంతీ, మాలతీ తాతయ్య దగ్గర చేరి, కబుర్లాడుతూ కూర్చున్నారు. శాంతి-తెల్లటి లంగా వోణీ, జాకెట్టు వేసుకొని అప్సరసలా వెలిగిపోతూ వుంది. మాలతి నీలం రంగు గౌను వేసుకుంది. ఇద్దరినీ ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నాడు తాతయ్య, కజ్జికాయలు చేస్తూ ఆ దృశ్యాన్ని చూసిన చంద్రమ్మకు, చనిపోయిన తన భర్తా మరిదీ గుర్తు వచ్చారు. వాళ్లిద్దరూ ఉంటే యీరోజున ఎంత సందడిగా ఉండేది?. ఆయనకు టపాసులంటే చాలా భయం. అన్నయ్యను ఆటలు పట్టిస్తూ ఎన్నో టపాసులు కాల్చేవాడు గోపీ. ఏవీ ఆ రోజులు?! ఏదీ ఆ సందడి? మదిలో దుఃఖం; కళ్ళలో తడి. క్షణక్షణానికి గుర్తుకువస్తున్న ఆ ఇద్దరి జ్ఞాపకాలూ చంద్రమ్మను ఆరోజంతా బాధిస్తూనే వున్నాయి.

ప్రతి గుడిసెలోనూ దీపాలు అరుగులమీద వరుసగా తీర్చివున్నాయి. అందమైన పల్లెటూరి వాతావరణంలో దీపాలన్నీ పండుగ చేసుకుంటున్నాయి. అలా చూస్తుంటే కోటి నక్షత్రాలు యిలపై వెలిసినట్లుగా కన్పిస్తున్నాయి. ప్రతి యింటా దీపాల వెలుగులు. ఆనందోత్సవంతో పైకెగసిపోతున్న తారాజువ్వలు. చీకటి రాత్రిలో ఆకాశంలోని తారలు తమనెక్కడ మింగేస్తాయో నన్నట్లుగా భయంతో మిణుకుమిణుకు మంటున్నాయి.

చంద్రమ్మ వచ్చి పిలచేంతవరకూ శాంతీ, మాలతీలు మతాబులు, కాకర

పువ్వొత్తులు కాలుస్తూనే వున్నారు. శాంతి తన కాకరపువ్వొత్తుల్లో కొన్ని చెల్లెలి కిచ్చేసింది.

"రేపటికి కొన్ని వుంచండి. ఇక చాలుగాని....వచ్చి నిద్రపోండి," పిలిచింది చంద్రమ్మ. ఇహ లాభం లేదనుకొని అయిష్టంగానే అక్కణ్ణుంచి కదిలారు వాళ్ళిద్దరూ. "అమ్మా! తాతయ్యేడీ? ఎక్కడి కెళ్లాడు," అడిగింది మాలతి. "రాఘవవాళ్లింటి కెళ్ళాడు. ఈరోజు అక్కడే పడుకుంటాడంట." సమాధాన మిచ్చింది చంద్రమ్మ. నిద్రపోయేముందు తాతయ్య దగ్గర చేరి కథలు చెప్పించు కోవడం మాలతి కలవాటు. నిద్ర ముంచుకొస్తుంటే గదిలో కెళ్లి నిద్రపోయింది మాలతి. వంటయిల్లు శుభ్రంగా ఊడ్చి, గడప దగ్గర చాప వేసుకొని నిద్ర పోయింది చంద్రమ్మ. చెల్లెలి దగ్గరే పడుకున్న శాంతికి నిద్ర రావడమేలేదు. మెల్లగా లేచి, చెల్లెలిపై దుప్పటి కప్పి, బయట వరండాలోకి వచ్చింది. తాతయ్య పడుకునే మంచంమీద పడుకొని ఆకాశంవైపుకు చూస్తూ వుంది. ఆకాశంలోవున్న తారల్ని అందుకోవాలని కాబోలు తారాజువ్వలు పైపైకి దూసు కుంటూ పోతున్నాయి. గూడెంలో అందరూ నిద్రపోతున్నట్లుగావుంది. ఎక్కడా సందడిలేదు. ఊళ్లోని - గొప్పోళ్ళు మటుకు ఏకబిగిన టపాసులు, తారాజువ్వలు అవ్వాయిసువ్వాయి అన్నీ కాలుస్తున్నారు. శాంతికి.... ఒక్కసారిగా కిరణ్ మదిలో మెదిలాడు. లోకంలో యిన్ని వెలుగులు విరజిమ్ముతూ వుంటే కిరణ్‌కు కన్పించేది ఒక్క చీకటేగా. కిరణ్‌కు చూపువస్తే నిజంగా తనకెంత సంతోషమో!! కిరణ్ కళ్లల్లో వెలుగుని తను చూడాలి. అప్పుడు నన్ను చూసి కిరణ్ ఏమను కుంటాడో? అసలు కిరణ్ నా రూపాన్ని ఎలా ఊహించుకొని వుంటాడు? తను ఎదురుగా వెళ్లి మాట్లాడకుండా నిలబడితే.... శాంతిగా గుర్తించగలడా? కిరణ్ నీ కళ్ల వెలుగును చూడాలి....అపుడు నీలోని ఆనందాన్ని, ఉత్సాహన్ని కనులారా నేను చూడాలి. ఆ రోజు రావాలి. అని మనసులోనే అనుకుంటూ కళ్ల మూతలు పడిపోతూ వుంటే అలాగే నిద్రపోయింది. అరగంట తర్వాత .... నిద్రలో ఏదో వెలుగు కమ్మేస్తున్నట్లుగా... ఎర్రగా వెచ్చగా అనుభూతి కలిగింది. కుక్కలు అదేపనిగా మొరుగుతున్నాయి. ఉలిక్కిపడి నిద్రలేచింది శాంతి. లోపల్నుంచి ఎర్రటి మంటలు అగుపిస్తున్నాయి. "అమ్మా...." అంటూ కంగారుగా లోపలికి పరుగెత్తింది. గదిలోనే నిద్రపోతున్న మాలతిని లేపి.... బయటకు పంపింది. గుడెసె అంతా కాలిపోతూ వుంది. శాంతి గుండె దడదడలాడింది. "అమ్మా! అమ్మా" అంటూ వంటగదిలో కెళ్లింది. గడపదగ్గరే పడుకున్న చంద్రమ్మ

ఎర్రగా వున్న దూలం క్రింద కాలిపోతూ కన్పించింది శాంతికి. "అమ్మా.... అంటూ వెర్రిగా కేక వేసింది. పిచ్చిగా రోదిస్తూ.... ఏం చేయాలో తెలియక అలాగే నిలబడిపోయింది.

బయట కోలాహలం ఎక్కువయింది. గూడెంలోని జనం .. కాలిపోతూన్న గుడిసెపై నీళ్ళు చల్లుతున్నారు. బిందెలతో నీళ్ళు తెచ్చి గుమ్మరిస్తున్నారు. "అక్కా ....అమ్మా...." అంటూ గట్టిగా ఏడుస్తున్న మాలతిని చూసి, గూడెంలోని రత్తయ్య "అక్కా.... అమ్మా లోపల్నే వుండారా. అయ్యో...." అనుకుంటూ మంటల్ని తప్పుకుంటూ లోపలికి వెళ్ళాడు. తల్లి మృతదేహాన్ని చూసి నిశ్చేష్ట అయిన శాంతి తన చుట్టూర ఆవరించుకున్న మంటల్నుంచి తప్పించుకోలేక పోయింది. క్రిందికి వొరిగిపోతున్న శాంతిని ఎత్తుకొని బయటకు తెచ్చి దుప్పటి కప్పి, దొర్లించాడు రత్తయ్య. కాలిపోయిన బట్టల వాసన.... గుడిసె పూర్తిగా కాలిపోయింది. రత్తయ్య చేతులూ, మెడదగ్గరా.... అక్కడక్కడా కాలాయి. తక్కిన గుడిసెలకు మంట వ్యాపించకుండానే మంటల్ని ఆర్పేశారు. తాతయ్యను చుట్టేసుకొని .. ఏకధాటిన ఏడుస్తున్న మాలతిని ఎవ్వరూ ఓదార్చలేకపోతున్నారు. శాంతిని పిలిచినా పలకడంలేదు. స్పృహను కోల్పోయింది. కాలిపోయిన చంద్రమ్మను తల్చుకొని.... పదేపదే రోదించాడు సుబ్బయ్య. శంకరం మాష్టారుకి విషయం తెలిసింది. గబగబా అక్కడకు చేరుకొని, స్పృహ తప్పి పోయిన శాంతిని.... అప్పటికప్పుడు బండి కట్టించి పట్నానికి తీసుకెళ్ళారు. పదిమైళ్ళ దూరపు ప్రయాణం. ఎంత వేగంగా బండిని సాగించినా.... మూడు గంటల టైమ్ పట్టింది ఆసుపత్రికి చేరడానికి. కృష్ణా నర్సింగ్ హోమ్‌లో శాంతిని చేర్పించారు.

* * *

ఆస్పత్రిలో శాంతి చేరి అప్పటికి రెండ్రోజులయింది. శరీరం కాలిన చోటల్లా చర్మం నల్లగా మాడిపోయి లోపలి భాగం ఎర్రగా కన్పిస్తూ వుంది. మాడిపోయిన శరీరం కన్పించకుండా తెల్లటి దుప్పటి మెడవరకూ కప్పారు. ముఖం కొద్దిగా కమిలినా.... కళ్ళు.... నుదురు మాత్రం కాలలేదు. స్పృహ వచ్చిన శాంతి చుట్టూ తాతయ్య, మాలతి, శంకరం మాష్టారు చేరారు. "దాహం" అంది శాంతి. వణకుతున్న చేతులతో గ్లూకోజ్ నీళ్ళు స్పూన్‌తో పెదాలకందించాడు సుబ్బయ్య. ఒకసారి చుట్టూ కలియజూసింది. మాలతి వైపు, తాతయ్య వైపూ దిగులుగా చూసింది. "మాష్టారూ.... నే నిక బ్రతకను కదూ !" శాంతి చెప్పిన మాట

వాస్తవంగా జరిగేదే.... అయినా ఆ మాట అక్కడున్న వారి హృదయాలను కదలించింది.

"తాతయ్యా! నేనూ.... అమ్మదగ్గరి కెళ్ళిపోతాను." మాటలు బలహీనంగా వస్తున్నాయి. వస్తున్న దుఃఖాన్ని అతి ప్రయాసతో ఆపుకుంటున్నాడు సుబ్బయ్య. మాలతి భయంభయంగా అక్క వైపు చూస్తోంది.

"మాస్టారూ!.... నాదో కోరిక.... వుండిపోయింది...."

"ఏమిటమ్మా! చెప్పు శాంతీ! నీ కోరిక.... ఏమిటి?" ఆత్రుతగా అడిగారు మాస్టారు.

"మాస్టారూ.... కిరణ్‌కు.... చూపు వస్తే చూడాలని వుంది.... ఎవరయినా.... కళ్ళను దానంచేస్తే.... కిరణ్‌బాబుకు చూపు వస్తుందంటగా.... అందుకే...." అంటూ కొద్దిసేపటి వరకు ఆగిపోయింది శాంతి.

"ఆ.... చెప్పమ్మా; ఏమిటి?" ఆపాయ్యంగా శాంతి తల నిమురుతూ అన్నారు మాస్టారు.

"అందుకే.... నా.... కళ్ళు.... తీసుకొని.... కిరణ్‌బాబుకు అమర్చండి.... ఇది.... దానంగా కాదు.... నా స్నేహితుడికి.... నా కానుకగా యివ్వండి.... మాస్టారూ. నేనిలా అయిపోయానని....నా కళ్ళు కిరణ్‌బాబుకు అమర్చారనీ.... ఎవరికీ చెప్పొద్దు.... చెప్పొద్దు మాస్టారూ.... శక్తినంతటినీ కూడదీసుకొని అంటున్న శాంతి మాటలకు మాస్టారి హృదయం ఒక్కసారిగా స్పందించింది. ఆ మాటల వెనుక దాగివున్న మానవతకు; ఆ అర్థింపుకి మాస్టారి కళ్ళు చెమర్చాయి. సుబ్బయ్య వైపు చూశారు శంకరం మాస్టారు ఆయన అభిప్రాయం కూడా తెలుసుకోవాలన్నట్లుగా. మౌనంగా తన అంగీకారాన్ని తెలిపాడు సుబ్బయ్య. కన్నీళ్ళు తుడుచుకున్నా ఆగడంలేదు.

"అలాగే శాంతీ! నీ యిష్ట ప్రకారమే కిరణ్‌బాబుకు వైద్యం చేయిస్తాను." అని చెప్పి, డాక్టర్ దగ్గరికెళ్ళారు మాస్టారు. డాక్టర్ కృష్ణమోహన్ వచ్చి శాంతికి యింజక్షన్ యిచ్చారు. రెండు గంటల వరకూ మృత్యువుతో పోరాడి ఆ రోజు సాయంత్రం సూర్యాస్తమయ సమయానికి తుది శ్వాసను పీల్చింది.

* * *

గూడెంలో అగ్ని ప్రమాదం జరిగినట్లు తెలుసుగానీ, చంద్రమ్మ చావు గురించిగానీ; శాంతి అగ్నికాహుతియై మూడ్రోజులు బాధపడి తనువు చాలించినట్లు గానీ పార్వతమ్మకు కానీ, కిరణ్‌కుకానీ తెలియనే తెలియదు. గోపాల్రావ్

తరువాత పేజీల్లో చూడండి....




యింటికి శంకరం మాష్టారు హడావిడిగా వచ్చి, "గోపాలం, నువ్వు, కిరణ్ కలసి కృష్ణా నర్సింగ్‌హోమ్‌కు త్వరగా రావాలోయ్. డాక్టర్‌గారు నాకు కబురు పంపించారు. కిరణ్‌కు కళ్ల ఆపరేషన్ చేయడానికి డాక్టరుగారు సిద్ధంగా వున్నారుట" అని చెప్పగానే గోపాల్రావ్ మహదానందపడిపోతూ "నిజమా శంకరం! నా కిరణ్ ఎంత అదృష్టవంతుడు. ఇదిగో యిపుడే వచ్చేస్తున్నా"మని అప్పటికపుడు తయారై, కిరణ్‌ను తీసుకొని శంకరంతోపాటు పట్నానికెళ్ళి, కృష్ణా నర్సింగ్ హోమ్‌ను చేరారు. డాక్టర్ కృష్ణమోహన్‌తో శంకరం మాష్టారు అన్ని విషయాలు.... ముందే చెప్పేసి వుండటంవల్ల.... నేత్రదానం చేసినవారి గురించి ఏమీ చెప్పకుండా.... మామూలుగా 'ఐ బ్యాంక్' నుంచి తెప్పించామని మాత్రమే చెప్పి.... రెండో రోజు ఆపరేషన్ చేయడానికి అన్ని ఏర్పాట్లూ గావించుకున్నారు.

* * *

కళ్ల ఆపరేషన్ విజయవంతంగా ముగిసింది. కట్లు విప్పే రోజున కిరణ్ హృదయం, శాంతిని ముందుగా చూడలేకపోతున్నానే అని వగచింది. ఊరికి వెళ్లింతర్వాతనైనా శాంతిని కలుసుకోవాలి అని తన మనసుకు సర్ది చెప్పుకున్నాడు. శాంతి యెపుడూ తనను ఉత్సాహపరుస్తూ వుండేది, తనకు కళ్ళు

వస్తాయని నమ్మకంగా చెప్పేది. ఇపుడు కళ్ళు వచ్చిన తనను చూసి ఎంత సంతోషిస్తుందో ?! అనుకున్నాడు కిరణ్.

"చూడు బాబూ !.... కట్లు విప్పుతాను. కనురెప్పలు నెమ్మదిగా విప్పి, నిదానంగా చూడు.... రెడీ. ఒన్.... టూ.... త్రీ.... ఆ !.... మెల్లగా.... ఏం గాబరాపడకుండా; నిదానంగా కళ్ళు తెరచి చూడు." సిగ్నల్స్ యిస్తున్న డాక్టరు మాటలు వింటూ.... అలాగే మెల్లమెల్లగా, కొద్దికొద్దిగా కళ్ళువిప్పుతూ .... చూశాడు. ఎదురుగా శ్రీకృష్ణునిపటం కన్పించింది. ఒక్కసారిగా అంత వెలుగును చూడలేనట్లుగా అతని కళ్ళు మళ్లీ మూతబడ్డాయి.

డాక్టర్ మళ్ళీ ఎంకరేజ్ చేస్తూవుండే.... మళ్ళీ అలాగే ప్రయత్నించాడు.... కిరణ్ పెదవులపై చిరునవ్వు తొంగిచూసింది. 'తనిపుడు అన్నీ చూడగల్గుతున్నాడు' తల్చుకుంటే సంతోషంగా వుంది తనకి. డాక్టర్ అతని కళ్లముందు తనవేళ్ళను మారుస్తూ నంబర్స్ అడుగుతూంటే.... కరెక్ట్‌గా సమాధానాలిచ్చాడు కిరణ్. "వెరీగుడ్... నౌ— యూ కెన్ సీ. రెండ్రోజులవరకు యిక్కడే రెస్ట్ తీసుకోవాలి." అని చెప్పి తన రూంకు వెళ్లిపోతున్న డాక్టర్ని అనుసరించాడు గోపాల్రావ్. ఆనందంతో, కృతజ్ఞతతో డాక్టర్ చేతులను తన చేతుల్లోకి తీసుకొని తన ఆనందాన్ని తెలియజేసేడు. "ఇందులో నేను చేసిందేమీ లేదు.... పర్‌ఫెక్ట్‌గా సరిపోయే కళ్ళు దొరికాయి. అంతే." డాక్టర్ చెప్పారు.

కిరణ్‌ను తీసుకొని వూరికి చేరుకున్నారు. కిరణ్‌కు చాలా ఆనందంగా వుంది. తనిపుడు అన్నీ చూడగల్గుతున్నాడు.

* * *

"మాష్టారూ !....నా కళ్ల ఎదుటే అన్ని ఘోరాలు జరిగిపోయినాయి బాబూ ! నేనింక ఎలా బ్రతకను ? కొడుకులు ఏనాడో పోయారు. కోడలుకూడా నన్నొదిచి వెళ్లిపోయింది. నా.... శాంతి.... ఒక్కగానొక్క నా ఆశకూడా నా కందకుండా వెళ్లిపోయింది. ఇవన్నీ చూడ్డానికే నేను మిగిలాను. నా బాధంతా....యింకా పసితనంపీడని మాలతి గురించే. నేను చూస్తే యింకా ఎన్నాళ్లో బ్రతకను. రేపోమాపో రాలిపోయేవాడిని. వెనకాముందూ ఎవ్వరూ లేని జీవితమాయే. మాలతిని ఎవరు చూస్తారు మాష్టారూ ! నా కేమయినా అయితే మాలతి దిక్కులేని దయిపోతుంది మాష్టారూ.... నా బాధ నర్థంచేసుకునేది మీరొక్కరే బాబూ" అంటూ తన బాధను వ్యక్తంచేసుకున్నాడు సుబ్బయ్య.

"ఊరుకో తాతయ్యా ! నీకు అండగా నేనుంటానని మాటయిస్తున్నాను.

మాలతి గురించి నువ్వేమీ బెంగపెట్టుకోకు. తన కళ్ళముందే తల్లీ, శాంతీ కనుమూసేనరికి మాలతి ఏకాకి అయిపోయింది. మాలతికోసమైనా నువ్వు గుండె దిటవుచేసుకోవాలి తాతయ్యా. మాలతి విషయంలో నువ్వు నిశ్చింతగా వుండు." అంటూ ఓదార్చాడు శంకరం మాష్టారు.

* * *

కిరణ్‌కు చూపువచ్చి వారం రోజులయింది. కిరణ్ మనస్సులో శాంతి మెదుల్తూనేవుంది. తల్లిదండ్రులతో కలసి గుడికివెళ్లాడు కిరణ్. త్రోవలో....అందరినీ చూస్తున్నాడు. కాని.... కిరణ్ కళ్ళు శాంతికోసం అన్వేషిస్తున్నాయి. తను శాంతిని ఎలా చూడగలడు? చూసినా గుర్తించగలడా? తనకు చూపువచ్చిందని శాంతికి యింకా తెలియకుండా వుంటుందా? తను అంధుడుగా వున్నపుడే శాంతితో పరిచయమైంది. శాంతిని యిపుడెలా గుర్తించగలడు తను! అనుకుంటూ తల్లితోపాటుగా గుడిమెట్లు ఎక్కసాగాడు కిరణ్. ఆ రోజు గుడిమెట్ల దగ్గర నిలబడివున్న తనను పలకరించిన శాంతి మళ్ళీ గుర్తుకువచ్చింది. భారంగా నిట్టూర్చాడు కిరణ్. తల్లిదండ్రులు గుడిలో అర్చన చేయించారు. పూజారి అందించిన హారతిని కళ్ళకద్దుకున్నాడు కిరణ్. పూజ ముగియగానే ఏదో పనివుందని గోపాల్రావ్ వెళ్ళిపోయాడు. తల్లీకొడుకు లిద్దరూ అక్కడే మిగిలిపోయారు. ఇద్దరూకలసి ఒక్కొక్క మెట్టూ దిగుతూ, గుడి ప్రాంగణాన్ని దాటారు. గుడికి కొంచెం దూరంలో వున్న పొగడపూలచెట్టు కన్పించగానే ఒక్క క్షణం ఆగిపోయాడక్కడే.

"అమ్మా! కాస్సేపు ఆ చెట్టుదగ్గర కూర్చోవాలని వుంది." అన్నాడు కిరణ్ నెమ్మదిగా. కొడుకు కోరికను కాదనలేక కిరణ్‌తోపాటు తనూ నడచిందా చెట్టు దగ్గరకు. చెట్టుక్రింద కూర్చొని, అక్కడి పరిసరాలన్నీ పరికించాడు. పొగడపూలు క్రింద రాలి.... సువాసనను వెదజల్లుతున్నాయి. మది నిండా శాంతి జ్ఞాపకాలే. క్షణకాలం కళ్ళు మూసుకున్నాడు. కాలిమువ్వల చప్పుడూ.... శాంతి నవ్వూ.... విన్పించినట్లుగా అన్పించి కళ్ళు తెరచి చూశాడు కిరణ్. ఉహుఁ! అక్కడ శాంతి కన్పించలేదు. తనూ.... తన తల్లీ తప్ప మరెవ్వరూ లేరక్కడ. అంతా తన భ్రమ. శాంతికి బహుశా తన కళ్ళకు ఆపరేషన్ అయిందనీ, తనకు చూపు వచ్చిందనీ తెలియదేమో. లేకపోతే.... యీ పాటికి యిక్కడికి వచ్చి వుండేది. 'ఇక....వెళ్దాం' అంటూ లేచి నిలబడ్డాడు కిరణ్. పార్వతమ్మ గుడికి వచ్చినప్పటినుంచీ కిరణ్ మొహంలో కదిలే మార్పుల్ని గమ

నిస్తోంది. కొడుకు పరిస్థితి అర్థంచేసుకొని.... మౌనంగా వుండిపోయింది పార్వతమ్మ. ఇంటికి చేరుకున్నా శాంతి జ్ఞాపకాలు అతన్ని నీడలా వెంటాడుతూనే ఉన్నాయి.

*　　　　*　　　　*

కిరణ్ పుట్టినరోజు పండుగ ఘనంగా చేయాలని నిశ్చయించుకున్నాడు గోపాల్రావు. ఆ రోజున పెద్ద యెత్తున విందుభోజనం జరిపించాడు. అసలు వ్యక్తి శంకరం మాష్టారు యింకా రానేలేదు. వచ్చిన అతిథులంతా తోచిన విధంగా కానుక లందించి, విందులో పాల్గొని వెళ్ళిపోయారు.

సుబ్బయ్య, రాఘవతో కలసి ఏదో పనిమీద పట్నానికి వెడుతూ మాలతిని శంకరం మాష్టారికి అప్పగించాడు. గోపాల్రావు యింటికి వెళ్ళేసరికి రాత్రి తొమ్మిది దాటింది. కిరణ్ ఎప్పుడో నిద్రపోయాడు. శంకరం మాష్టారిని చూస్తూనే సాదరంగా ఆహ్వానించాడు గోపాల్రావ్. "రావోయ్.... రా.... ఏమిటీ యింతాలస్యం? అన్నీ సిద్ధంగా వున్నాయి. నీ కోసమే ఎదురుచూస్తున్నాను" అంటూ మాలతివైపు చూసి, "ఈ అమ్మాయిని వెంటబెట్టుకొని వచ్చావేమిటి? ఈ అమ్మాయి, సుబ్బయ్య రెండో మనవరాలు కదూ. ఇదిగో అమ్మాయీ, మాష్టారు వచ్చేదాకా బయట ఆ వరండాలో కూర్చో."

గోపాల్రావ్ మాటలకు శంకరం మాష్టారు ఎంతగానో బాధపడుతూ, "గోపాలం, నేనిలా మాలతిని నాతో తీసుకరావడం నీకు నచ్చకపోతే చెప్పేయ్. నేను వెళ్ళిపోతాను. మాలతిని.... బయట కూర్చోమన్నావు. ఇంక చాలు గోపాలం. నేనూ మాలతితోపాటే వెళ్తాను. వెళ్ళేముందు మరోసారి చెబుతున్నాను. నీ తత్వాన్ని ఎంత త్వరగా మార్చుకుంటే అంత మంచిది. నీ దృష్టిలో వాళ్ళు కులహీనులు. కాని.... వాళ్ళల్లో ఎంతటి మానవత్వం దాగివుందో నీవు గ్రహించలేకుండా వున్నావు. ఎప్పటి వైరాన్నో యిప్పటికీ అలానే సాగదీస్తున్నావు. ఇది మంచివాళ్ళ లక్షణ మన్పించుకోదు," అన్నారు.

"నీకు తెలీదు శంకరం, నా చెల్లెలి బ్రతుకును నష్టేటముంచిన ఆ దగుల్బాజీల కుటుంబంలోని వారెవరయినాసరే నా కసహ్యం. వాళ్ళంటేనే నాకు గిట్టదు. వాళ్లు దగాకోరులు. ఇక.... వాళ్ళ స్వభావం గురించి చెప్పాలా? ఎక్కడేది కన్పించినా తమ స్వంతంచేసుకోడానికి ఎన్ని నాటకాలయినా ఆడతారు. కోటలో పాగా వేయాలని చూస్తూంటారు. వాళ్లలో ప్రవహిస్తున్న రక్తమే అలాంటిది. నువ్వు యీ వాదనలో దిగి, నా సంతోషాన్ని నాశనం చేయకురా"

"ఇది వాదనా? కాదు.... నా ఆవేదన. ఈ నా ఆవేదనను నువ్వు అర్థం చేసుకోలేవు గోపాలం. మోడులా మిగిలిపోయిన ఒక అడకూతురి జీవితాన్ని నిలబెట్టడానికి ముందంజవేసిన ఆ సహృదయుల్ని తూలనాడటం ఒక్కటేరా నీకు తెలిసింది. నీకు తెలుసు; చంద్రమ్మ, శాంతీ అగ్నికాహుతై పోయినట్లు. తక్కిన విషయాలు నీకు తెలియవు. మాలతిని నేను పెంచుకోవా లనుకుంటు న్నానురా. మాలతి నాకు బిడ్డలాంటిది. నన్ను ఆక్షేపించడానికి ఎవరూ లేరు. నేను సర్వ స్వతంత్రుడ్ని. నీకు నా నిర్ణయం నచ్చినా నచ్చకపోయినా నా నిశ్చయం మారదు. నేనిది అధర్మమనుకోవడం లేదు. మానవుడిగా నా కనీస ధర్మంగా భావిస్తున్నాను," శంకరం మాష్టారి నిర్ణయం విన్న గోపాల్రావ్ హతాశుడయ్యాడు.

"ఏమిటీ.... నువ్వు బ్రాహ్మణుడివనే విషయమే మరచిపోయినట్లుందే! ఎవరో కాలి చచ్చిపోతే.... అ బూడిదను పూసుకొని తిరుగుతానంటావు ఇదేం బుద్ధి? ఏమైనా పిచ్చెక్కిందా నీకు!" అన్నాడు.

"పిచ్చివాడ్ని నేను కాదు....నువ్వు. కళ్ళు మూసుకొని విచక్షణా జ్ఞానాన్ని మరచిపోతూ బ్రతుకుతున్న పిచ్చివాడివి నువ్వే."

"ఏమన్నావ్" దాదాపుగా అరిచాడు గోపాల్రావ్.

గడప దగ్గరే ఆగిపోయిన మాలతి ఆ యిద్దరివైపూ భయంగా చూస్తూ నిలబడిపోయింది. "మాష్టారూ....నేను వెళ్ళిపోతున్నాను," ఎలాగోలా గొంతు పెగుల్చుకొని అంది మాలతి.

"ఆగు! మాలతీ! నేనూ వస్తున్నాను. ఈ మహానుభావుడికి ఒక విషయం చెప్పాలి. ఇక తప్పదు," అంటూ గోపాల్రావ్ వైపుకు తిరిగి చెప్పడం ప్రారంభించారు శంకరం మాష్టారు.

"గోపాలం! నీ హృదయమింత పాషాణంగా మారిపోయిందా! శాంతి దగ్గర ....తన గురించిన విషయాలేవీ నీతో చెప్పనని మాట తీసుకున్నానురా. లేకపోతే నీ కారోజే శాంతి గురించిన అన్ని విషయాలూ తెలిసిపోయేవి. ఇప్పటికైనా నీకు తెలపాలి. నీ కిరణ్‌కు చూపువచ్చిందనీ, నీ కొడుకు జీవితంలోకి వెలుగు రావడానికి నేనే కారణమనీ, నేనెంతో సహాయంచేశాననీ....నన్నూ, డాక్టర్ని ఎంతగానో ప్రశంసించావు. కానీ.... అసలు నేత్రదానం చేసిందెవరో నీకు స్పష్టంగా ఆరోజు చెప్పలేదు. బహుశా అపుడే చెబితే నీ కొడుకును అలాగే గ్రుడ్డివాడిగానే ఉంచేవాడివిగాని....ఆపరేషన్ చేయించడానికి ఒప్పుకునేవాడివి

కాదేమో? అందుకనే.... అంత ప్రమాద స్థితిలో వుండికూడా.... శాంతి నా చేత ఒట్టు వేయించుకుంది. నీ కిరణ్ కళ్ళు ప్రశాంత సరోవరాల్లా వుండి, మల్లెలను గుర్తుచేస్తున్నాయన్నావు కదూ.... ఆ కళ్ళే మీ యింట చల్లని వెన్నెలను పరిచాయన్నావు కదూ. ఇపుడు చెబుతున్నాను విను. ఆ కళ్ళు.... శాంతి కళ్ళురా శాంతివి" కంఠం గద్గదమవుతూంటే మళ్ళీ చెప్పసాగారు శంకరం మాష్టారు.

"శాంతి! కాలిపోతున్న గుడిసెలో వున్న తన తల్లిని రక్షించుకుందామని లోపలికి వెళ్ళి సజీవంగా దహనమైపోతున్న తల్లిని చూస్తూ అక్కడే మంటల మధ్య చిక్కుకుపోయింది. కొనవూపిరిలో వున్న శాంతిని గుడిసెనుండి బయటకు తీసుకొని రాగలిగారు కాని.... ఆ ముఖం తప్ప, శరీరమంతా కాలిపోయిన శాంతిని రక్షించుకోలేకపోయాము. శాంతి మూడ్రోజులవరకూ మృత్యువుతో పోరాడి, కృష్ణమోహన్ నర్సింగ్‌హోమ్‌లోనే తన ప్రాణాలను కోల్పోయింది. తన తుది ఘడియల్లో శాంతి ఏం కోరుకున్నదో తెలుసా?: నువ్వూహించలేవు. 'నా నేత్రాలు కిరణ్‌కు ఉపయోగపడితే అతనికి అమర్చి చూపువచ్చేలా చేయండి, నా కళ్ళతో కిరణ్ చూడగలిగితే అంతకు మించిన తృప్తి నాకేముంటుంది మాష్టారూ యీ విషయం కిరణ్‌వాళ్ళకు తెలియపర్చవద్దు' అని చెప్పి, నాచేత ఒట్టువేయించుకొని మరీ కన్నుమూసింది శాంతి. నీలో మూర్ఖత్వం యింకా పెరుగుతూవుంటే నేను చూసి భరించలేక నీకీవిషయం చెప్పేశాను.

"ఇపుడు చెప్పు గోపాలం.... కులహీనురాలనీ, అంటరానివాళ్ళనీ, అనాగరికులనీ నీవు భావించే ఆ శాంతి కళ్ళతో నీ కిరణ్ చూడగల్గుతున్నాడని అతని కళ్ళనిపుడు పెరికివేసేంతటి మూర్ఖుడి కావనుకుంటాను. మనిషన్న తరువాత చేసిన తప్పుడు పనులకు పశ్చాత్తాప పడాలిరా. కాలంతోపాటు మారాలి. ఆ మార్పులో సహృదయత, మానవత ఉండాలి. మనిషిలో సంస్కారాన్ని చూపెట్టగలిగేది మానవత్వమనీ, కులంకాదనీ యికనైనా గ్రహించు. నాకు యిక్కడ్నుంచి ట్రాన్స్‌ఫర్ అయినట్లు నీకూ తెలుసు. రేపు వెళ్ళిపోతున్నాను. నాతోపాటు మాలతిని, సుబ్బయ్యను తీసుకెళుతున్నాను. ఇంకా ఇక్కడేం మిగిలిందని వాళ్ళుండగలరు? నీలో ఎప్పటికయినా మార్పువస్తే సంతోషించేవాళ్ళల్లో నేనొకడిని. ఇక వుంటాను మరి" అంటూ గోపాల్రావ్‌ను ఆశ్చర్యంలో వదిలిపెట్టి మాలతి చెయ్యిపట్టుకొని, తన యింటివైపుకు దారితీశారు శంకరం మాష్టారు.

గేటుదాటి వెళ్ళిపోయిన శంకరాన్ని చూస్తూ అతను చెప్పిన యదార్థాన్ని తల్చుకుంటూ నిశ్చేష్టుడయ్యాడు గోపాల్రావ్. 'తను ఎప్పుడూ అసహ్యించు



కునే శాంతి తన కళ్ళను కిరణ్‌కు....?' ఆ తర్వాత ఆలోచించలేకపోతున్నాడు గోపాల్రావ్.

'ఎంత ఆశ్చర్యం! శాంతితో స్నేహమేమిటి? ఆ కబుర్లేమిటంటూ....ఎంత దూరంగా వుంచినా, తన కొడుకు కిరణ్‌కు చూపునందించి, తను చీకటిలోకి తప్పుకున్నది. అందుకనే కాబోలు యిపుడు దేనికీలా అందకుండా పోయి కిరణ్ కళ్ళల్లో వెలుగులను కురిపిస్తున్నది. ఇపుడీ సంగతి నా కిరణ్‌కు తెలిస్తే? ఏమై పోతాడో? భరించలేడు. ఈ విషయాన్ని తెలియకుండా ఉంచితేనే తనకు శ్రేయస్కరం. శాంతి, కిరణ్ స్నేహంగా వుంటే తనెంత కర్కశంగా ప్రవర్తించేవాడో? తల్చుకుంటూంటే యిపుడు సిగ్గనిపిస్తోంది. కిరణ్ శాంతిని మరచిపోవాలి. ఆగిపోయిన చదువును నిరాటంకంగా సాగనివ్వాలి. అవును ఈ

వాతావరణానికి దూరంగా పట్నంలో వుంచి చదివించాలి.' నిర్ణయాలు చేసుకున్నాడు గోపాల్రావ్.

*　　　　*　　　　*

'శాంతి నెలా కలుసుకోవాలి? శాంతి దగ్గరకు కబురుచేయడానికి ఆయా కూడా లేదు. ఇపుడేం చేయాలి? ఆ... అమ్మనడిగితే?' అనుకోవడమే తడవుగా తల్లిదగ్గరకు వెళ్లాడు కిరణ్. ఇంట్లో తండ్రి లేడు. శాంతిని పిలిపించడానికిదేసమయమని తోచింది.

"అమ్మా! శాంతిని చూడాలని వుంది. ఎవరితోనయినా చెప్పి, పిలిపించవూ," దీనంగా ఆశగా అడిగాడు. అది విన్న పార్వతమ్మ నోట మాటరాక స్తబ్ధురాలయింది. ముందే భర్త ఆదేశించిన ప్రకారంగానే కొడుకుతో చెప్పింది. "శాంతివాళ్లు యీ వూరు విడిచి ఎపుడో వెళ్లిపోయారట. ఎక్కడికి వెళ్లారో నాకు సరిగ్గా తెలియదు." అంది ముక్తసరిగా. ఆ పైన తల్లితో ఏమీ మాట్లాడకుండా తన గదిలోకి వచ్చేశాడు కిరణ్.

శాంతి గురించి తల్లి చెప్పిన వార్త విన్నప్పట్నుంచీ కిరణ్ మనస్సు అదోలా అయిపోయింది. ఒక్కసారిగా తన కళ్లముందు తను దాటిరాలేనంత చీకటి నిండి ఉన్నట్లూ.... తానా చీకటిలో కూరుకుపోతున్నట్లుగా అన్పించింది.

*　　　　*　　　　*

కాలం ఎవరికోసమూ ఆగకుండా ముమ్ముందుకు పరుగులు తీస్తోంది. ఎన్ని ఋతువులు మారినా, ఎన్ని వసంతాలు గడిచినా.... కొన్ని జ్ఞాపకాలు మదిలో చెక్కుచెదరకుండా అలానే నిలచిపోతాయి. ఆ జ్ఞాపకాలలో సంతోష ఘడియలూ ఉండవచ్చు.... లేదా విషాద సంఘటనలైనా యిమిడి వుండవచ్చు. ఈ పదేళ్ళలోనూ... ఎన్నో మార్పులు వ్యక్తిగతంగా, సామాజికంగా. అయినా ఆ మార్పులో కొందరి మానసిక ప్రవృత్తి మరీ మూఢత్వంగా తయారయితే, మరి కొందరు 'కాలానుసారంగా మారాలి. తప్పదు' అనుకొని తమకు నచ్చని సిద్ధాంతాలను, పరిస్థితులను కూడా ఏ మాత్రం జంకకుండా స్వీకరించగలుగుతున్నారు.

లోకంలో యిన్ని మార్పులు సంభవిస్తున్నా, అతని ప్రవర్తనలో, ఆలోచనలో ఎక్కడా మార్పులేదు. అసలు.... సంస్కారయుతంగా, ఆదర్శమూర్తిగా, ఒక ప్రత్యేకమైన వ్యక్తిత్వాన్ని రూపుదిద్దుకున్న అతనిలో మరో క్రొత్త మార్పుకు చోటెక్కడిది?

ఒకప్పటి చెలిమి: ఆ చెలిమిలో చిగురించిన ఆశ యీనాడు క్రొత్త చిగుర్లు తొడిగి, పచ్చపచ్చగా ఎంతో ఎదిగి జీవితంలో ఎన్నెన్నో ఆదర్శాలతో ముందంజవేస్తున్న అతనికి ఆ ఒకప్పటి చెలిమి.... ఒక చల్లని స్నేహ హస్తాన్ని అందించి జీవితానికే క్రొత్త అర్థాన్ని సూచించిన....ఆ అమృతమయిని ఎప్పటికైనా చూడలేకపోతానా: ఎక్కడైనా కన్పిస్తే గుర్తించలేనా.... అనే ఆశ మిగిలింది. ఆ ఆశతోనే.... ఎక్కడో దూరాన ఉద్యోగం వచ్చినా.... ఒంటరిగా అక్కడే ఉద్యోగం చేసుకుంటూ, తను చేపట్టవలసిన కార్యక్రమాల గురించి ఆలోచిస్తూ; తనలోని యీ ఉత్సాహానికి కారణమైన.... ఆ అదృశ్య మూర్తిని తలచుకుంటూ గడుపుతున్నాడు. అతను.... అతడే... కిరణ్‌బాబు.

తల్లీ, తండ్రీ వృద్ధులయిపోయారు. పుట్టినప్పటి నుంచీ యిన్నాళ్లు వుండిన ఆ వూరిని విడిచి ఎక్కడో దూరానవున్న ఊళ్ళోకి రావడానికి నిరాకరించి అక్కడే ఉండిపోయారు వాళ్లిద్దరూను. తన తల్లిదండ్రులకు అక్కడే సౌకర్యంగా వుంటుందని గ్రహించి, తనొక్కడే వెళ్ళి, సమిశ్రగూడెంలో వున్న ఒకే ఒక హైస్కూల్‌లో పదవతరగతికి యింగ్లీష్ టీచర్‌గా ఉద్యోగం చేసుకుంటూ కాలం గడుపుతున్నాడు. ఇప్పటికి రెండు చోట్లకు బదిలీ అయ్యాడు. ప్రస్తుతానికి సమిశ్ర గూడెంలో అతనికి సౌకర్యంగానే వుంది.

సమిశ్ర గూడెం పల్లెటూరే. చుట్టూ పచ్చటి పొలాలు. పక్కనే గోదావరి కాలువ ప్రవహిస్తూ.... సాయంత్రం పూట ఆ వంతెనమీదుగా వాహ్యాళికెడితే ఎంతో ప్రశాంతంగా వుంటుందక్కడ. ఆ కాలువ పక్కనే రైలుపట్టాలకివతల ఎన్నో దేవాలయాలు. ఆ దేవాలయాలకు కొద్దిగా వెనుకకు ఒక సత్రముంది. ఎపుడు చూసినా అక్కడ కోలాహలంగానే వుంటుంది. ఆ ప్రాంతం నిడదవోలు పట్టణానికి చెందినది. ఈ క్రొత్త ప్రదేశం బాగానే వుంది. తల్లీ, తండ్రీ ఉద్యోగం ఎలానూ వచ్చేసింది కాబట్టి, పెళ్ళి చేసుకుని త్వరగా ఒక యింటివాడివి కమ్మంటూ ఎన్ని ఉత్తరాలు రాసినా లాభం లేకపోయింది. చిన్నప్పటినుంచీ తన హృదయలో ప్రతిష్ఠించుకున్న ఓ రూపం.... తన మదిలో వేయి సౌరభాలను విరజిమ్ముతూ వుంటే తన కలలు కల్లలు కాకూడదనీ కన్పించని దేవతలను వేడుకుంటూ కాలం గడుపుతున్నాడు కిరణ్. తీరిక సమయాల్లో అతని మదినిండా ఏవేవో ఆలోచనలు. ఆ ఆలోచనలనిండా.... తను అంధుడుగా వున్నపుడు తన చీకటి కళ్లకు జ్యోతిగా నిలచి, జీవితం పట్ల ఆసక్తిని కల్గించిన శాంతియే కన్పిస్తూ ఉంటుంది. తనకు చూపు వచ్చిన తర్వాత శాంతి తనకు కన్పించనేలేదు. శాంతి గురించి ఎంతగా అడిగినా అప్పట్లో ఎవరూ సమాచారం సరిగ్గా చెప్పలేకపోయారు.

కుల - తాల విభేదాలలో రోజు కెన్ని జీవితాలు బలయిపోతున్నాయో ఒకవైపు కళ్ళారా చూస్తూనే వున్నాడు. మరోవైపు వార్తా పత్రికలలో చదువుతూనూ వున్నాడు. ఎన్ని ప్రాంతాలు యిలాంటి విషాదఘటనలతో అల్లకల్లోలితమయ్యాయో తల్చుకుంటూంటేనే ఒళ్ళు జలదరిస్తూంటూంది. ప్రతివాడూ తనలాంటి మనిషే నని ఎందుకనుకోరు?! అందరూ....ఏ మతమయినా, ఏ కులమయినా ఒకట్టిగా, ఐక్యతతో ఎందుకు కలసిమెలసి ఉండలేకపోతున్నారు? ఈ సమస్య ఎప్పటికి పరిష్కారం కాలేదేమో?! ఇలా ఆలోచించుకొని లాభంలేదు. తనకు చేతనయి నంతగా యీ ప్రాంతంలోనే కొన్ని నూతన మార్గాలను చేపట్టి యిక్కడి మనుషుల నడవడికలో కొంత మార్పునైనా తేగలిగితే తన కెంత తృప్తి?! ఈ ఆలోచన రావడమే తడవుగా ఒకవైపు ఉద్యోగం చేస్తూనే.... రాత్రి సమయాన వయోజనులకు చదువు చెప్పడం ప్రారంభించాడు కిరణ్.

కులమతాల పట్టింపులకు ప్రాధాన్యత నివ్వకుండా తను నేర్చుకున్న విద్యను పదిమందికీ నేర్పగలగాలి. అపుడే తన జీవితానికి సార్థకత. అతని భావాలను అర్థంచేసుకున్న ఆ వూరి ప్రజలు ... క్రమంగా అతని దగ్గర చదువుకోడానికి రాసాగారు. మొదట విముఖత చెంది, ఆ.... యిపుడేం చదువులే అనుకున్న వాళ్ళకు కూడా అతను చెప్పే తీరునుబట్టి ఫర్వాలేదు చదువుకుంటే ఏమీ నష్టపోము కదా, అనుకొని అతని లక్ష్యసాధనలో తోడ్పడసాగారు. కాస్తో కూస్తో అక్షర జ్ఞానం కలిగి వుండటం మంచిదేనన్న అభిప్రాయానికి వచ్చారు. చదువుకోడానికి వచ్చే వయోజనుల సంఖ్య రెండు నెలల్లోనే పెరిగింది. కొంత పెట్టుబడి పెట్టి, అక్కడే వయోజన విద్యాకేంద్రాన్ని స్థాపిస్తే బాగుంటుందని కిరణ్ భావించాడు. ఆ విద్యా కేంద్రానికి శాంతికిరణ్ వయోజన విద్యాకేంద్రమని పేరు పెడితే....? ఈ ఆలోచన రాగానే త్వరత్వరగా కార్యరంగంలోకి దూకాడు. ప్రభుత్వ సహాయాన్ని అర్థించాడు. అతని ఉత్సాహాన్ని, కార్యదీక్షతను గమనించి, ప్రభుత్వ మతనికి తగిన ప్రోత్సాహ మందించింది. పనులు చురుకుగానే సాగుతున్నాయి.

* * *

"స్టార్ట్ ఇమ్మీడియట్లీ" టెలిగ్రాం అందుకున్న కిరణ్ వారం రోజులు శలవు పెట్టి, మేడికొండూరుకు బయల్దేరాడు. గుంటూరులో బస్సు మారాలి. ఎక్కడి సమిశ్రగూడెం, ఎక్కడి మేడికొండూరు? చాలా దూర ప్రయాణం. మనసులో అదుర్దా అక్కడేమయిందోనని. బస్సు కృష్ణా జిల్లాను దాటింది. ఆలోచనల్లోనే గుంటూరు వచ్చేసింది. బస్సు దిగి, మేడికొండూరుకు వెళ్ళే బస్సు

దగ్గరికి పరుగెత్తాడు. అపుడే కదలడానికి సిద్ధంగా వుందా బస్సు. సమయానికి అందుకోగలిగాను అనుకుంటూ ఖాళీగావున్న సీటులోకెళ్ళి కూర్చున్నాడు. ఇక్కడ్నుంచి పదిమైళ్ళు ప్రయాణం చేయాలి.

పొలాలు పచ్చపచ్చగా కన్పిస్తూ చూసే కళ్ళకు ఆనందాన్నిస్తున్నాయి. కిరణ్‌కు అలా పచ్చటి పోలాల్ని చూస్తూ ప్రయాణం చేయాలంటే ఎంతో సరదా! మేడికొండూరు దగ్గరలోనే వచ్చేసింది. చెరువుకట్టను దాటి, వంతెన మీదుగా దూసుకుంటూ పోతున్నది బస్సు. వాగులో నీళ్ళు బాగానే ప్రవహిస్తూ అదోరకమైన శబ్దాన్ని కలుగజేస్తున్నాయి. రోడ్డుమీదే బస్సు ఆగిపోయింది. గబగబా, తన సూట్‌కేస్ తీసుకొని, క్రిందకు దిగి చుట్టూ చూశాడు. క్రొత్తగా ఏదో చిన్న హోటల్ అక్కడ కన్పించింది. ఒక ప్రక్క ధర్మ సత్రం, మరో కొట్టు, ఆ ప్రక్కనే చిన్న క్లినిక్. ఏమంతగా మారలేదు ఆ పరిసరాలు. మెల్లగా నడక సాగించాడు. ఎలిమెంటరీ స్కూల్‌కు సున్నం కొట్టించారేమో, క్రొత్తగా కన్పిస్తుంది. అదిగో అక్కడే శివాలయం, దానికి ఎదురుగా అంజనేయస్వామి గుడి. ఇక్కడే శాంతి తనకు పరిచయమైంది. దూరంగా.... ఆ పొగడపూల చెట్టు. ఆకులు రాలిపోయి వుంది. ఆనాటి జ్ఞాపకాలను నెమరేసుకుంటూ ఊళ్ళోకి ప్రవేశించాడు. అందరూ ఎవరీ క్రొత్త సూట్ వాలా అన్నట్లు చూస్తున్నారు. చిన్నగా నవ్వుకున్నాడు కిరణ్. ఎదురైన తెలిసినవాళ్ళు యిపుడేనా రావడం? ఎన్నాళ్ళుంటావు అని ప్రశ్నిస్తున్నారు. అన్నిటికీ చిరునవ్వే సమాధానం. పెళ్ళిగ్రాం ఎందుకు పంపారు అనుకుంటూనే గేటు తీసుకొని లోపలికి వెళ్ళాడు. అలికిడి విని బయటకు వచ్చింది పార్వతమ్మ. "బాబూ! వచ్చావట్రా, ఎంత చిక్కిపోయావురా. కాళ్ళ కడుక్కొని రా...." అంటూ సూట్‌కేస్ తీసుకుంది. "బాగున్నానమ్మా?" టవల్‌తో మొఖం తుడుచుకుంటూ అన్నాడు కిరణ్.

"ఆ అంతా బాగున్నారు గాని నువ్వేమిటి యిలా తయారయ్యావు," ఆప్యాయంగా కొడుకును చూస్తూ అంది. "నాకేం? నేను బాగానే వున్నాను గానీ ఏమిటీ పెళ్ళిగ్రాం...." అన్నాడు.

"అదా.... నేనే నీకు పెళ్ళిగ్రా మివ్వమని నాన్నతో చెప్పాను. ముందు భోంచేయి. ఎపుడనంగా తిన్నావో ఏమో," అంటూ గబాగబా వంటింట్లోకి వెళ్ళింది పార్వతమ్మ.

తల్లి కొసరి కొసరి వడ్డిస్తుంటే ఆరోజు తృప్తిగా భోంచేశాడు కిరణ్. "నాన్న ఎక్కడి కెళ్లారు?"

"అటు చేలకేసి వెళ్ళారు. ఇపుడే పనీ లేదుగా చేయడానికి. ఎపుడూ అక్కడే వుంటారు. నీవు ఉద్యోగంచేసే చోటు ఎలా వుంది?" అడిగింది పార్వతమ్మ.

"బాగానే వుంటుంది?" ముక్తసరిగా అన్నాడు.

"అక్కయ్య దగ్గర్నుంచి ఉత్తరాలేమయినా వస్తున్నాయా?"

"కస్తూరి పెద్దపాప లతకు పెళ్ళి నిశ్చయించేశారుట. మొన్ననే ఉత్తరం వచ్చింది. కిరణ్ నువ్వు యింకెప్పుడు పెళ్ళిచేసుకుంటావు? ఎలాగయినా సరే, యీ సంవత్సరంలో నీ పెళ్లి జరిపిస్తేనే గాని నాకు తృప్తిగా వుండదు. నిన్ను అందుకే పిలిపించాను. ఉత్తరం వ్రాస్తే అసలు రావు. అందుకనే టెలిగ్రాం ఇప్పించాను. మన బంధువుల అమ్మాయే. కాని దూరపు చుట్టరికం. బహుశ నువ్వు ఆ అమ్మాయిని చూసి వుండవు. రఘునాధరావుగారని వినుకొండలో కరణంగా పనిచేస్తున్నారట. వాళ్ళమ్మాయి సుజాత. చదువుకుందంట. రేపు వెళ్లి అమ్మాయిని చూసివస్తే....ముహూర్తాలు పెట్టుకోవచ్చు. ఆ అమ్మాయి నీకు నచ్చుతుందనే అనుకుంటున్నాను," చెప్పవలసింది చెప్పేసి యిక నీదే ఆలస్యమన్నట్లు చూసింది పార్వతమ్మ.

తల్లి పెళ్లిమాట యెత్తేసరికి విసుగనిపించింది కిరణ్‌కు. నా నిర్ణయం యిప్పట్లో మారదమ్మా. నేనపుడే పెళ్లిచేసుకోను. దీనికోసమని పనిగట్టుకొని టెలిగ్రామెందుకు పంపించారు? నా కక్కడ బోలెడు పనులున్నాయి. ప్చ్. ఏమిటో....నే నెపుడో చెప్పేశానుగా నా నిర్ణయాన్ని," అంటూ విసుగ్గా ముఖం పెట్టాడు కిరణ్.

"అదేవిట్రా అలాగంటావు. పోనీలే....కనీసం పెళ్ళిచూపులకయినా....వెళ్లి వచ్చెయ్. నీ కంతగా ఇష్టంలేకపోతే యీ సంబంధం నచ్చలేదని వాళ్లకు రాసేయొచ్చు," నెమ్మదిగా అంది.

"ఊహు, పెళ్లిచూపులకు కూడా వెళ్ళను. ఇష్టంలేనపుడు పెళ్ళిచూపుల పేరిట వాళ్ళనెందుకు కష్టపెట్టాలి," నా నిర్ణయానికి తిరుగులేదన్నట్లుగా అక్కడితో సంభాషణ ముగించి తన గదిలోకి వెళ్లిపోయాడు కిరణ్.

* * *

అక్కడ రెండురోజులకంటే ఎక్కువగా ఉండలేకపోయాడు. తల్లితో, తండ్రితో చెప్పి బయల్దేరాడు. వెళ్ళిపోతున్న అతన్ని ఆపలేకపోయారు ఆ దంపతులు. కిరణ్‌కు మనస్సంతా చికాకుతో నిండిపోయింది. "నీ ఉద్దేశ మేమిటి? ఎవర్నయినా ప్రేమించావా?" అంటూ తండ్రి నిలదీసి అడిగాడు.

తరువాత పేజీల్లో చూడండి




తను ఏమని సమాధానం చెప్పగలడు? మౌనమే శరణ్యమైంది. "ప్రేమిస్తే ప్రేమించావు గాని, వేరే కులందాన్ని, యింకో మతానికి చెందినవాళ్ళను మటుకు ప్రేమించకు, తెలిసిందా?" చిన్నపిల్లవాడికి రోడ్డుదాటేటపుడు చేసే సూచనల్లా తండ్రి తనకు కులమతాల ప్రాముఖ్యాన్ని గురించి చెప్పాడు. అంతా విని ఒక నిశ్చయానికి వచ్చేశాడు తను. ఆ నిర్ణయాన్నే కచ్చితంగా చెప్పేశాడు తండ్రితో. "నాన్నా! నాకు నచ్చిన అమ్మాయి ఏ కులానికి చెందినదైనా ఆ అమ్మాయినే పెళ్ళిచేసుకుంటాను. లేకపోతే యిలా బ్రహ్మచారిగానే వుండిపోతాను." తన మాటలు తన తల్లితండ్రులను బాధిస్తాయి. తప్పదు. కులమత పరిధుల్లో వుంటే ఏమీ సాధించలేము. ప్రతి మనిషిలోనూ కులతత్త్వము బాగా పాతుకుపోయింది. తన తండ్రితో ఘర్షణ, తల్లి కళ్ళల్లో కన్నీళ్లు. ఈ బంధాల తాకిడిలో పరువు ప్రతిష్ఠల ముసుగులో మనిషి బ్రతుకు అజ్ఞానాంధకారంలో ముగియవలసిందేనా? కులాలూ, మతాలూ లేని సమాజం సంభవనీయం కాకపోవచ్చు. కాని....కాని తోటిమనిషియొక్క ఆత్మాభిమానాన్ని ఎన్ని ఘాతుకాలకైనా ఒడిగట్టవచ్చు. ప్రతి మనిషీ పుట్టి పెరిగేది జాతి, మత, కుల పరిధుల్లోనే. ఎక్కడో వీటన్నిటికీ అతీతంగా వుండి, మానవజాతి శ్రేయస్సుకోసమే పాటు

పడేవాళ్ళుంటారు. అగ్రకులాలవారు నిమ్నజాతులవారిని ఎలా హీనంగా చూస్తున్నారో అలాగే ఈ నిమ్నజాతులవారు కూడా అగ్రకులాలపై తమ కక్షను అనేక విధాలుగా వాళ్ళను నాశనంచేస్తూ, పగ సాధిస్తున్నారు. ఈ పగ, కక్షలూ యిలాగే సాగితే....? మానవజాతి మనుగడ స్తంభించిపోతుంది. ఈ మారణ హోమంలో ఎందరు మిగిలిపోతారు?

ఆలోచనల ఒత్తిడితో తల భారమైపోయింది. గుంటూరులో బస్సు మారాడు. తన జీవితంలో ఎందరినో కులవిభేదాలతో, ఘర్షణలతో బలయిపోయిన వాళ్ళను చూశాడు. అందుకే తను యీ నిర్ణయాన్ని చేసుకున్నాడు. కులమేదయినా దాంపత్యమంటే మనసుల్ని కలపగలిగేదయి వుండాలి. అంతేకాని.... ఎందరు దంపతులు ఒకే కులమతాలయినా కీచులాడుకోవడంలేదు? తాను మారుతూ వ్యవస్థను మార్చగలగాలి. అపుడే కదా.... మనిషి పుట్టుకకు సార్థకత! బస్సు ఏలూరు దాటి గూడెందగ్గర కొంతసేపు ఆగి.... మళ్ళీ బయల్దేరింది. సూటిగా ఎవరి జీవితమూ సాగిపోదు. జీవితంలో ఎన్నెన్నో మజిలీలు. బాగా చీకటిపడిపోయిందపుడే. నిడదవోలు చేరేసరికి రాత్రి తొమ్మిదయింది. చాలా అలసటగా వుంది. బస్సు దిగి, ఎదురుగా కన్పిస్తున్న టీస్టాల్ దగ్గరకు నడిచాడు. అక్కడ టీ త్రాగి, కొద్దిగా రిలీఫ్‌పొంది రిక్షా ఎక్కాడు. రైలుకట్టదగ్గర వంతెన దాటి, పొలాల ప్రక్కనుండి పోతూవుంటే, చల్లటిగాలి శరీరానికి తగిలి సేద తీరుస్తున్నట్లుగా వుంది. ఆకాశంలో తారలు మిణుకుమిణుకు మంటున్నాయి. ఆ రోడ్డు మీద యీ సమయంలో అంతగా జనసంచారముండదు. క్లినిక్ దగ్గర ఆగింది రిక్షా. రిక్షా అబ్బాయికి రెండ్రూపాయలిచ్చాడు కిరణ్. అతను ఏదో గొణుక్కుంటూ అక్కడే చాలాసేపటివరకు నిలబడిపోయాడు.

ముందుకు పోబోతున్న కిరణ్ మంత్రమేసినట్లుగా అక్కడే ఆగిపోయాడు. లేత గులాబీచీర, నల్లరంగు జాకెట్టు ధరించిన ఆ యువతి పక్కనే ఓ ముసలాయన.... బహుశ తన తండ్రి వయస్సయి వుంటుందతనిది. బాగా దగ్గుతున్నాడు. మనిషి నీరసంగా వున్నాడు. ఆ అమ్మాయి అటుయిటూ చూస్తూ "ఏమిటో బాబాయి, యిక్కడున్న యీ క్లినిక్ మూసేశారు. ఇది చూస్తే క్రొత్త ప్రదేశం. ఏంచెయ్యాలో తోచడంలేదు." అంటూంది. అతనేమన్నాడో వినబడలేదు కిరణ్‌కు. వాళ్ళిద్దరి పరిస్థితి అర్థమైంది. రెండడుగులు వేస్తే తను అద్దెకుంటున్న యిల్లు వస్తుంది. కాని.... ఈ క్రొత్త వ్యక్తులకేమైనా సహాయం చేస్తే? ఆ యువతివైపు నడిచాడు. గాలికి చెదరిన ముంగురుల్ని సవరించు

కుంటూ దగ్గరగా వస్తున్న అతనితో, "ఏమండీ, యిక్కడ దగ్గరలో ఏదైనా హాస్పిటల్ వుందా? ఇక్కడికి మేమొచ్చి రెండు రోజులయింది. బాబాయికి జ్వరం ఎక్కువగా వుంది. ఈ క్లినిక్‌కు వస్తే యిది కాస్తా మూసేశారు." తన పరిస్థితిని చెప్పింది. "ఇక్కడ మరే ఆసుపత్రి లేదు గాని.... ఊళ్ళో రాజు గారి హాస్పిటల్ వుంది. మీ కభ్యంతరం లేకపోతే నేను వచ్చి చూపిస్తానని" చెప్పి, వెళ్ళిపోతున్న రిక్షావాడ్ని కేకవేసి పిలిచాడు కిరణ్. రాజుగారి హాస్పిటల్‌కు పోనీయమని చెప్పి, వాళ్ళద్దరినీ రిక్షా ఎక్కించి పంపించాడు. గబగబా తన రూంకు వచ్చి, సూట్‌కేస్ అక్కడపడేసి, సైకిల్ తీసుకొని వెళ్ళి ఆ రిక్షాను కలుసుకున్నాడు. తమ రిక్షాతోపాటే సైకిల్‌మీద వస్తున్న అతన్ని చూసి, కొంత ధైర్యం తెచ్చుకుంది ఆమె. హాస్పిటల్‌ను చేరుకోగానే రిక్షా ఆగింది. డాక్టరు పరీక్షచేసి, యింజక్షన్ యిచ్చారు. ఏవో మందులు రాసి.... "ఏం ప్రమాదం లేదు. ఈ టాబ్‌లెట్స్ మూడుపూటలా వాడండి. తగ్గిపోతుంది," అని ధైర్యం చెప్పగానే స్థిమితపడిందా యువతి.

ఇంటికి చేరుకోగానే.... ఆ అమ్మాయి ఎన్నోసార్లు థాంక్స్ చెబుతూనే వుంది. "ఇందులో నేను చేసిందేమిటండీ? మీకు హాస్పిటల్ చూపించాను. అంతే కదా. ఆ మాత్రం హెల్ప్ చేయకపోతే మనిషనేవాడికి అర్థమేముంటుంది? మీరే చెప్పండి?" కిరణ్ అనగానే "మీరు చాలా గమ్మత్తుగా మాట్లాడతారండీ," అంటూ నవ్విందామె. "ఇక నే వెడతానండి. మీ ప్రక్కవీధిలోనే వుంది నా రూమ్. మీ బాబాయిగారికి యిపుడు బాగా జ్వరంగా వుంది. చాలా నీరసంగాకూడా వున్నారు. ఆ టాబ్‌లెట్స్ టైం ప్రకారం వాడండి." అని చెప్పి వెళ్ళిపోయాడు కిరణ్. రూమ్‌కు చేరుకోగానే.... చాలా అలసటగా అన్పించింది. కళ్ళు మంటలు పుడుతున్నాయి. చన్నీళ్ళతో మొహం కడుక్కున్నాడు. ఇంకా మూడు రోజులవరకు సెలవుంది తనకు. రెండ్రోజులు రెస్ట్ తీసుకోవాలి. బస్సు ప్రయాణంతో ఒళ్ళంతా నొప్పులుగా అన్పించింది. తెల్లవారినా నిద్రలేవలేక పోయాడు. అలాగే మత్తుగా కళ్ళుమూసుకొని పడుకున్నాడు కిరణ్.

* * *

ఆ వూళ్ళో ఉన్న హైస్కూల్ అదొక్కటే. గేటు దగ్గర కన్పించిన ఆమెను చూసి ఆశ్చర్యపోయాడు కిరణ్. "అరె.... మీరా?! మీరు యిక్కడ...." తన ఆశ్చర్యాన్ని వ్యక్తపరుస్తూంటే ఆమె చిన్నగా మందహాసం చేసింది.

"ఎనిమిదోక్లాస్‌కు సోషల్‌స్టడీస్ చెబుతానండి. బి. యిడి. ట్రయినింగయి

సంవత్సర మయింది. ఇక్కడ టెంపొరరీగా జాబ్ దొరకుతుందంటే అప్లై చేశాను. మీరూ.... యిక్కడ జాబ్ చేస్తున్నారా ?" అడిగిందామె.

"ఆ ! ఇంగ్లీషు సబ్జెక్టులెంకి నాది. నేను వారంరోజుల వరకూ లీవ్ పెట్టాను. అందుకనే.... మీ గురించి తెలుసుకోలేకపోయాను. మీ బాబాయిగారికి ఎలా వుంది ?"

"ఫర్వాలేదు. జ్వరం పూర్తిగా తగ్గిపోయింది." చెప్పిందామె.

"ఇక్కడ ... మీ కంతా ఫెసిలిటీగా వుందా ? ఈ వాతావరణం నచ్చిందా ?" అడిగాడతను. "బాగానే వుంది. నిజం చెప్పాలంటే నాకు పల్లెటూరి వాతావరణమే బాగుంటుంది."

"మీరు ఒకసారి మా యింటికి రండి" ఆహ్వానించింది.

"అలాగే.... ఈ రోజు సాయంత్రం వస్తాను. బైదిబై మీ పేరు చెప్పనేలేదు." కిరణ్ అడిగాడు.

"నా పేరు మాలతి. మీ పేరు తెలుసుకోవచ్చా ?" అందంగా నవ్వింది మాలతి. "నిరభ్యంతరంగా.... నా పేరు కిరణ్. యీ రోజు ఫస్టవర్ క్లాసుంది నాకు. ఇక వస్తానండి," అంటూ ముందుకు వెళ్ళిపోయాడు కిరణ్.

* * *

"బాబాయ్! నీకు జ్వరంగా వున్నపుడు డాక్టర్ దగ్గరకు తీసుకెళ్లారు... కిరణ్ గారని.... నాతోపాటే హైస్కూల్‌లో ఇంగ్లీష్ టీచర్‌గా జాబ్ చేస్తున్నారు." అంటూ కిరణ్‌ను పరిచయంచేసింది. "నమస్తే" అన్నాడతను. "కూర్చో బాబూ." "మీ కిపుడెలా వుందండీ.... ఆ రోజు మీరు చాలా వీక్‌గా కన్పించారు." కుర్చీలో కూర్చుంటూ కిరణ్ పలకరించాడు. "బాగానే వుంది.... అమ్మాయి చెప్పింది. ఆ రోజు శ్రమ అనుకోకుండా హాస్పిటల్‌వరకూ వచ్చావంట. మీ దేవూరు ?" ప్రశ్నించారాయన.

"గుంటూరు జిల్లాలో.... మేడికొండూరని గ్రామం. బహుశా మీరటు ఎప్పుడూ రాలేదనుకుంటాను." కిరణ్ అన్నాడు.

"మేడికొండూరా ?! నాకు చాలా బాగా తెలిసిన ఊరే. అయితే.... నీ పేరు కిరణ్‌బాబు.... మీ నాన్న.... ప్రెసిడెంటు గోపాల్రావ్ కదూ."

"అరె.... మా నాన్నగారు కూడా మీకు తెలుసా ?" ఆశ్చర్యపడిపోయాడు కిరణ్. "బాగా తెలుసు. గోపాల్రావ్ నా స్నేహితుడే. పదేళ్ళక్రితం మేడికొండూరులో మాష్టారుగా పనిచేశాను. యిపుడు అక్కడేమైనా మార్పులు

వచ్చాయా? ఊరు ఏమైనా మారిందా? మీ నాన్న, అమ్మా కులాసాయేనా?" అడిగారాయన.

"అందరూ బాగానే వున్నారు. ఊరుగాని, అక్కడి మనుషులుగానీ, ఏమీ మారలేదు. మాష్టారంటే .. మీరు శంకరం మాష్టారనుకుంటాను." సంశయిస్తూ అన్నాడు కిరణ్.

"అవును. -" అంటూ ఏదో ఆలోచిస్తూ వుండిపోయారు మాష్టారు. మాలతి లోపల టీ చేసే హడావిడిలో వుంది.

"మాష్టారూ . " మెల్లగా పిలిచాడు కిరణ్.

"మాష్టారూ . మీకు శాంతి తెలిసేవుంటుంది. శాంతి గురించి.... మీ కేమయినా తెలుసా మాష్టారూ... శాంతి . సుబ్బయ్య మనవరాలు.. . శాంతీ నేనూ .. ఎంతో స్నేహంగా వుండేవాళ్లం . మీకు తెలిసే వుంటుంది. ఆ రోజుల్లో నాకు చూపులేకుండా పోయింది. నాకు చూపు వస్తుందని.. నిరాశ పడవద్దని ధైర్యం చెప్పేది. నాకు ఆపరేషన్ చేశారు. చూపు వచ్చింది గానీ.... ఆ తర్వాత . ఎక్కడా శాంతిని చూడలేకపోయాను. అమ్మ నడిగితే ఏదో వూరికి వాళ్లంతా వెళ్లిపోయినట్లు చెప్పింది. మీరు కూడా ట్రాన్స్‌ఫరయి వెళ్లిపోయారు . అయినా . శాంతి గురించి మీ కేమయినా తెలిసి వుంటుందనే ఆశ. నాకు చూపు వచ్చినప్పట్నుంచీ ఒక్కటే కోరిక మిగిలిపోయింది మాష్టారూ.... అదే.... ఆనాటి చీకటి బ్రతుకులో. వెలుగుదారిని చూపించిన నా చిన్ననాటి స్నేహితురాలు శాంతిని చూడాలని.. అంతే . "

ఎంతో ఆతృతతో మాష్టారి సమాధానం కోసం ఎదురుచూస్తున్న కిరణ్‌కు మాష్టారు తన చెమ్మగిల్లిన కళ్లను కండువాతో ఒత్తుకోవడం చూశాడు. "అయితే నీకు యిప్పటివరకు తెలియదన్న మాట. శాంతి.... నీకే కాదు మరెవ్వరికీ కన్పించని లోకాలకు ఆనాడే వెళ్లిపోయింది." మాష్టారి గొంతులో ఆవేదన. 'శాంతి యిక కన్పించదు....' ఆ నిజాన్ని భరించలేకపోయాడు కిరణ్. "ఇదెలా సంభవం మాష్టారూ. ఇలా ఎందుకు జరిగింది?" గద్గద స్వరంతో అడిగాడు.

పదేళ్ల క్రితం జరిగిన ఆనాటి సంఘటన వివరించి,

"శాంతి తను చనిపోతూ, తన స్నేహితుడికో కానుక నందించింది. శాంతి అభీష్టం ప్రకారమే ఆ కానుక నా స్నేహితుడికి అందించగలిగాను. ఆ స్నేహితుడు.... నువ్వే కిరణ్," అన్నాడు మాష్టారు.

"ఏమిటి మాష్టారూ ? శాంతి నాకు కానుక నందించిందా ? ఏది?" ఆదుర్దాగా అడిగాడు.

"కళ్ళులేని తన స్నేహితుడికి నేత్రదానం చేసింది.... యింతకన్నా.... వేరే కానుక ఏముంటుంది బాబూ. నీకు చేసిన కళ్ళ ఆపరేషన్ సక్సెస్ అయింది.... నీకు.... ఈ విషయం చెప్పొద్దని నాచేత ఒట్టు వేయించుకంది." వివరించారు.

"శాంతి కళ్ళు... ఈ రోజు నన్ను నడిపిస్తున్నాయా ? శాంతి.. తన కళ్లను.... నాకు.... ఓహ్ ... మాష్టారూ... యీ విషయాలు కనీసం మా నాన్నతోనైనా మీరు చెప్పి వుండాల్సింది.... ఇపుడు . యీ నిజాన్ని ఎలా భరించమంటారు మాష్టారూ?!" విలపించాడు కిరణ్.

"బాధపడకు కిరణ్ !.... మీ నాన్నతో చెప్పాను....కాని.... నీ కీ విషయాలు అప్పట్లో తెలియకపోవడమే మంచిది. శాంతి కన్పించదనే దిగులు అనవసరం. శాంతి ఆత్మ తృప్తిగా వుండాలంటే... నీ కళ్లల్లో ఆ కన్నీరు ఎపుడూ రాకూడదు కిరణ్ . ." అనునయిస్తున్నట్లుగా భుజంమీద చేయివేసి... నిమిరారు. "అంతేకాదు కిరణ్... అక్కడ శాంతి జ్ఞాపకాలను భరించలేక శాంతి తాతయ్య సుబ్బయ్య, శాంతి చెల్లెలూ ... నాతోపాటు వచ్చేశారు. నాకు వాళ్లిదరే ఆప్త లయ్యారు. నేను ఏకాకిని. నాకు తోడుగా వున్న సుబ్బయ్య తాతయ్య వృధాప్యంతో మరణించాడు. అప్పట్నుంచీ శాంతి చెల్లెల్ని నా దగ్గరే వుంచుకొని చదివించాను. శాంతి చెల్లెలు ఎవరో నీకు తెలియదు కదూ ... మాలతి. యీ మాలతే.... శాంతి చెల్లెలు. మాష్టారు చెప్పడం ముగించారు. కిరణ్‌కు శాంతి చెల్లెలు మాలతి అని తెలియగానే ఎంతో ఆశ్చర్యం ... ఆ వెంటనే ఆనందం కలిగాయి. శాంతి ఎలాగూ కన్పించదు. శాంతి చెల్లెలినయినా చూడగలిగాననే ఆనందం కిరణ్‌ను ఉక్కిరిబిక్కిరి చేసింది.

అపుడే ట్రేలో టిఫిన్ తీసుకొని వస్తూ ఎదుట నిలబడింది మాలతి. "తీసుకోండి మాష్టారూ...." అంటూ చేతికి అందించింది. మాష్టారు టీ మాత్రమే తీసుకున్నారు. ముగ్గురూ మౌనంగానే వున్నారు. ఎవరి ఆలోచనలు వారివి. ఆ గదిలో కూర్చున్న వాళ్లిద్దరి సంభాషణ విన్నట్లుగా వుంది. ఆమె మొహంలో నీలినీడలు కదలాడుతున్నాయి.

కొంతసేపటికి లేచి నిలబడుతూ "మాష్టారూ .. మీ దగ్గర.... శాంతి ఫోటో ఏదయినా వుందా ?" తడబడుతూ అడిగాడు. మాష్టారి సైగతో లోపలికి వెళ్లి

తరువాత పేజీల్లో చూడండి....




తీసుకొచ్చింది మాలతి. చిన్న ఫోటో అది. ఒక్కసారి ఆ.... ఫోటోలోని రూపాన్ని చూసి.... జేబులో వేసుకున్నాడు కిరణ్.

"మాష్టారూ.... ఈ ఫోటో నేను తీసుకెళ్తాను." జవాబుకు ఆశించకుండా వెళ్లిపోయాడు కిరణ్. గుండెల్లో ఏదో బాధ. మనసులో చిన్నప్పటి శాంతి జ్ఞాపకాలు.... ఆ జ్ఞాపకాలలో కదలాడే.... ఆనాటి దృశ్యాలు.... తను శాంతితో గడిపిన ఆనాటి చెలిమి.... అన్నింటినీ మననం చేసుకుంటూ తన గదిలోకి అడుగుబెట్టాడు కిరణ్. ఒకప్పటి తన జీవితంలా చీకటిగా వుందా గది. తడుము కుంటూ వెళ్లి స్విచ్ నొక్కాడు. వెలుగు ఒక్కసారిగా గదినంతటినీ తెల్లగా పరచుకున్నది. తన చీకటి జీవితంలో వెలుగులా ప్రవేశించి, తను మాత్రం తప్పుకుంది. ఆనాడు చెలిమి నందించిన శాంతి.... యిపుడు తన కంటిపాపై వెలుగునిస్తూంది. శాంతి ఫోటోను చేతుల్లోకి తీసుకొని తదేకంగా చూడసాగాడు కిరణ్. అతని కళ్ళు కన్నీటి కొలనులయ్యాయి. పొట్టిగా వుంది. లంగా, జాకెట్టు వేసుకొని.... అమాయకంగా నవ్వుతున్న శాంతి రూపమది. ఈ రూపం....కాల గర్భంలో కలసిపోయింది. అయినా ఆ అమాయకమైన కళ్ళు.... తన కంటి పాపల్లో భద్రంగా వున్నాయి. ఈ చిన్ని శాంతి ఎంత స్నేహమయి? ఎంతటి

త్యాగశీలి ?! లేచి, అద్దం తీసుకున్నాడు. ఆ అద్దంలో కన్పిస్తున్న తన కళ్లను అలాగే చూస్తూండిపోయాడు.

*　　*　　*

మాలతీ !

నీకు యీపాటికి నే నెవరినో తెలిసే వుంటుంది. మీ అక్క శాంతి నా చిన్నప్పటి స్నేహితురాలనీ; తను నాకు నేత్రదానం చేసిందనీ, ఆ కళ్లతోనే నేను యీనాడు చూడగల్గుతున్నాననీ... నీకు అన్ని విషయాలూ మాష్టారు చెప్పే వుంటారు. మా యిద్దరి స్నేహ మెంత గాఢమైనదో నువ్వు ఊహించుకోగలవు. నా బ్రతుకంతా చీకటి మయమేనని బాధపడే నా కానాడు శాంతి స్నేహంతో కొంత మనశ్శాంతి, ఊరట కలియగానే చెప్పాలి. మా నాన్నగారు శాంతిపట్ల ఎలా ప్రవర్తించారో కూడా నీకు తెలిసే వుంటుంది. మా నాన్నగారికి కులమతాల పట్టింపు ఎక్కువ. శాంతిని దూరంగా వుంచేవాడు. నేను బాధపడటం తప్ప ఏమీ చేయలేకపోయేవాడిని.... నాకు చూపు వచ్చింతర్వాత శాంతిని ఎప్పటికైనా చూడాలనే కోరిక వుండేది. కాలగర్భంలో కలసిపోయినా....శాంతి నాలోనే.... ఒక భాగమై జీవిస్తూందని యిన్నాళ్ళకు తెలుసుకోగలిగాను.

ఈనాటి నా జీవితాన్ని, నా ఆదర్శాలను ఒక మంచి పని చేయడానికి వినియోగించా లనుకుంటున్నాను. ఈ రకంగానైనా కులమతాల ప్రసక్తి లేకుండా ప్రతీ మనిషికి నాకు చేతనయినంత రీతిలో చేయూతనివ్వాలనీ, వెనుకబడినవారమని జీవితంలో ముందుకు రాకుండా చీకటిలో అలమటిస్తూ బాధపడేవారిని ఆదుకోవాలనీ వుంది.

మాలతీ, యిప్పటికి నేను చేపట్టిన కార్యక్రమం పూర్తి సన్నాహాలతో తయారైంది. ఆ కార్యక్రమాన్ని ... నిర్వహించడానికి నీ సహాయం కూడా నాకు కావాలి. ఇందుకు నీవు నాకు చేయూత నివ్వాలి. ఫ్రాంక్‌గా అడిగేస్తున్నాను. మాలతీ ! నా జీవన సహచారిణిగా.... నా జీవితంలోకి అడుగుబెడతావా? మాలతీ ! నీ అంగీకారం నాకు కొండంత బలాన్నిస్తుంది. నేను చేసుకున్న యీ నిర్ణయానికి పైలోకంలోవున్న శాంతి ఆత్మ సంతోషిస్తుందనే నా విశ్వాసం. మాష్టారుగారితో .. సంప్రదించి, ఏ విషయమూ నాకు చెబుతావు కదూ !

చివరగా, నీవు బాపనుడివి నీతో నాకేం పని ? అంటూ నీ మార్గంనుంచే నన్ను వెలివేయవని ఆశిస్తూ....

వేయికనులతో ఆ శుభఘడియకోసం ఎదురుచూస్తూ

నీ కిరణ్

ఉత్తరం చదవడం ముగించింది మాలతి.

"బాబాయ్! ఉత్తరం చూశావుగా .. నన్నేం చేయమంటావు?"

"కిరణ్ బాబు చాలా మంచివాడమ్మా! తను సరయిన రీతిలోనే ఆలోచించాడు. ఆ చల్లని శాంతి కిరణాల వెలుగులో నీ జీవితం ఎంతో శోభిస్తుంది తల్లీ. నా మనసు కూడా అదే సరయిన మార్గం అంటోంది. నీవు ఏమాత్రం ఆలోచించ కుండా ఆ చల్లని నీడలో నీ జీవితాన్ని సాగించు. నా ఆశీర్వాదం మీ కెపుడూ ఉంటుంది," మనస్ఫూర్తిగా దీవించారు మాష్టారు. ఆ సంభాషణ వింటూ గడప దగ్గరే నిలబడిపోయిన కిరణ్ మాష్టారి దగ్గరకు నడిచాడు. పాదాభివందనం



చేశాడు. "నాకీ రోజు ఎంతో తృప్తిగా వుంది బాబూ," దీవిస్తూ అన్నారు శంకరం మాష్టారుగారు.

* * *

నెలరోజులు యిట్టే గడిచిపోయాయి. ఆరోజే 'శాంతి కిరణ్ వయోజన విద్యా కేంద్రానికి' ప్రారంభోత్సవం. బోర్డుమీద "శాంతికిరణ్" అక్షరాలు అందంగా మెరిసిపోతున్నాయి. ఊళ్ళోని పెద్దవాళ్ళు వచ్చారు. కిరణ్ బాబు విద్యావ్యాప్తికి చేస్తున్న కృషిని మెచ్చుకున్నారు.

ముందు భాగాన అందమైన గులాబులూ, చిట్టి చేమంతులూ అందరినీ ఆహ్వా నిస్తున్నట్లుగా కొమ్మకొమ్మనా వూగుతున్నాయి. శంకరం మాష్టారిచేత ప్రారం భోత్సవం జరిపించాడు కిరణ్.

ఆ ఉత్సవంలో కిరణ్ తల్లిదండ్రులు కూడా పాల్గొన్నారు. తను కాబోయే కోడలు మాలతిని ఎంతో ఆదరంతో పలకరించారు ఉత్సవం ముగిసిన తర్వాత.

"శంకరం... నువ్వు ఆ రోజు అన్నట్లుగానే .. తెలుసుకున్నానురా. కులమత భేదాలతో ఎవరినీ తక్కువగా చూడకూడదనీ....మనిషి మానవత్వంతో ప్రవర్తిం

తరువాత పేజీల్లో చూడండి....




చాలనీ ప్రతి మనిషిలోనూ కులమత విచక్షణ లేకుండా దేవుడుంటాడని.... ఇన్నాళ్ళకు తెలుసుకోగలిగానురా. నాలో కొంత మార్పును కలగించింది శాంతే! శంకరం! ఆనాటి నా ప్రవర్తనకు సిగ్గుపడుతున్నాను. నన్ను క్షమించరా. శాంతిపట్ల కర్కశంగానే ప్రవర్తించాను. అయినా నా కొడుకు కిరణ్‌కు చూపునందించి దేవతలలో కలిసిపోయింది. ఈ శాంతి మనందరి మనసులలోనూ చిరంజీవిగా వుండిపోతుంది. ఈ శాంతి కిరణాల వెలుగులో యిక్కడి ప్రతీ మనిషి ఎంతో కొంత నేర్చుకోవాలి, తమ జీవితాల్ని ఆనంద మయం చేసుకోవాలి," భావోద్వేగంతో అంటున్న తన స్నేహితుడు, మాజీ ప్రెసిడెంటు గోపాలరావ్‌ను సంతోషంతో అక్కున చేర్చుకున్నారు శంకరం మాష్టారు.

"మాలతి....ఎవరో గుర్తుపట్టావా?" ఉడికిస్తున్నట్లు ప్రశ్నిస్తున్న మాష్టారి వైపు చూసి, "నాకు గుర్తే. యింకా ఆ మాటలతో నన్ను చంపకురా శంకరం! ఆనాడేదో మూర్ఖత్వంతో కళ్ళు మూసుకుపోయాయి. కోడలుపిల్ల ....మాలతి మా యింటిని పావనం చేస్తే....కృష్ణా రామా అంటూ గడిపేస్తాను."

తండ్రి మాటలు విన్న కిరణ్ చాటుగా మాలతివైపు చూసి చిలిపిగా నవ్వాడు. అక్కడి వాతావరణం ఎంతో ప్రశాంతంగా ఆహ్లాదకరంగా వుంది. దూరంగా గుడిగంటలు శుభసూచకంగా మ్రోగుతూ వినిపిస్తున్నాయి.

———



# పట్టుకొమ్మలు

వి.యస్. అందవిల్లి

**చూ**సారా?; కాలచక్రం ఎంత జోరుగా తిరుగుతోందో! నేను ఈ గ్రామం వచ్చి మొన్ననే అనుకుంటున్నట్లున్నా రెండు మాసాలు గడిచింది. ఇంతకు ముందు ఇక్కడో టీచర్ వుండేవాడు.

'ఈ గ్రామ ప్రజలు చదువుకోరు - మనం ఎంత ప్రయత్నించినా లాభం లేదు- మీరు పెద్ద రచయిత గదా! ఎన్నెన్నో సమస్యలకు మీ రచనల్లో చక్కని పరిష్కారాలు చూపిస్తున్నారు. అలాంటిది....ఈ సంఘంలో - మన దేశంలో నేడు అత్యంత ప్రధానమైన సమస్య నిరక్షరాస్యత....ఈ గ్రామంలో కనీసం ఓ పదిమందిని అయినా మీరు అక్షరాస్యులను చెయ్యండి- అప్పుడు - మిమ్మల్ని ఆదర్శ రచయిత అంటాం- లేకపోతే మీ రచనలు అన్నీ కేవలం పేరు-డబ్బు గురించే అనుకోవలసి వస్తుంది' అన్నాడు నాతో అతను.

నా ఆత్మాభిమానం దెబ్బతింది-నాలో ఆత్మసంఘర్షణ మొదలై ఆత్మపరిశీలన జరిగింది. ఈనాటి రచనలన్నీ కేవలం

**వంశీ బర్కిలి-80 కథానికల పోటీలో ద్వితీయస్థానం పొందిన కథ**

కాలక్షేపానికి చదవటానికి పరిమితాలనే-వాటికి అంతకంటే ప్రాముఖ్యం లేదా? అవి సామాజిక జీవనంలో ఇసుమంతైనా మార్పు తేలేవా? వీటి ప్రభావం సంఘం మీద ఏమీ ఉండదా? నేను కొందరి రచనలవల్ల ప్రభావితుడునై - మానసికంగా కాస్త ఎదిగి - ఓ రచయితను అయ్యాను కదా!

నిరక్షరాస్యత గురించి నేను ఎన్నో రచనలను చేసాను. పేరుకూడా పొందాను. ఈనాడు నా రచనలు వాస్తవ రూపం దాల్చనున్నాయి. రాతల్లో సూచించిన పరిష్కారాలు చేతల్లో సాధ్యమౌతాయి. సిద్ధాంతాలు - ప్రాయోగికంగా ఋజువు పరిచినపుడే శాస్త్రజ్ఞునకు పేరు-విలువ రెండూ ఉంటాయి- నువ్వు చేసి ఇతరులకు చెప్పు అన్నాడు గాంధీ- నా రచనల ద్వారా సంఘానికి చెప్పాను- అందులో కొందరైనా ఆచరించారో లేదో నాకు తెలియదు. ఇప్పుడు నేను ఆచరిస్తాను. ఇలాంటి సందేహాల - సమాధానాల జ్యోతులు ఎన్నో నా మనోవీధిలో వెలిగాయి. అందుకే ఆ టీచర్‌తో మ్యూచువల్ ట్రాన్స్‌ఫర్‌కు ఒప్పుకొని ఈ గ్రామం వచ్చేసాను. నేను ఈ గ్రామం రావటానికి శ్రీమతి సమ్మతించలేదు. 'సరైన సదుపాయాలు లేవు- పిల్లల చదువులు పాడవుతాయి- మీ తెలివి తేటలను అనవసరంగా బూడిదలోపోసిన పన్నీరు- అడవి కాచిన వెన్నెల చేస్తున్నారు- మీకు కాదండి....అసలు ప్రభుత్వానికి బుద్ధివుండాలి- ఓ బి.ఎస్సీ., బి.ఇడి. ని సింగిల్ టీచర్ స్కూల్లో సెకండరీ పోస్టులో వెయ్యడానికి' అని మందలించింది- బాధ పడింది- భయపెట్టింది- ఏడ్చింది- అయినా నా నిర్ణయంలో మార్పు రాకపోయేసరికి- ఉభయతారకమైన ఓ ఏర్పాటు కుదుర్చుకున్నాం. ఈ గ్రామానికి కాస్త దూరంలో అన్ని సదుపాయాలు ఉన్న గ్రామంలో ఉండడానికి- అక్కడనుంచి రోజూ - నేను యిక్కడికి రావటానికి.

నేను పనిచేస్తున్న గ్రామంలో సుమారు ఏభై ఇళ్లు ఉంటాయి. ఇక్కడ పార్టీలుగాని- తగాదాలుకాని- రాజకీయాలుగాని-సినిమా సరదాగాని-రేడియోగాని....ఏఁవీలేవు- తారురోడ్డు చూడాలంటే కనీసం ఓ ఆరు కిలోమీటర్లు నడవాలి-

ఇక్కడ ఉన్నవారందరూ వ్యవసాయం కాస్తో-కూస్తో వున్నవాళ్ళు- మరియు వ్యవసాయపు కూలీలు. ఎవ్వరికీ రెండుమూడు ఎకరాలు దాటిలేదు. నేను ఈ రెండు నెలలు ఊరకనే జీతం తీసుకున్నందుకు బాధపడ్డాను. ఎందుకంటే కేవలం జీతం కోసమే పనిచేసే ఉపాధ్యాయుణ్ణి కాను- ఆ పరిస్థితి నాకు లేదు- నాకుండే కాస్త వ్యవసాయంవల్ల-రచనల వల్ల వచ్చినది మా సంసార పోషణకు సరిపోతుంది- మాదా పెద్ద సంసారమేమీ

కాదు. ఓ పిల్లా-పిల్లాడూ-శ్రీమతీ, నేనూ. పుట్టింటి తరపున - అత్తింటి తరపున ఇద్దరికీ ఎవ్వరూ లేరూ- నాకు శ్రీమతి- శ్రీమతికి నేను- మాకు పిల్లలు.

నెంబర్ ఆల్ రోల్ చేస్తే నూరు మంది పైచిలుకు వున్నారు- కాని క్లాసు లకి చిన్నపిల్లలు చిరిగిపోయిన బట్టలతో చీముడు ముక్కు- తమ్ముళ్ళతోనూ- చెల్లెళ్ళతోనూ వస్తున్నారు- అసలు.... ఇక్కడో స్కూలు వుందని- అది మన గురించేనని, మనం చదువుకోవాలని, దానికో ఉపాధ్యాయుడు ఉన్నాడని ఎవ్వరికీ తెలిసినట్టు లేదేమో అనిపిస్తుం దొకసారి. నేను వచ్చిన కొత్తలో 'కొత్తమేష్టు' అని కొందరు సంబోదించి పలుకరించారు. ఆ తర్వాత నాదారి నాది- వాళ్ళదారి వాళ్ళది.

నేను స్కూలు కొచ్చే టైముకు అందరూ కూలిపనికో - వ్యవసాయం పనికో పోతున్నారు- సాయంత్రం ఆరు గంటలకుగాని ఇళ్ళకు చేరరు. ఇంతకు ముందు మేష్టరు అసలు వచ్చేవాడు కాదుట.'మీరేవిటి చంపుకుతింటున్నారు' అనే భావంలో ఒకళ్ళిద్దరు అన్నారు- నాకు భలే కోపం వచ్చింది- వాళ్ళ అమాయకత్వానికి జాలేసింది- కాని ఈ సమస్యను పరిష్కరించాలంటే కోపం జాలి కాదు కదా కావలసినవి- ఓర్పు - నేర్పు కావాలి-

'ఈ స్కూలుకు ఎవ్వరూ పిల్లలు రారని తెలిసీ- ప్రభుత్వంవారు స్కూల్ ఎందుకు వుంచారు' అని ఒకడు అడిగాడు. 'ఇలా కొన్ని సంవత్సరాలు వుంచితే.... స్కూలుందని....దాని ఉపయోగం గుర్తించైనా-లేక విసుగుపుట్టయినా లేక అభిమానించయినా చదువుతారు అన్న నమ్మకంతో ప్రభుత్వం ఇలాంటి కొన్ని పనులు చేస్తోంది' అని వారికి చెప్పినా అర్థంకాదుగా. అయితే వీళ్ళకు చదువు చెప్పటం ఎలా ? శ్రీమతికి నామీద కోపం రోజురోజుకు పెరిగిపోతోంది- నా పట్టు దల-ఆమెకోపం ఓ రకంగా చెప్పాలంటే విలోమ సంబంధంలో వున్నాయి- ఈ ఆరుమాసాలలో చాలా మంది పేర్లు తెలుసుకున్నాను- అందుకే కాస్త పెద్ద మనిషి అనిపించుకున్న నర్సయ్య అనే రైతుని కలిస్తే అతని సమాధాన మిది.

అతనికి నలుగురు పిల్లలట. పెద్దవాడు వ్యవసాయం చెయ్యడానికి వెళ్తాడు- రెండోవాడు కూలికి పోతాడు. మూడో వాడు మేకలు తోలుకొని పోతాడు- నాలుగోవాడు చిన్న గుంటడు. వాడే స్కూలుకు వస్తున్నాడు- ఇందులో ఏ ఒక్కడు చదువుకున్నా వాళ్ళ బ్రతుకులు తెల్లారవుట- వ్యవసాయానికి వెళ్ళక పోతే పండదు- కూలికి వెళ్ళకపోతే అది పండిందాకా తిండిగింజలు వుండవు- మేకలు కాయకపోతే వ్యవసాయానికి మదుపు లుండవు-చదువుగురించి మొదట మదుపుపెట్టి - ఓ పది సంవత్సరాలు

చదివితేగాని ఉద్యోగం రాదట-ఈలోపున వాడికయ్యే ఖర్చు వాళ్ళ కుటుంబమంతా బ్రతుకుతున్నంత కాలం సరిపో తుందట_ మీరే చెప్పండి - అని నన్నే తిరిగి ప్రశ్నించాడు- ఇంచుమించు చాలా మంది అదే_ మానసిక - సాంఘిక - సాంసారిక పరిస్థితుల్లో వున్నారు-

'చదువు ఉద్యోగం గురించి కాదు_ విజ్ఞానం గురించి_ దేశంలో అందరూ చదువరులయితే- దేశం ఎంతో అభి వృద్ధిని సాధించి_ అన్ని రంగాలలో ముందంజ వేస్తుంది' అని ఇంకా ఎన్నో విధాలుగా వాళ్ళకి అర్థమయ్యే భాషలో అర్థంచేసుకొనే తీరులో చెప్పాము-

'బాబూ! తమరు సెప్పినవన్నీ నిజమే! మరి మాకు ఈలుండదే' అన్నారు చాలామంది చివరకు- అంటే ఇన్నాళ్ళూ వీళ్ళు వీలులేక మానేసారు అన్నమాట-వాళ్ళ పరిస్థితులను కూలం కషంగా పరిశీలిస్తే వాళ్ళన్నదీ కొంత వరకు నిజమనిపించింది. దానికి తోడు వాళ్ళకి సరయిన ప్రోత్సాహం లేదు_ అది ముందు కావాలి. ఆ ఉత్సాహం వాళ్ళలో రావాలి. దానికి ఏమిటి చెయ్యాలి? పగలు మానేసి రాత్రివేళ చెప్పితే....ఇది పగలు పాఠశాల_ రాత్రి వేళ నాకు రావటానికి కుదరదు- ఇక్కడే వుండిపోదాం అంటే సరియైన ఇల్లు_ మిగతా సదుపాయాలు లేవు. ప్రభుత్వం యొక్క ఉత్తర్వులూ లేవు_ మరెలా....

గ్రామస్థుల సహాయసహకారాలతో చిన్న పూరిల్లు నిర్మించాను. మా కుటుంబం ప్రస్తుతం ఉంటున్న గ్రామంలో ఓ వ్యాపారికి నచ్చచెప్పి- నేను పనిచేస్తున్న గ్రామంలో కనీస సదుపాయాలతో దుకాణం పెట్టించాను- ఇది కేవలం నా స్వార్థం గురించే కాదు సుమండీ_ దాని ఉపయోగం ప్రజలకే వుంటుంది కదా! శ్రీమతి మాత్రం నాతో రావడానికి సుముఖత చూపలేదు_ 'మీ విజ్ఞానాన్ని ఇలా తగలెడుతున్నారు- హాయిగా పట్నం పోయి - కొందరి విద్యార్థులకు మంచి తర్ఫీదు నిచ్చి వాళ్ళను ఉన్నతులుగా తీర్చిదిద్దొచ్చుగా' అంది.

ఓ పట్నం విద్యార్థిని మన సహకా రంతో పోస్టుగ్రాడ్యుయేట్ చేయించే బదులు-ఓ పల్లెటూరివాడ్ని ఏదో తరగతి వరకు చదివిస్తే...దీనిలో ఉన్న సంతృప్తి _ సంతోషం అందులో వుండవు- అందుకే ఆమె మాటలను ఖాతరు చెయ్య లేదు_

బి.డి.ఓ.ని కలిసి పరిస్థితి వివరిం చాను-

'అలా వీలవ్వదయ్యా! అది పగటి పాఠశాల_ దానికే దిక్కూ-మొక్కూ లేదు- ఇంకా రాత్రి పాఠశాల కూడానా! ఈ పగలు పాఠశాల రాత్రివేళ నడవ డానికి ఉత్తర్వులు లేవు' అన్నాడు_

అందుకే పగలువేళ స్కూలు నడుపుతూ_రాత్రివేళ కూడా చెప్పడానికి



నిర్ణయించుకున్నాను. నా నిర్ణయాన్ని — ఉద్దేశాన్ని గ్రామంలో నలుగురికీ చెప్పాను.

'బాబూ! మాఁవు వచ్చేసరికి సీకటి పడిపోద్ది. కాసిన్ని ఏడినీళ్ళు పోసేసుకుని తిండి తినేసరికి, నిద్ర వచ్చేస్తాది–ఇంకేటి చదువుతాం' అన్నారు వాళ్ళు– నా నవనాడులు కృంగిపోయాయి– ఇంతా నేను పడిన వ్యయ ప్రయాసలు వృథా అయ్యాయి– జీవితం ఓ పద్ధతికి అలవాటు పడిపోతే దాన్ని మార్చాలంటే కాస్త పట్టుదల, సమయస్ఫూర్తి అవసరం— ఇప్పుడు నా మనోకాటాతో ఓ ప్రక్క పట్టుదల– మరో ప్రక్క నిరాశ వున్నాయి ఏది బరువుగా వుందో చూద్దాం. ఓ సమస్యను వివిధ కోణాల నుండి పరిశీలిస్తే ఏదో ఒక పరిష్కారం దొరక్క పోదు అనే విషయాన్ని నా జీవితంలో నేను గతంలోనే తెలుసుకున్నాను–

ఓ రెండు రోజులు దీర్ఘంగా ఆలోచించి ఓ నిర్ణయానికి వచ్చాను– నా అభిప్రాయాన్ని గ్రామస్థులకు చెప్పాను– నా అభిమానాన్ని-పట్టుదలను– ప్రోత్సాహాన్ని గుర్తించారు. వాళ్ళల్లో ఆత్మపరిశీలన మొదలయింది– కొందరు విముఖత వ్యక్తంచేసినా చాలామంది సమ్మతించారు.

నా ఓర్మికి-మంచితనానికి నన్ను అభినం దించారు- ఆ విధంగా తెల్లవారుఝామున చెప్పటం మొదలుపెట్టాను- కొందరు చిన్నవాళ్ళు అయినా రాత్రి పెందలకడే పడుకోవటంవల్ల వేగిరంగానే లేస్తు న్నారు- మొదట్లో కొన్నాళ్ళు నేనే వెళ్ళి లేపేవాణ్ని- రానురానూ వాళ్ళకే అలవాటైపోయింది- ఇలా ఓ ఆరు మాసాలు ఒడుదుడుకులుతో సాగింది- వాళ్ళల్లో కొంత ఉత్సాహం కనిపించింది.

'బాబూ, మా టొందో అని సేసేవారు ఇంతవరకూ ఎవ్వరూ రాలేదు- మీకు శ్రమ అయినా మా గురించి-మా బాగు గురించి పాటుపడుతున్నారు- మీ అంత ఓపిగ్గా-అభిమానంగా సెప్పేవాళ్ళుంటే ఈపాటికి అందరం చదువుకొనేవాళ్ళం' అని నామీద వుండే అభిమానాన్ని - మాటల్లో వ్యక్తీకరించారు-

పల్లెల్లో ఓ వ్యక్తిమీద అభిమానం- నమ్మకం- 'గురి' ఏర్పడితే అతనేం చెప్పినా చేస్తారు ప్రజలు- వాళ్ళ కోరిక మీదే తెల్లారుఝామునుంచి రాత్రివేళకు మార్చేశాను- పగటి స్కూలు ఇప్పుడు సంతృప్తికరంగా వుంది- సంవత్సర - సంవత్సరానికి ప్రజలలో గణనీయమైన మార్పువచ్చింది- మనిషి ఏది సాధించా లన్నా 'మనసే' ముఖ్యం- అదే అన్నిం టికీ కేంద్రస్థానం- దానికి పట్టుదల వుండాలి- నేను వచ్చి దశాబ్దం దాటింది. స్కూల్లో పిల్లల సంఖ్య బాగానే వుంది ఈనాడు....ప్రక్క ఊరు హైస్కూలు పదవతరగతి విద్యార్థుల్లో సగంమంది నా స్కూల్లో చదివినవాళ్ళే అంటే నాకెంతో సంతోషంగా-సంతృప్తిగావుంది- అయితే ఈ దశాబ్దంలో నేను కొన్ని ఇబ్బందులు పడినమాట వాస్తవమే- ఓ వ్యక్తి కాస్త ఇబ్బందిపడినా వందమంది బాగుపడ్డారు కదా! ఇంట్లో భోజనం అందరూ చేసినా వంట తయారుచేసింది తల్లి ఒక్కర్తే కదా! అయితే నా అనుభవం ద్వారా తెలుసుకున్నదేమిటంటే....

నిరక్షరాస్యత నిర్మూలన కావాలంటే ఉపాధ్యాయుల సహకారం కావాలి- తాము పనిచేస్తున్న గ్రామాల్లో ప్రజల జీవన పరిస్థితులును అవగాహనం చేసు కొని- కాస్త ఓర్పుతో - జీతం తీసుకుం టున్నాం కదా అనే భావంతో కాకుండా అభిమానంగా-నా టొందో అని పాటుపడి కాస్తంత శ్రమ అయినా ఓర్చుకొని మనసును విశాలం చేసుకొని- గ్రామస్థు లకు చదువుచెప్పితే వాళ్ళు తప్పక నేర్చు కుంటారు- కేవలం మన సుఖం - సంతోషం-పిల్లలు సదుపాయాలు కాకుం డా నేవాళ్ళ మంచిని దేశం శ్రేయస్సును కాక్షించి ఉపాధ్యాయులు తాపత్రయం పడితే ఇంకో దశాబ్దంలోనైనా కొంత వరకైనా నిర్మూలించవచ్చు. ప్రభుత్వం ఏదిచేసినా దానికి ప్రజల సహకారం అవుసరం. దేశంలో విద్యాధికులు సంఖ్య ఎక్కువయితే అభివృద్ధి ఎక్కువవు తుంది- ప్రజలని విద్యాధికులను చేయ డంలో ప్రముఖ పాత్ర వహించవలసిన వారు ఉపాధ్యాయులు. అందుకే దేశానికి వాళ్ళు 'పట్టుకొమ్మలు' అన్నారు.

———



## నాకు నచ్చిన నా కథ

1971దీపావళి సంచిక 'యువ'లో నేనొక కథ రాశాను. 'రెండు రూపాయలు' ఆ కథ. ఇంటికెవరో చుట్టాలు వచ్చి వెళ్ళిపోతూ పిల్లల చేతిలో రెండు రూపాయలు పెడతారు. దాన్తో వస్తుంది పేచీ. ఈ కథలోని 'హ్యూమర్' నిజ జీవితంలోంచి పొంగుతుంది. ఈ కథకి గొప్ప లక్షణాలేవీ లేకపోవడం, సింపుల్గా సూటిగా వుండడం ఒక మంచి లక్షణం. తరవాత నేను తెలుసుకున్నది, ఈ కథ ద్వారా తెలియచెప్పిన సత్యం ఓటుంది—అది పెళ్ళాంబిడ్డల దగ్గర ఎప్పుడూ అప్పు చెయ్యకూడదని, వద్దని—చేస్తే అది చెల్లుపడని బాకీలా, భూమి అప్పులాగా వెంటపడి వేధిస్తుందని. ఈ కథలోని బాకీతత్వం చాలా మందికి అనుభవంలోకి వచ్చి వుంటుంది. Literary pretentions లేకుండా రాసినందుకు కూడా యీ కథ అంటే నాకు కొంత యిష్టం, ముద్దూను.

—పురాణం సుబ్రహ్మణ్య శర్మ

# రెండ్రూపాయలు

మొన్న మధ్యాహ్నం మా ఇంటికెవరో చుట్టాలొచ్చి కాస్సేపుండి ఫలారాల్చేసి కాఫీల్తాగి వెళ్ళిపోతుంటే, మా చిన్న అమ్మాయి వెళ్ళి రిక్షా దగ్గర నిలబడి నోట్లో వేలుపెట్టుకుని చీకుతూ చూస్తూంటే— వాళ్ళు రెండ్రూపాయ కాగితాలు దాని చేతిలో పెట్టారు.

(నేను చూసీ చూడనట్లు వూరుకున్నాను)

"హుష్ వొద్దొద్దు—పుచ్చుకోకు" అంటూ మా ఆవిడ పైనుంచి యాక్షన్ చేస్తోంది మెట్లమీద నిలబడి (మేం వుండేది మేడ మీద). నేను "తీసుకోవే" అన్నాను. దానికి డబ్బు సంగతి యిప్పట్నుంచీ తెలిస్తే మంచిదని.

అది ఆ రెండ్రూపాయలూ పుచ్చుకుని రోడ్డుమీదకు వుడుంలా పరుగు

ప్రారంభించింది. దాని వెనకాతల పరిగెత్తమని నాకు కళ్లెగరేసి చెప్పింది తాను మేడ మెట్లమీదనుంచి అంగుళం యిటూ అటూ కదలకుండా మా ఇంటావిడ మరియు గృహలక్ష్మి. రిక్షాలో వెళ్తున్న చుట్టాలు చేతులూపుతుండగానే నేను పాప వెంట పరుగెత్తవలసి వచ్చింది. పాప చేతిలోని నోట్లకోసం నేను పరుగెత్తుతున్నానని వాళ్ళనుకుంటే మాత్రం నేనేంచేయనూ ?

పిల్ల నెత్తుకుని "అమ్మా అన్న కోటిచ్చెయ్" అన్నా. ఏవీ లక్ష్యం లేకుండా నిర్లిప్తంగా ఒకనోటు తీసి వాడికిచ్చేసింది. వాడు ఆ నోటు తన లిక్కి-జేబులో కుక్కి- దాని మెడమీద చేతులేసి ముద్దుపెట్టుకున్నాడు.

"ఏవీ కొనకు. మార్చావో డొక్క- చీరేస్తాను" అంది మా ఆవిడ. అని అశ్వత్థామ హతః కుంజరః అన్నట్లు "మీరంతా సినిమాకు వెళ్ళండి అనక" అంది. మావాడి కదేమీ యిష్టంగా లేదు. ఆ నోటు జేబులో పెట్టీ తీసీ చూసుకుంటూ యిటూ అటూ పరుగెత్తుతున్నాడు. మధ్యాహ్నం ఎండలని చెప్పి మూడు మాట్లు తీసుకొచ్చి వాడిని చీకటిగదిలో తోసింది. (చీకటి గది అతనుంటే తలుపు లేసుకుని మధ్యాహ్నం ఓ గంటో అరగంటో నడుం వాల్చుకునే చోటు) మూడుమాట్లూ వాడు అడ్డంగా దుంగలా పడుకున్న తననుంచి దూకిపారిపోవటం, క్రిందకు వెళ్ళి రూపాయి నోటు అందరికీ చూపిస్తూ ఆడటం, వాళ్ళెవరేనా కుర్ర వెధవన్నేసి నెత్తిమీద రెండు మొట్టి చేతిలో పిప్పర్మెంటు బిళ్ళో బెల్లం ముక్కో పెట్టి ఆ నోటు లాక్కుంటారేమోనని యీవిడకు అనుమానం కలిగి ప్రాణం వుండబట్టక కళ్లు నులుముకుంటూ వెళ్ళి వాడి వీప్మీద రెండేసి యీడ్చుకు రావటం, యీ తతంగం అంతా చూస్తూ చాపమీద పడుకున్నా. ఈ సీను చాలా సార్లు రిపీటవటం ఒక రూపాయికి వాడు అరడజను గిల్లులో మొట్టికాయలో దెబ్బలో తినడం చూస్తూ ఆలోచిస్తున్నా. ఓ పది పైసలో ఐదు పైసలో అయితే ఇన్ని దెబ్బలు పడుండవు కదా అనే సానుభూతి లాటిది కలిగింది.

మా చంటిదానికి రూపాయి కాగితం గురించి ఏపాటి పరిజ్ఞానంవుందో తెలుసుకోవాలనే అభిప్రాయం కలిగి "అమ్మలూ ఏంతే అది ?" అంటూ ముద్దుగా పలకరించా.

"ఐదు పైసలిత్తా నా కిచ్చేత్తావా ?" అన్నా.

"వూపాయి ఫో" అంది. అని కళ్ళు చిత్రంగా తిప్పి ఆ రూపాయి నోటును సాగి దీయడం మొదలెట్టింది.

"దాన్నేవనకండి. అది చింపి రెండు ముక్కలు చేస్తుంది." అని మా చంటిది

అప్పుడే నా మూలకంగా రూపాయి నోటును ధ్వసంచేసినట్లు గాబరాపడుతూ మా ఆవిడ లేచింది. కంగారులో జారిపోయిన కొప్పును మోచేత్తో త్రాచుపాముని లాగినట్లు లాగి బిగిస్తూ. లేచినప్పుడు నీళ్ళలోనుంచి ఏనుగ లేచినట్లున్నా ఇప్పుడీ పోజు మాత్రం యీవిడకు బ్రహ్మాండగా వుంది, అని లోపల్నే మెచ్చుకున్నా.

"ఈ రెండ్రూపాయలూ మార్చి చెరో అయిదు పైసలూ యియ్యి. ఓ ఇరవై రోజులు కాలక్షేపం అవుతుంది" అన్నా. కానీ నా సలహా యెవరిక్కావాలి బోడి సలహా !

ఈలోగా ఇద్దరు సపోటావాళ్ళను, ముగ్గురు ముంజెలవాళ్ళను మేడ మీదకు పిల్చుకొచ్చారు యీ యిద్దరు తుంటర్లూ కలిసి. లక్ష్మి చంచలం కదా ! అది ఎప్పుడు బయటకు పోదామా అని చూస్తూ వుంటుంది. ఈ రహస్యం తెలిసినదానికి మల్లే మా ఆవిడ వాళ్ళతో పనిగట్టుకు పోట్లాడి బేరం కుదరనివ్వకుండా చేసి వాళ్ళను తిప్పి పంపేసింది. ఈ కుట్రను గ్రహించినదానిలా మా చంటిది అరిచి గొడవచేయబోతే, దాని దగ్గర రూపాయి లాక్కుని బొడ్లో దోపేసి ఆ కుర్ర వెధవను యీడ్చుకొచ్చి పవిట చెంగును వాళ్ళిద్దరి మీదా కప్పి నేలమీద పడేసి వాళ్ళ మీద చేతులూ కాళ్ళు అడ్డంవేసి తిరిగి నిద్ర కుపక్రమించింది.

ఎలా నిద్రపోతారో ఆడాళ్ళ తలుచుకుంటే ఆశ్చర్యం వేస్తుంది. వాళ్ళ మెదళ్ళు ఎంత చిన్నవో వాళ్ళ శరీరాలు అంత.... సంబంధం లేనట్టు ఎదిగి పోతాయి కావల్ను. అందుకే, లాజిక్కు లేకుండా వుంటాయి వాళ్ల మాటలూ, చేష్టలూ, చూపులూ అన్నీ.

"రోజూ యింతసేపిలా తాజాగా నిద్రపోతుందీ యీవిడ ?" నాకు అనుమానంతో కూడిన అసూయ కలిగింది. నేనేమో చవటలా ఆఫీసులో కుర్చీకి అతుక్కుని అడ్డవైన కాగితాల్తో-రాస్తూ కుస్తీపడుతూ చెమటోడ్చి సంపాయిస్తూంటే యీ అమాంబాపతు సరుకంతా హాయిగా యిలా కులుకుతూ నేలమీదపడి దొర్లుతూ కాలక్షేపం చేయటం నా కాట్టే సమ్మతంగా లేదు.

నాకు పగలు నిద్రపోయే అలవాటు లేదు. మేకులా అలా కూర్చోవలసిందే! బల్లమీద పుస్తకాలు కాస్సేపు కెలికి "చెస్ పట్టావే-రెండెత్తులు వేద్దాం" అన్నా.

ఏ కళనుందో చటుక్కున లేచివెళ్ళి ఒక మామిడిపండు తెచ్చి "నిన్న మూడు డజన్లు కొన్నాను గుమ్మందగ్గర బేరవాడి. ఇదొక్కటే మిగిలింది తినండి" అని నా ఒళ్లో పడేసింది కళ్లు మూసుకుని నడుస్తూ. ఎత్తుకు పై ఎత్తు అంటే యిదే కావల్ను.

"డజను ఎట్లా కొన్నావన్నా" ను పళ్ళు బిగించి.

నిన్న మూడు డజన్లు కొంటే యివాళ్ల మధ్యాహ్నం దాక ఆ సంగతి వీళ్ళకు గుర్తురానందుకు నాకు లోపల అసంతృప్తిగా వుంది. పండు చూస్తే క్రింద అకు పచ్చగా వుంది. అక్కడ టెంక పుల్లగా వుంటుంది. పైగా అందరూ వదిలేసిన పండయి వుంటుంది. నా అనింపార్టెన్సుకి గింజుకుంటూ, ఆ పండు తినలేకా వదలలేకా దిక్కులు చూస్తూ కూర్చున్నా.

నా చేతిలో ఆ పండును చూడగానే మా యిద్దరు అజ్ఞానులూ లేచి నా చేరోవైపుకి వచ్చి నిలబడి దానికేసే చూస్తూ 'వీడు మనకు పెడతాడా పెట్టడా ? పెట్టకుండా ఎలా తింటాడో చూద్దాం' అన్నట్లు పోజు పెట్టారు. పిల్లలంత నిర్మొహమాట స్తుల్ని నే నెక్కడా చూడలేదు. పండు కొంచెం చీకి రుచి చూసి టెంకొకరికి తొక్క ఒకరికి యిచ్చేసి వెళ్ళి పంపువద్ద చేతులు కడుక్కుని దండానికి వంకీలకు వ్రేలాడేసిన బట్టల్ను చీరల్ను లంగాల్ను జాకెట్లనూ చూస్తూ కూర్చున్నా.

కుర్ర వెధవలు కొంచెంసేపు పండు తిని ఆ టెంకతోనూ తొక్కతోనూ యుద్ధాలు చేసి వెళ్ళి పంపు త్రిప్పి బాత్రూంలో పడ్డారు. పిల్లల్లో అల్లరిచేసే శక్తి దారుణంగా వుంటుంది. బాత్రూంలో పడేసిన ఎంగిలి కంచాలూ అంట్ల గిన్నెలూ తెచ్చి హాల్లో పరిచారు. అక్కడే కూర్చుని బట్టల సబ్బుతో వాళ్ళ అమ్మను ఇమిటేట్ చేస్తూ అంట్లు తోమడం ప్రారంభించారు. హాల్లో అంట్లు తోముకోరని వాళ్ళకు తెలీదు.

ఇంతలో మెట్లదగ్గ రెవరో కూర్చున్నారని వచ్చి శుభ్రంచేయమని పితూరీ వచ్చింది. అప్పుడీవడ అట్నుంచి యిటు దొర్లి పెద్ద పిల్లను వెళ్ళి చూసి రమ్మంది. అది చూసొచ్చి మనవాళ్ళు కాదు అని చెప్పింది.

'ఇదివరకోటి రెండుసార్లు యిలానే అంటే శుభ్రంచేసి వచ్చాం వెర్రిపీనుగుల్లా. వీళ్ళకి యిదో అలవాటు అయిపోయింది. వూరుకో—' అని అవిడ కేసు కొట్టేసింది.

పిల్లలను నేను 'హాయ్ ! హుష్ ! హమ్మయ్య !' అంటూ కేకలు వేస్తూంటే వాళ్ళు నన్నో జోకర్‌కిందకట్టి వాళ్ళ ఆటలు వాళ్ళాడుతున్నారు.

'అమ్మొస్తుందర్రా' అని దయ్యం మొస్తుంది కాసుకోండన్నట్లు భయపెట్టాను. అవిడను భయంకరంగా చిత్రించటం అవసరమే ననిపించింది. ఆనందంగా కూడా వుంది. అప్పుడు 'ఇదిగో యిటు చూడు. పిల్లలు అల్లరి చేస్తున్నారు.' అని నేనూ సుప్రీంకోర్టుకి ఫిర్యాదు చేశాను. (లెట్ హర్ సెటిల్ మేటర్స్

అతను ఈ రచయిత్రి రాసిన నవల్లో హీరో!!




బిఫోర్ దె బికం డెవిల్స్) అవిడ లేచింది (మహంకాళిలా). లేస్తూనే నెత్తి మొత్తుకుంది. పళ్ళు పటపట లాడించింది. ఎదురుగుండా బొమ్మల పుస్తకం తిరిగేస్తున్న పెద్దదాన్ని తిట్టింది. కొట్టబోతే అది పారిపోయింది. ఆ హాలు స్థితి చూసి 'మీరేం చేస్తున్నారు' అని నా వైపో బులుక్ పారేసి, ఆ యావత్తు భీభత్సానికి కారకులైన దుష్టశక్తుల్ని రెండింటినీ తరిమి పట్టుకుని విచక్షణారహితంగా బాదటం మొదలెట్టింది.

"ఏం కొంప? వెధవ కొంప. ఏం పిల్లలు వెధవ పిల్లలు. ఏం మొగుడు–' అని ఆగి మళ్ళీ మొదలెట్టింది. 'కుక్క జన్మ నక్క జన్మ నయం. ఏ జన్మమ్మా ఆడజన్మ? దీని మొహం తగలెయ్య. ఈ పెద్దముండుందన్న మాటే గాని పోతులా తిని కూర్చోటానికి తప్ప ఓ పని అసరానా, నా శార్దావా? ఏళ్ళొచ్చాయ్ ఏళ్ళు. ఎందుకూ? తిన్న కంచం ఎత్తుకోకుండా లేచిపోతూంది టింగురంగా మంటూ. మహారాణీ లాగ గడుస్తున్నాయ్ దీని రోజులు. ఒళ్ళు కందిపోతుందేమో నన్నంత భయం. కుర్చీలు దిక్కుండా కూర్చుంటారు మొగ వెధవలూ, ఆడపీనుగులూ కూడా–అని నాకేసి చూసి "మిమల్నేవరన్నారు–మీ రూరుకోండి. మీరు వూరుకుండబట్టే కొంప యిలా తగలడింది. గడేకారి వెధవలు–ఒక మాటంటే అభిమానం లేదు. పౌరుషం లేదు. ఒక్కర్తి ఎలా చస్తుంది,

అదీ ఓ అమ్మ కన్నబిడ్డేకదా అనే జ్ఞానం ముందొద్దూ యింటికయిన వాళ్ళకి. వుష్షూ! అదేం లేదు. ఇదేదో సత్తరవో హోటలో అన్నట్లుంటారు అంతా. ఈ ముండ పుట్టినప్పుడు ఎలకలా పుట్టింది. దీనికసలు వూపిరుంటుందో వూడుతుందో అని అంతా హడలి చచ్చాం. ఇప్పుడు నా ప్రాణాలు పీకి పిండడానికి యిది కూడా తయారు. చాకిరీ చేసి చచ్చిచచ్చి వుంటే ఒక్క క్షణం అలా నడుం వాల్చుకుందామంటే పడనీరు. కాస్సేపు కన్ను మూతపడి యిట్టే తెరిచానో యిల్లంతా నానా గందరగోళం. అక్కడి దిక్కడా యిక్కడి దక్కడా-సర్దటం తుడవటం కడగటం నా బ్రతుకంతా యిలా అలుగ్గుడ్డలా వెళ్ళమారి పోవల్సిందే? ఛస్తేనే నాకు విముక్తి! ఈ వెధవోమూలా, ఆ వెధవోములా అర్చుకుంటూ ఎంతకని వీళ్ళ వెనకాల పడను. ఈ వెర్రిపీనుగ అస్తమానూ యిలా అరుస్తుందేమో అనుకోరూ? నా నోరు బైట పారేస్తున్నారు. వాళ్ళు బయట పడిపోతున్నారు. నా నోట మంచి ముక్క రావడం మానేసి అన్నీ పరుషవాక్యాలే వస్తున్నాయి. ఇదేదో పెద్ద రాక్షసి పీనుగ అని నలుగురూ అనుకోవడానికి. నోరు మూసుకు పడుందాం ఓ మూల అంటే వుండనివ్వరమ్మా యీ పిల్లలూ, యీ సంసారమూనూ. లొడితెడు వెధవ, లాగులో తప్ప వెళ్ళడు. అంత వుగ్గబట్టుకుని లాగంతా పాడయేదాకా ఏడవడం ఎందుకూ? ముందే ఆ ఏడుపేదో ఏడవకూడదా? రోజుకి అరడజను లాగులు ఖరాబుచేసి మూలపారేస్తే అవన్నీ ఉతికితేనే కాని మర్నాడు తొడుక్కోడానికి లాగుండదు. ఈ వెధవ లాగులు ఉతికి విస్తరిముందు కూర్చుంటే అన్నం తినబుద్ధవడం లేదు. పిల్లలు ముద్దు కాని పీతుళ్ళు ముద్దా? ఇహ ఆయనున్నారు. ఆయన తిరుగుళ్లూ ఆయన ప్రపంచం. ఆయన గొడవ అదంతా వేరు. వేళకు విస్తరిముందొచ్చి కూర్చోటానికే నన్నేదో ఉద్ధరిస్తున్నట్లు బెట్టుచేస్తారు. బెట్టెవరిమీద? ఇహ నేనేగా అందరికీ లోకువ. ఇంట్లో యిది వుంది, యిది లేదు, వీళ్లొస్తున్నారు. వాళ్ల వెళ్తున్నారు. ఇది అవసరం. ఇది అనవసరం. ఇది ముఖ్యం, ఇది అముఖ్యం—ఈ గొడవేం పట్టదమ్మా! ఇహ నే నెన్నిటికని ఏడవను? నావల్ల ఏమిటవుతుంది? ఛస్తే ఛస్తారు. ఉంటే వుంటారు, పోతే పోతారు. ఏది జరగాలో అది జరుగుతుంది. నా కెందుకీ రొష్టూ—నా కెందుకీ హైరాణా? మీరంతా కట్టగట్టుకుని ఏ ఏట్లో దూకుతారో దూకండి. మరి నేను మాట్లాడను. నా పని అయిపోయింది" అని ఆవిడ లెక్చరిచ్చేసి, హాలంతా కడుక్కొని శుభ్రం చేసుకుని ఆ గిన్నెలన్నీ తోముకుని ప్రాణం చల్లబడటానికి బాత్రూంలోకెళ్ళి స్నానంచేస్తూ కూర్చుంది. ఆ క్షతగాత్రు

లిద్దర్నీ నేను దగ్గరకు తీసుకుని వెనక వరండాలోకి తీసుకెళ్లి సబ్బెట్టి రుద్ది స్నానాలు చేయించా. ఇంతలో జ్ఞాపకం వచ్చి "ఇదిగో రూపాయి తడుస్తుంది" అని కేకేశా. ఈవేళ తెల్లారి లేచాక నేను తెలివైన పని చేయటానికి దొరికిన అవకాశం యిది ఒక్కటే. రోజుకి కనీసం ఒక తెలివైన పని చేయాలి కదా !

"అయ్యో నా మతి మండా" అని బాత్రూంమీద వ్రేలాడుతున్న చీరంతా దులిపి ఆ నోటు తీసి యివతల పడేసింది.

మా చంటిది వెళ్లి మళ్ళీ ఆ కాగితాన్ని తెచ్చి దాన్ని తిరగేసీ బోర్లేసీ ఆడు తోంది. అప్పుడు "నా రూపాయో" అంటూ ఎవరో కొట్టినట్టు మా కుర్రాడు (యంగెస్టాఫ్ ది లాట్) ఏడుపుకి లంకించుకున్నాడు. అవును వాడి రూపాయి వాడి బుష్‌కోటు లిక్కీ జేబులో వుండిపోయింది. వాళ్ళమ్మ యిందాక వాడి తడిసిన బుష్‌కోటును హాల్లోంచి బాత్రూంలోకి వుండచుట్టి బంతిలా విసిరేసింది మేమంతా చూస్తూండగా.

"పద పద నీ రూపాయి తెచ్చుకో" అని వాడ్ని బాత్రూంకేసి నెట్టాను. ఆ తడిచొక్కా అవతల్నుం చివతలకు టోపిలా ఎగిరొచ్చి పడింది. నిజంగా మన ఆడవాళ్లకు సరైన ట్రయినింగు యివ్వకపోబట్టి కాని యిస్తే ఎన్నెన్ని సర్కస్ ఫీట్లయినా అవలీలగా చేయగర్లు. అందుకే జీవితం ఒక సర్కస్ లాటిదని అన్నారెవరో ! అయితే రింగ్‌మాస్టర్‌కీ జోకర్‌కీ తేడా తెలియని సర్కస్ జీవితం మంది అనుకుంటూ ఆ చొక్కా అందుకున్నాను. అందులో నోటు మడతపెట్టి వున్నందున కొంచెం తడిసింది. తడిసినందుకు వాడు ఏడుపు వదల కుండా సాగించాడు కాళ్ళతో నేలను బాదుతూ.

స్వయంకృతాపరాధం కనుక అ నోటు తీసుకుని యిద్దరం వెళ్ళి ఎండలో కూర్చున్నాము. ఇప్పుడే ఆరిపోతుందని నేను మావాడి కభయమిచ్చాను. కాని ఒక తడిసిన రూపాయి నోటు గురించి ఎండలో కూర్చోటం అట్టే తెలివైన పని కాదు. మమ్మల్ని చూసి ఎవరైనా నవ్వొచ్చు. ఇంతలో ఒక బ్రెయిన్‌వేవొచ్చింది. వీధిలో రెండిళ్లవతల రావణాసురుడు చెరిచిన రంభలా ఒక లాండ్రీ వుంది. అక్కడకు వెళ్తే రూపాయి నోటును కమ్మగా ఇస్త్రీచేసి యిస్తాడు. మళ్ళీ కొత్త నోటులా తయారవుతుంది. పిల్లాడు ఏడుపు మానాడు కదా అని జాగ్రత్తగా తలుపు దగ్గరసా వేసి, ఒకపిల్ల చంకనెత్తుకుని కుర్రాడిని నడిపించు కుంటూ పిల్లల తండ్రిలా లాండ్రీ దగ్గరకెళ్ళి నిలబడ్డాను.

మనం బట్టలిచ్చినపుడు వాడు రాక్షసుళ్ళా కనపడతాడు కాని లేకపోతే వాడు

చిరుమందహాసం ఒలికిస్తూ కడు యోగ్యుడులాగే దర్శనమిస్తాడు, వాడి పెళ్ళాం చాలా అన్‌సైజు మనిషి. చింతమొద్దులా వుంటుంది. అది వెళ్ళి డబ్బు లడిగితే వుతికిన వాటికీ వుతకని వాటికీ పారేసిన బట్టలకి కూడా డబ్బు లిచ్చేస్తారు యిల్లాళ్ళు కిక్కురుమనకుండా. పాతికమంది స్టూండెంటు కుర్రాళ్ళని రోడ్డు మీద నిలబెట్టి మధ్య తను నిల్చొని జలకడినట్లు కడిగేయకలదు. అది పోట్లగొడ్డు. దాని జోలికెవరూ పోరు. రప్పలా తలమిడి గుడ్లూ ఆ వీధికంతా అది భారత మాత! దాన్ని చూస్తే మా ఆవిడకి చాలా భయం. మా కుళ్ళు బట్టలు మా మాసిన బట్టల పెట్టెలో వుండగా. దాని దగ్గరున్న రేవు బట్టలు తీసుకోకుండా వచ్చి కూర్చుని అవాకులూ చవాకులూ వాగి అది డబ్బులట్టిగెళ్ళి పోతుంది. అది ఇల్లాళ్ళను నిలవనియ్యదు. కాళ్ళ కింద నిప్పులోసి డబ్బులు లేవన్నా మఠం వేసుకు కూర్చుని డిఫినెట్ ఫైనాన్సింగు గురించి నీతి సూత్రాలు వల్లిస్తుంది.

"ఏంటమ్మగోరూ! మా కేవన్నా నెల జీతాలా పాడా—ఎండలో పగలల్లా రేవుకాడ చస్తే ఎప్పటి డబ్బు లప్పు డిచ్చెయ్యటానికి లేవు పొమ్మంటారు. చీటీ కట్టాలా? బొగ్గుల కెంతయిపోతున్నాదని. లాండ్రీ అద్దె పాతిక రూపాయలు. నీలిమందు ఖర్చు, సోడా ఖర్చు, రిక్షా ఖర్చు లెంత పెరిగిపోయాయో మీకేటి తెలుసుద్ది? బియ్యం సేరు రూపాయన్నర. మీ మదేలు తాగుడు ఖర్చు రోజుకి రెండ్రూపాయలు. నా సినిమా ఖర్చు వారానికి మూడ్రూపాయలు. ఆ కోక యిప్పి పారేసి నా కిచ్చికూడదా? ఇంద యీ చీర తీసుకోమని మీ దివ్వక పోతే నా కేటుంది? నవార్లుతకాల, బొంతలుతకాల, దయ్యాల్లాటి దుప్పట్లు లుతకాల, మీ కుళ్ళుగుడ్డలన్నీ మేమే ఉతకాల, మరేటి డబ్బుల్లేవంటే ఎలాగమ్మ గారూ? చూడండి ఇంత మేడద్దికి తీసుగునున్న మా రాజులు—మాకిస్తే మీ కేటి పోతుంది? మా కెవరడిగినా లేదంటారు కాని మీకు పది రూపాయప్పు యిస్తే పుడుతుంది. వర్షాకాలం బట్టలారవు. ఓసారి పానేపించి మీ చీర ఆరబెట్టి యిస్త్రీ చేసి ఇచ్చాను కదా! మా వోడు పేతి రేడియో కొందావన్నాడు. ఆవకాయ ముక్క పారేయండమ్మగోరూ—జివ్వ సచ్చిపోనాది," అంటూ వూదరగొట్టే స్తుంది.

అది నన్ను చూసి పోల్చుగుందో లేదో తెలీదు కాని నేను లాండ్రీ గడప దగ్గర నిల్చోగానే "రండి రండయ్యగోరూ! కనకమ్మగారి అయ్యగా రొచ్చా రారే—" అని నిద్రపోతున్న మొగుడ్ని ఓ కుదుపు కుదిపింది. వాడు తెల్లగా ఉతికిన బట్టల మీద పాలసముద్రంమీద పవ్వళించిన శేషశాయిలా పడుకుని

గుర్రు పెడుతున్నాడు. వాడి నోట్లోంచి వస్తున్న గుర్రుకి లాకు తలుపులు దడ దడ లాడినట్లు వాడి పెదిమలు మీసాలు కదుల్తున్నాయి. ఇస్త్రీపెట్టె ఎర్రగా కణ కణలాడుతూ నోరు తెరుచుకున్న చిరుతపులిలా వుంది.

నేను కనకమ్మగారి అయ్యగార్ని కానని కనకమ్మగారి పెనిమిట్నని చెప్పు కున్నాక— "అయ్యబాబో తమ రేటిలా గొచ్చారని" బోల్డు మర్యాద చేసి అడి గింది. రూపాయి నోటు తడిసిపోయింది. ఇస్త్రీ చేసి పెట్టాలన్నా.

"రూపాయి నోటు తడిసిపోతే మీకేటి బాబూ?" అని నోటు తీసుకుని చిరుత పులి నోరుమూసి పైనో తువ్వాలా పరిచి రెండు పావులు పాని హాట్ హాట్గా పొగలు గక్కుతున్న రూపాయి నోటుని నా చేతిలో పెట్టి "అమ్మగారిని పురుటికి ఎప్పుడంపిస్తారు బాబూ" అని అడిగింది.

పురుడేవిటి ఫామిలీ ప్లానింగు ఆపరేషను చేయించుకున్నాను కదా అని కొంచెం గాబరాపడ్డాను.

"తొమ్మిదో నెలేవిటి?" అన్నాను.

"అదేటి బాబూ—మీరు జానకమ్మగారి పెనిమిట్నని చెప్పారిప్పుడు కాదంటు న్నారు."

"ఈ పిల్లల సాక్షిగా నేను జానకమ్మ భర్తనే—"

"అయితే మీరు లావుపాటి మెల్లకన్ను జానకమ్మగారి తాలూకా్కదా? చెయ్యిలా గీడుస్తాది. ఇదిగో యిలా కాలెగరేస్తూ ధనలక్ష్మిలా నడుస్తాది." అని అభినయం చేసి చూపెట్టింది. మా పిల్లలు నవ్వారు.

"నేను లావుపాటి జానకమ్మ మొగుడ్ని." అన్నాను ఖచ్చితంగా.

"అప్హా! సూదిముక్కు లేడికళ్ళు ఉంగరాల జుత్తు కుక్క తరువుకొస్తే అడవిలో తేళ్ళు పరిగెట్టినట్లు పరిగెడతా వుంటాది. ఆ పచ్చ డాబాలోని జాని కమ్మగోరా అమ్మా..." ప్రవాహాన్ని ఆపుచేసి, "అవునవును. ఆ జానికమ్మ సూదిముక్కు లేడి కళ్లూ "

"ఆ యమ్మకేం బంగారపు బొమ్మ" అని సర్టిఫికెటిచ్చింది. నేను యింకేం అడుగుతుందో చలివిడీ పాకంలా పట్టుకు వొదల్దని వస్తానని చెప్పి పిల్లల్ని బరా బరా లాక్కుంటూ రోడ్డుమీద కొచ్చాను.

రిబ్బన్లూ మొలతాళ్ళవాడో పక్కనుంచి, బూరలమ్మేవాడో పక్కనుంచి, టమటమాల బండివాడో పక్కనుంచి, మరమరాలూ బఠాణీలవాడో పక్కనుంచి నా ప్రాణానికి నాలుగు వైపులనుంచి నలుగురూ శత్రువుల్లా పోగయ్యారు.

ఎప్పుడు విడిపించుకున్నారో నా పట్టు విడిపించుకుని వాళ్ళ దగ్గరకు పారిపోయి కొనమని గెంతుతున్నారు పిల్లలిద్దరూ. నేను ఆలోచించుకోటానికి వ్యవధి లేకుండా పిల్లలు నడిరోడ్డులో మారాం మొదలెట్టారు. ఆ నలుగురు శత్రువులూ అలా నిలబడిపోయారు నన్నే గమనిస్తూ.

రిబ్బన్లవాడిదగ్గరో రెండుమూడు రిబ్బన్లు తీసుకున్నాను. రెండు టమటమాల బళ్లు కొన్నాను. మరమరాలూ బఠాణీలు కొని లుంగీలో రెండు మూటలుగా కట్టి ఎత్తి పట్టుకుని ఇంత చేశావా భగవంతుడా అని బఫూన్లా యింటివైపు నడక ప్రారంభించాను. మొత్తం బిల్లు రిబ్బన్లవాడికి రూపాయిన్నర, రెండు టమటమాల బళ్ళూ రూపాయిపావలా, మరమరాలు పావలా, బఠాణీలు అర్ధరూపాయి. నా దగ్గర రూపాయ్ వుంది. వాళ్ళందర్నీ వెనకేసుకుని ఇంటి దగ్గరిద్దావని గ్రేట్ మార్చి చేయించి తీసుకొచ్చాను.

సూదిముక్కు లేడికళ్ల జానకమ్మ వీధిలోనే నిలబడి మే వెక్కడికి పోయామా అని చూస్తూంది గావల్ను మా ప్రొసెషన్ని చూసి 'ఏం జరిగిం దేం జరిగింద' ని అదుర్దాగా అడిగింది.

"ఏ పీలేదు. హేవీలేదు. నువ్ లోపలికి నడు—" అని రిబ్బన్లవాడికి రూపాయిన్నర, టమటమాల బళ్ళకి రూపాయి పావలా, మరమరాలూ బఠాణీలకి ముప్పావలా యిచ్చేమని చెప్పాను.

"ఏవిటీ ? హేవిటేవిటేవిటీ ? ఈ రిబ్బన్లు రూపాయిన్నరా ? ఈ బళ్లెందు క్కొన్నారూ ? వీటికి రూపాయా ? ఇవి పావలా మరమరాలా ? ఇవి అర్ధ రూపాయి బఠాణీలా ? హవ్వ" అని నోరు నొక్కుకుని "యిచ్చెయ్యండి. ఇవి వాళ్ళకిచ్చెయ్యండి. మీ మొహం చూసి మిమ్మల్నెవరో బాగా టోపీవేశారు. ఇచ్చేసి వాళ్ళను వెళ్ళమనండి. శుద్ధ దండగ." అని రూలిం గిచ్చేసింది.

నాకు ముచ్చెమటలు పోశాయి. వీధిలో కెళ్ళానంటే వాళ్ళూరుకోరు. ఇంట్లో యీవిడూరుకోదు. పిల్లలు వాళ్ళమ్మకేసి కోపంగా నాకేసి జాలిగా చూస్తున్నారు. పైగా మేవు దారిపొడుగూతా బఠాణీలు నవుల్తో వచ్చాము. పిల్లలజేబుల్లో పోశారు వాళ్ళే.

ఆఖరికి నేనే తెగించి పెళ్ళాంముందు హీనపడిపోవడం యిష్టంలేక— వీధిలోకెళ్ళి,

"ఏవిటోయ్ మరీ కాసిని మరమరాలు బఠాణీలిచ్చి యివి ముప్పావులా అంటావు? ఆడవాళ్ళదగ్గరో బేరమూ, మగాళ్ళదగ్గరో బేరమూనా ? ఆ కొత్తలేవిటి ? ఆ




దొక్కులేవిటి? మరమరాలికీ, బఠాణీలకీ కలిపి అర్ధరూపాయి చేసుకో—మరి మాట్లాడకు" అని రిబ్బన్లవాడికేసి తిరిగి—

"ఈ వెలిసిపోయే రిబ్బన్లు యిచ్చావేమిటయ్యా సాయిబూ, పైగా రూపాయిన్న రేవిటి? రూపాయి చేసుకో—మా ఆవిడ ముప్పావలాయే యిమ్మంటోంది. అయినా రిబ్బన్లకూడా యింత ధరేవిటి? అలా యిస్తే యివ్వు, లేకపోతే తీసేసుకో" అంటూ నిర్మోహమాటంగా మా ఆవిడకు వినిపించేలా అనేసి టమ టమాల బండి అబ్బాయికేసి తిరిగి బిగ్గరగా కేకలెట్టాను.

"మా పిల్లలకి చెరో చేతిలో చెరో బండి పెట్టింది నువ్వేనా? నన్నడక్కుండా నా పర్మిషన్ లేకుండా పిల్లలచేతిలో బళ్ళు పెట్టి నువ్వు రూపాయిపావలా ఇచ్చే మంటే యిచ్చేడానికి నేనేవీ తెలివితక్కువవాణ్ణి కాదు. అసలీ వీధిలో నువ్వు కనిపించావంటే జాగర్త! పావలా పావలా చేసుకో. అట్చే నేనెరగ ననుకోకు. నా చిన్నప్పుడు అణా అణా. అప్పుడు మట్టిచిప్పకి కాదు, కొబ్బరి చిప్పకే పల్చటి చర్మం అంటించేవారు. దానిమీద దెబ్బపడితే రణగేరే అనుకో. నువ్విప్పుడు జిగురుపూసి కాగితం అంటించావు. నువ్వింకా యీ సందు తిరక్కుండానే కాగితం విరిగిపోతుంది. ఇచ్చెయ్ జానకీ, వాళ్ళకు డబ్బులిచ్చేసి పంపించు" అని లోపలి కెళ్ళిపోయాను నా బెటర్‌హాఫ్‌ని సెటిల్ చేయమని.

వాళ్ళు ముగ్గురూ డబ్బులిస్తానని నా వెనకాలే వచ్చినవాళ్ళు నా ఉపన్యాసం విని దంగైపోయారు. మా ఆవిడ ఒక్కొక్కరితో "ఆయన కేవీ తెలీదనీ, వెర్రిబాగులోడనీ, యిలా నష్టాలు తెస్తూంటే తను తెలివిగా సర్దుకొస్తూ వుంటుంద"నీ నన్నో పది అని తను వాళ్ళని పొగిడి ఒక టమటమాల బండీ వాపసుచేసి, రిబ్బన్లని మళ్ళీ మార్పించి మొత్తానికి నేను మూడ్రూపాయల పావలా యివ్వవలసిన చోట రెండ్రూపాయలకన్నా తక్కువే యిచ్చి హైరాణపడిపోతూ మహిషాసుర మర్దనిలా లోపలికొచ్చి "ఈ వీధిలో వాళ్ళదగ్గర బేరాలు మీకు తెలియవు. వాళ్ళు పావలా చెబితే మనం పదిపైసల కడగాలి. సగానికి సగం ఎక్కువ చెప్పి డబ్బు దోచేస్తారు." లెక్చరిస్తోండగా బూరాలవా డొచ్చాడు "డబ్బులిమ్మంటూ". వాడు దారిలో అగాట్ట మరో బేరమేదో వస్తే.

"బండీ కొంటే మళ్ళీ బూరాలెందుకు కొన్నారు?" అని నన్ను తీక్షణంగా అడిగింది. బండి కొన్నప్పుడు బూరాలు కొనకూడదు కావును. ఆ సంగతి నాకు తెలీనట్లు నేను నిలబడ్డాను.

"బూరాలేవర్రా వెధవల్లారా?" అంది వాళ్ళకేసి తిరిగి.

"పేలిపోయాయ్" అన్నారు వాళ్ళు బిక్కమొగాలేసుకుని. దీన్తో ఆవిడకు చిర్రెత్తుకొచ్చింది.

"మీరు బూరాలు వాళ్ళ చేతుల్లో చూశారా?" అని నన్ను క్రాసెగ్జామిన్ చేసింది.

"చూశాననుకుంటాను" అన్నాన్నేను కంగారుపడి.

"అయ్యో నా మతిమండా—మీ రెక్కడ దొరికారండీ నాకు. బూరాలు కొన్నారో లేదో గుర్తులేదు మీకు. వాడెవడో వీధిలోకొచ్చి డబ్బులడగ్గానే యిచ్చెయ్యమంటున్నారు. ఈ సంసారం యింకెందుకైనా పనికొస్తుందీ? ఇక యీ కొంప బాగుపడదు." అని వాడికేసి తిరిగి "పిల్లల చేతిలో బూరాల్లేవు. నువ్విచ్చావో యివ్వలేదో—మళ్ళీ యిచ్చేయ్. యిచ్చేసి డబ్బులట్టుకుపో—నన్నాట్టే విసిగించకు." బూరాలవాడు తమాయించుకుని—

"జేబులు సూడండమ్మగారూ—" అని "బాబూ ఎర్రబూరా నీకూ పచ్చబూరా చెల్లికీ యివ్వలేదూ" అని వాళ్ళనడిగాడు. వాళ్ళు బుర్ర వూపారు.

"అటికి పిడతల్లాగ తలకాయ లూపుతారు" అని విసుక్కుని మావాడి జేబు వెతికింది. జేబులో రెండు బూరాలూ వున్నాయి.

"ఇవి తీసుకుని మంచివిచ్చేయ్. డబ్బులివ్వకుండా బూరాలు పేలిపోతే నువ్వే మళ్ళీ మంచి బూరాలివ్వాలి. నువ్వు వూత్తోంటే పేలిపోతే మళ్ళీ మరోటిస్తావా

లేదా? పిల్లల చేతిలో ఒకవేళ నువ్వన్నట్లు పేలిపోతే మళ్లీ మంచి వివ్వాలిగాని అలా పేలిపోయిన వాటికి డబ్బులుచ్చుకుంటే పసిపిల్లల్ని అన్యాయం చేసినట్లవుతుంది. చిన్న పిల్లలు నారాయణ స్వరూపాలు."

"మీరూదుకోటాని కొక్కావాలంటే ఓటిస్తానుగాని పేలిపోయిన వాటికి డబ్బులిచ్చేయండమ్మగారూ! బూరాలు అమ్ముతాకాని అవి పేలిపోకుండా ఇన్స్యూరెన్సు కంపెనీ ఎట్టలేదండీ" అని నవ్వేడు.వాడు.

డబ్బులిచ్చేసి 'పోకిరీ చచ్చినాడా' అని గొణుక్కుంది జానకి మెటికలు విరుస్తూ. మనం బజారుకెళ్ళి యిలా మాట్లాడితే చెల్లుతుందా? చెల్లదు. పైగా క్రాక్ అని మన మొహంమీదే అనేస్తారు. కాని ది సోకాల్డ్ లేడీస్ ఎలా మాట్లాడినా చెల్లుతుంది. వాళ్ళ ఆర్గ్యుమెంట్సుకి లాజిక్కూ—కామన్ సెన్సూ వుండనవసరం లేదనుకుంటాను.

మేవంతా గదిలో చాపమీద కూర్చుని తీరిగ్గా బఠాణీలూ మరమరాలూ నవుల్తూ కాస్సేపు కబుర్లు చెప్పుకున్నాము. అంతలో మా చంటివాడొచ్చి "నా రూపాయి నా కిచ్చేయ్ నాన్నా?" అని నుంచున్నాడు కాబూలీవాడిలాగ. వాడి వెనకాలే చంటిది కూడా వచ్చి నుల్చుంది.

"మీ రూపాయి ఏవిట్రా వెధవల్లారా! ఇంకా ఎక్కడుంది? బఠాణీలు మరమరాలు బొక్కారుగదా. యివి తేరగా వచ్చాయా? టమటమాలబండి కొనలేదా, రిబ్బన్లు కొనలేదా? ఇవన్నీ వూరికే వచ్చాయా?" అన్నాను. నా మాట వినిపించుకోకుండా నేనేదో చేసినట్లు ఘెల్లుమని శోకాలారంభించాడు. పన్లోపని ఎందుకైనా మంచిదని రెండు తగల్నిచ్చాను. వాళ్ళమ్మ జట్ ప్లేన్లాగా విసురుగా వచ్చి పిల్లల్ని విడదీసి పట్టుకుని "ఎందుకలా కొట్టుకుంటారు? మీవి చేతులుకావా? పసిపిల్లల్ని యెండలో తిప్పడమే గాకుండా ఏదో అడిగితే సరైన సమాధానం చెప్పాలేగాని కొట్టుకుంటారా? పిల్లలూరికే రాలేదు. నవమాసాలు మోసి కంటే వచ్చారు. మీకేం తెలుస్తుంది?" అని నన్ను దులిపేసింది.

"అవును. తేరగా మెక్కి రూపాయ తెమ్మని ఏడుస్తున్నారు. ఆ మాత్రం జ్ఞానం వుండద్దూ?"

"ఇదేమిటి నువ్విలా నా మీద తిరగబడుతున్నావు? అయినకాడికి అన్నీ చేయించుకుని అంతా నన్నే నేవాళ్ళే—"

"అవునండీ మీరు తండ్రి కాబట్టి వాళ్ళు చనువుగా అది కావాలి ఇది కావాలి అని అడుగుతారు. మారాం చేస్తారు. మనం కొనిస్తాం. అది వాళ్ళకేం

అర్థమవుతుందీ. వాళ్ల కెవరో రెండ్రూపాయలిస్తే ఆ రెండ్రూపాయలెట్టి మీరివన్నీ కొనిపెట్టారు గనుక దానికింత చెల్లు అని చెబితే వాళ్ళకు బోధపడుతుందా?"

"అయితే ఆ రెండు రూపాయ లింకా వుందంటావు నువ్వు?"

"అవును మీరు వాళ్ళకి బాకీ. వాళ్ళేడిచింది రైటు అయినా చిన్నపిల్లలకెవరో ఏదో యిస్తే దానిగురించి పిల్లల్నేడిపించటం మీ కేమైనా బాగుందా? ఏవరేనా వింటే నవ్వుతారు?"

"మరి యిందాకెప్పుడో సినిమా కెళ్దామన్నావు. సినిమా కెళ్ళినా ఆ రెండు రూపాయలు అలాగే వుంటుందా?"

"వుంటుందీ వుంటుందీ వుంటుంది."

"ఎలా చెప్పు?"

"ఎలాగేవిటండీ? మనం సినిమా కెళితే మన ఖర్చులో వెడతాంగాని ఎవరో పిల్లల కిచ్చిన రెండు రూపాయలకి మరికొంత వేసి కాదు గదా! అలా కక్కుర్తి పడటానికి మనకేం గతి కడుక్కుపోలేదు. నా మొగుడికి అరువందల్జీతం."

"ఆల్ రైట్ ఒప్పుకున్నాను. అయితే ఆ రెండు రూపాయలనుంచి నాకు విముక్తి లేదా!"

"ఇలాటివి ఎవరేనా ఇచ్చినపుడు అవన్నీ ఓ చోట వేసుకుని పట్టాలు పట్టు పరికిణీలు ఏమైనా కొనుక్కునేదాన్ని" అని కాళ్ళకేసి చూసుకుంది. అక్కడ పట్టాలు పెట్టుకున్న మచ్చలున్నాయి.

ఆడవాళ్ళ లాజిక్కు ఆడవాళ్ళ ఎకనామిక్స్ వేరని తెలుసుకున్నాను. నాకు యీ రెండ్రూపాయల అప్పునుంచి మా ఆవిడ దయతలిస్తేనే కాని వి క్తిలేదు. పెళ్ళాం దగ్గర అప్పు అది ఒక తీయని బాధ. పైకి చెప్పుకోడానికి వీల్లేని రుణం ఆవిడకెలా తోస్తే అలా దాని వడ్డీ పెరుగుతూ వుంటుంది. ఈ సంసారమనే చెల్లుపడని నోటుమీద ఏ సుమూహుర్తానో చేసిన తెలివి తక్కువ సంతకం.

———



# అమ్మణ్ణి చీర

బి.సి.జీవి

"అంతా ఆ అమ్మణ్ణి అనుగ్రహం కదండీ! కాకపోతే అస్సలు ప్రమోషనే వద్దని మొండిపట్టు పట్టి కూర్చున్న మీరు బుద్ధిపుట్టి ఆ పరీక్ష పాసుకావడమేమిటి, పాసైన పది రోజుల్లోనే ఆఫీసరుగా ప్రమోషన్ రావడమేమిటి, నచ్చిన డిపార్టుమెంట్‌లోనే పోస్టింగు కావడమేమిటి! పోయిన సారి ఇక్కడికొచ్చినప్పుడు మొక్కుకున్నాను ఆ తల్లే మీ మనసు మార్చాలని అందరిలా మీరూ ఆఫీసరు కావాలని. సత్యంగల తల్లి నా కోరిక నెరవేర్చింది. ఇప్పుడైనా నమ్మండి మొక్కుబళ్ళు వూరికే పోవని." పెన్న ఇసుకలో నడుస్తూ చెపుతోంది దుర్గ.

చిరునవ్వుతో ఊఁ కొడుతూ పక్కనే నడుస్తున్నాడు అప్పారావు. పచ్చని పొలాలమీంచి వీచే స్వచ్ఛమైన గాలి. పాదాలని మెత్తగా తాకుతోన్న లేత ఇసిక. దక్షిణపు వేపు అల్లంత దూరంలో నరసింహస్వామి కొండ. కొండమీద కోవెల. కనుచీకటి పడుతోంది. కొండ మీద లైట్లు వెలిగాయి. అవతలి గట్టున కామాక్షి గుడి. దుర్గకేసి చూశాడు. ప్లాస్టిక్ బుట్ట చేతబట్టుకుని పక్కనే నడుస్తోంది బరువుగా. ఆమె ముఖంలో ఎంత తృప్తి. పెన్నగాలికి ఆవిడ తల్లో మల్లెలు మరింత గుబాళిస్తున్నాయి. ప్లాస్టిక్ బుట్టలో కొబ్బరికాయ, పూల దండ, కర్పూరం పొట్లాలు, అరటిపళ్ళు, భద్రంగా పాక్ చేసిన అట్టపెట్టెలో మూడొందలు చేసే కంచిపట్టు చీర – జొన్నవాడ కామాక్షికి.

"ఏమిటాలోచిస్తున్నారు? చేతులూపుకుంటూ నడవకపోతే ఈ బుట్ట కాస్త పట్టుకోకూడదూ" అంటూ భర్త చేతికి బుట్ట అందించి చెప్పుల్లోకి జొరబడిన ఇసుకని విదిల్చింది దుర్గ. ఏటిగాలికి ఎగిరెగిరిపడే పమిటని నడుం చుట్టూ బిగించింది. నిజమే. తను ఆఫీసరు నవుతానని ఎన్నడూ అనుకోలేదు అప్పారావు. అస్సలు ఈ పరీక్షలూ ప్రమోషన్లూ అంటేనే ఎలెర్జీ తనకి. ఈ భూమ్మీద పుట్టాము గనక బతకాలి.

బతకాలి గనక ఏదో వుద్యోగం వెలగ బెట్టాలి అనే తత్వం అప్పారావుది. అంతకు మించి వుద్యోగంతో ఇంకే సంబంధమూ పెంచుకోలేదు అతను. ఆఫీసులో అంటీ అంటనట్టు తామరాకు మీది నీటిబొట్టులా మసలుకునేవాడు. అందరూ డి. ఎ. ఇంక్రిమెంట్ల గురించి, సీనియారిటీ గురించి, ప్రమోషన్ల గురించి చర్చించుకుంటో వుంటే అప్పారావు మాత్రం లంచ్ అవర్లో తన సీట్లో కూర్చుని ఏ పత్రికో పుస్తకమో చదువుకునేవాడు. పదేళ్ళ సర్వీసులో అతనెప్పుడూ ప్రమోషన్ గురించి ఆలోచించింది లేదు. ప్రమోషన్ ప్రమోషన్ అని అంగలారుస్తారుగాని అందులోని ఇబ్బందుల్ని గురించి ఇంట్లో ఆడాళ్ళకేమి తెలుస్తుంది. ప్రమోషన్‌తోబాటు బాధ్యత పెరుగుతుంది. పని బరువు ఎక్కువౌతుంది. కిందివాడికీ, పైవాడికీ కూడా సమాధానం చెప్పుకోవాలి. రెండేళ్ళకీ, మూడేళ్ళకి పై వూళ్ళకి ట్రాన్స్‌ఫర్లు. అసలు ప్రమోషన్ అనేదే లేకపోతేనే హాయిగా వుంటుంది అని కూడా అనుకునేవాడు అప్పారావు.

అప్పారావు స్వతహాగా భావుకుడు. హైస్కూల్లో చదివే రోజుల్లోనే చిన్న చిన్న మినీ కథలు రాయటం ప్రారంభించాడు. కాలేజీకొచ్చేసరికి పెద్ద కథల స్థాయికి ఎదిగాడు. ఉద్యోగంలో చేరే నాటికి రెండు సీరియల్ నవలలు, రెండు ప్రముఖ వారపత్రికల్లో ధారావాహికంగా వస్తున్నాయి. రచనావ్యాసంగం మించి అతని దృష్టి సినిమావైపు మళ్ళింది. ఆఫీసుకి నెల్రోజులు సెలవుపడేసి పూనా వెళ్ళి 'ఫిలిం ఎప్రిసియేషన్ కోర్సు' చదివేడు. సినిమా మీడియం గురించి ఎంతో చదివి తెలుసుకున్నాడు. ఫిలిం సొసైటీల్లో సభ్యుడిగా చేరి మంచి మంచి ఫిలిం క్లాసిక్సు చూశాడు. సింపోజియంలలోనూ, సెమినార్లలోనూ పాల్గొని భేష్ అనిపించుకున్నాడు. తనీ వుద్యోగానికి తగడనీ, న్యాయంగా తను మృణాల్ సెన్ అంతటివాడు అయివుండాల్సిందనీ అనుకుంటూ వుండేవాడు అప్పారావు. అటువంటి తనకి ప్రమోషన్ వచ్చి ఆఫీసరయ్యాడూ అంటే అది దుర్గ చేసుకున్న పుణ్యమో, కంచి పట్టుచీర మహాత్యమో అయివుండాలి అనుకున్నాడు. కదిలే బస్సులో ఎక్కడానికే భయపడే తను, మూలపేటలో ఆ డొక్కు బస్సధిరోహించి, టాపుమీద కూర్చుని అడ్డొచ్చే చెట్టుకొమ్మల్ని అవలీలగా తప్పించుకుంటూ జొన్నవాడకి ప్రయాణం చెయ్యటం ఎంత ప్లెజెంట్ థ్రిల్లింగు! చుట్టూ పచ్చని పంటచేలు. దూరంగా కొండ. తిక్కన పుట్టిన తెలుగు నేల. బస్సుతోబాటు దారిపొడుగునా పరుగెట్టే నెల్లూరు చెరువుగట్టు. గట్టు మించి కట్టెమోపుల్ని నెత్తిమీదుంచుకుని నడిచే పల్లెపడుచుల వయ్యారపు నడకలు.

ఎంత మధురమైన అనుభవం! తెల్లని ఇసుకలో పాయలై పారుతోంది పెన్న. మణికట్టులోతు నీళ్ళలో చీరకుచ్చెళ్ళు పైకెత్తిపట్టుకుని నడుస్తోంది దుర్గ.

"ఇంకొంచెం అటువేపుకి వెళ్దాం పద" అన్నాడు అప్పారావు.

"ఎందుకు?" అంది దుర్గ.

"పెన్నలో మునగాలని వుంది నాకు. చూడు నీళ్లెంత నిర్మలంగా, చల్లగా వున్నాయో."

"నే రాను బాబూ. నీళ్ళంటే భయం నాకు. అంత సరదాగా వుంటే మీ రెళ్ళి మునిగేసి రండి."అంటూ ఇసుకలో కూల బడింది దుర్గ.

మొలలోతు నీళ్ళలో దిగాడు అప్పారావు. చిన్నతనానెప్పుడో నేర్చుకున్న ఈతను జ్ఞప్తిచేసుకుని కాసేపు జలకాలాడేడు.

"నువ్వూ రారాదూ. ఎంత హాయిగా వుందో ప్రాణానికి" అని పిలిచాడు భార్యని.

"రానంటూ వుంటే వినిపించుకోరేం. మీరూ రండి త్వరగా. మునిగింది చాలు. అవతల గుడికి ఆలశ్యమవుతోంది. ఇదుగో మరీ లోతుకు వెళ్ళకండి. సుడి గుండా లుంటాయి." అంటూ అరిచింది దుర్గ.

చిన్నప్పటి సంఘటన మనసులో కదిలింది. అప్పుడు దుర్గకి పదేళ్ళు. వేణుగోపాలస్వామి గుడిలో తెప్ప తిరణాళ్ళు జరుగుతోంది. తెప్ప కదుతుంటే చూడ్డానికి వెళ్ళింది. మెట్లమీద కాలు జారింది. కోనేటిలో పడిపోయింది బుడుంగుమని. తనతోబాటే వచ్చిన పక్కింటబ్బాయి - తనకన్న రెండేళ్ళు పెద్దవాడు - చెంగున వంగి నీటిమీద పరుచుకున్న తన జుట్టు పట్టుకుని చాక చక్యంగా గుంజి పైకిలాగాడు. అతనే తనపక్కన లేకపోతే తనేమైపోయేదో! నీళ్ళలోంచి బయటికొచ్చాడు అప్పారావు. తువ్వాలుతో భర్త వీపు తుడిచింది దుర్గ. పాయగా పారే నీళ్ళని దోసిళ్ళ కెత్తుకుని ముఖం కడుక్కుంది.

ఏరుదాటి గుడికి చేరుకునేసరికి చీకటి పడింది. నెల్లూరు ఆడపడుచుల చక్కదనంతో కళకళ లాడిపోతోంది గుడి ఆవరణ. మగవాళ్ళకంటే మగువలే ఎక్కువగా కనబడుతున్నారు గుళ్ళో. జారిపోతున్న పమిటెలు, పెన్న వీటితో తడిసిన రవికెలు, పొంగువారే యవ్వనపు సోయగాలు, జడల్లో గుబాళించే మల్లెల పరిమళాలు. ఒక్కక్షణం చలించింది అప్పారావు మనసు.

"ఒసే కామాక్షీ! కొట్టకే. నే వెళ్ళి పోతానే.... అమ్మనాయనోయ్! నన్ను చంపేస్తున్నాదిరోయ్ .." అని అరుస్తూ, ఏడుస్తూ, తిడుతూ, శపిస్తూ పిచ్చిగా నవ్వుతూ గుడిచుట్టూ పరుగుతీసే ఆడ దయ్యాలు- తలలు విరబోసుకుని తడి దుస్తుల్లో బహిర్గతమయ్యే వయసు

వొంపుల్ని, అవయవసౌష్టవాల్ని అనాలోచితంగా ప్రదర్శిస్తూ ప్రదక్షిణాలు చేసే ఆడవాళ్ళ- చేతిని చిన్నగా గిల్లింది దుర్గ.

"తప్పండీ వాళ్ళ నలా చూడకూడదు. పదండి క్యూలో నిలబడదాం."

బుద్ధిమంతునిలా భార్య ననుసరించాడు అప్పారావు.

గర్భగుడిలో అమ్మణ్ణి హారతిలిస్తూ చెమటలు కారుస్తున్నాడు పూజారి. జాలేసింది అప్పారావుకి. ఒకప్పుడు హారతి పళ్లెంలో డబ్బులు వేయటాన్ని అసహ్యించుకునేవాడు అతను. అంతకంటె రిక్షావాడికి మరో పది పైన లెక్కవిస్తే అసలైన పుణ్యం అని వాదించేవాడు. కాని ఇప్పుడు వూపిరాడని ఆ చీకటి కొట్లో కర్పూరపు పొగల సెగలు పీలుస్తూ ధారగా చెమటలుకక్కే పూజరినిచూస్తూ "పాపం ఎంత కష్టమో" అనుకున్నాడు.

క్యూ మెల్లగా కదిలింది. వరుసలో తనకు ముందున్న పల్లెపడుచు చాలా అందంగా కనిపించింది. నలుపైనా ముఖం కళగా వుంది. ఆమె చంకలోని పాప అప్పారావుని చూసి బోసినవ్వులు విరజిమ్ముతోంది. ముచ్చటేసింది అప్పారావుకి. ఆ పాప తల్లి దృష్టి నాకర్షించాలని చిలిపి కోరిక కలిగింది. పాప బుగ్గని గిల్లి "ఏం పేరు పాపా?" అన్నాడు చనువుగా. 'గయ్' మని ఏడుపు లంకించుకుంది ఆ పాప. క్యూలో ముందుకి కదలబోయిన పాప తల్లి చివుక్కున వెనక్కి తిరిగి అప్పారావుని గుర్రుగా చూసింది. విరిసీవిరియని అప్పారావు పెదాలమీది చిరునవ్వు క్షణంలో మాడిపోయింది. 'శాస్తి బాగా జరిగిందా?' అన్నట్లు భర్తకేసి చూసి నవ్వింది దుర్గ.

అర్ధగంట గడిచాక గర్భగుడి వాకిట్లో అమ్మణ్ణి కెదురుగా నిలబడ్డారు అప్పారావు దంపతులు. పూజాసామగ్రితోబాటు పట్టుచీర కూడా అందించింది దుర్గ పూజారి చేతికి.

"రసీదు?" అడిగాడు పూజారి.

దేవాలయం ఆఫీసులో చీర చదివింపుకు డబ్బుకట్టి పుచ్చుకున్న రసీదుని పర్సులోంచి తీసి పళ్ళెంలో పెట్టింది దుర్గ.

పేరూ గోత్రమూ అడిగాడు పూజారి.

భర్తవేపు సిగ్గుపడుతూ చూసి "చెప్పండి" అన్నది దుర్గ.

"నువ్వే చెప్పరాదూ" అన్నాడు అప్పారావు తనూ సిగ్గుపడిపోతూ.

"త్వరగా చెప్పండమ్మా" చిరాకు పడ్డాడు పూజారి. భర్తపేరూ, గోత్రమూ చెప్పింది దుర్గ.

హారతి పళ్ళెంతో అమ్మణ్ణి దగ్గరికి నడిచాడు పూజారి.

"ఆ చీరని ఏంచేస్తారు? పూజారి తీసేసుకుంటాడా తరువాత?" అడిగాడు భార్యని అప్పారావు.

భలేవారే ! " అపచారం కదండీ. అమ్మణ్ణి వూరుకుంటదా? నెలకోసారి దేవికి వచ్చిన చీరలన్నీ దేవస్థానం వాళ్ళు వేలంపాట పాడి అమ్మేస్తారు. అందుకేగా మనకు రసీదిచ్చింది చీర చదివించినట్టు."

లోపల గర్భగుడిలో అమ్మణ్ణికి పసుపురంగు పట్టుచీర చుట్టబెడుతున్నాడు పూజారి. ఏవరో గంట మ్రోగిస్తున్నారు. పూజారికి కళ్ళు చెమర్చినయ్. ఒక్క క్షణం దేవి విగ్రహం మసక మసగ్గా కనిపించింది. కళ్ళని కమ్ముకున్న నీటి తెరల్లోంచి పాతస్మృతులు అలలై చెల రేగాయి.

గర్భగుడి శోభనం గదిలా మారి పోయింది.

అలనాడు, పదేళ్ళకిందట, అదేరంగు పట్టుచీరతో దేవిరూపంలో తన జీవితం లోకి అడుగుపెట్టిన ఇల్లాలు మీనాక్షి కళ్ళలో మెదిలింది. ఆ తరువాత మళ్ళీ ఇన్నేళ్ల కాలంలో భార్యకి పట్టుచీరకాదు ఒక మంచి నూలు చీరైనా కొనివ్వలేక పోయాడు తను.... పెరిగే ధరలు– ఎదిగే సంతానం.... నడినెత్తిమీది దార్రిద్యంతో బాటు నానాటికీ క్షీణించే మీనాక్షి ఆరోగ్యం.



వారం దినాలుగా చిరుగుల చీరలో పరువు దాచుకుంటూ పెచ్చులూడిపోయిన గదిలోంచి బయటికి రావటంలేదు మీనాక్షి.

రెండు మాసిన చీరల్ని ఏటిగట్టుకు తీసుకుపోయింది, వుతికి ఆరేసుకోవ టానికి వారం రోజుల్నాడు. వరదలై పొంగిన పెన్న వున్న ఆ రెండు చీరల్నీ లాక్కుపోయింది. మిగిలిన ఒక్క–

చిరుగుల చీరలోనే ముణగదీసుకుని పడు కుంటోంది రోజా.

పూజ ముగిసింది. ప్రదక్షిణలు చేసి, కొబ్బరిముక్కలు కొట్టుకు తిని బయట పడేసరికి గంట తొమ్మిది దాటింది.

నెల్లూరు వెళ్ళే ఆఖరు బస్సు వెళ్ళి పోయింది.

"ఇప్పు డె లా ?" బిక్కమొహం వేశాడు అప్పారావు.

"ఈ రాత్రికి గుళ్ళోనే పడుకుందా మండీ." అంది దుర్గ, బస్సు మిస్సయి నందుకు ఏమాత్రం కంగారుపడకుండా.

అదిరిపడ్డాడు అప్పారావు.

ఇల్లు వదిలి ఇలా ఆ రు బ య ట ఎప్పుడూ జాగారంచేసిన అనుభవం లేదు అతనికి. ఇం టి క ం టె గుడి పదిలం అంటోంది భార్య.

"ఈ రోజు శుక్రవారం. అమ్మణ్ణికి పవిత్రమైన దినం. ఈ రాత్రికి ఇక్కడే పడుకుని తెల్లారగట్ల లేచి వెళ్ళిపోతారు జనం. లోపల కావాల్సినంత స్తలం వుంది. హాయిగా పెన్నగాలి పీలుస్తూ నిద్రపోవచ్చు. మన ల్నివేళ తన దగ్గర విలిపేసుకోవా లనుకుంది కామాక్షితల్లి. ఈ గుళ్ళో ఒకరోజు నిద్రచేయటం చాలా మంచిది. రండి." అంటూ భర్తని బరబరా లాక్కుపోయింది దుర్గ.

అక్కడ గర్భగుడికీ ప్రాకారానికీ మధ్య ఖాళీస్థలంలో గచ్చు నే ల మీ ద చాపలు, దుప్పట్లు, చీరకొంగులు పరిచి పడగ్గదుల్లో భర్తల సరసన పవ్వళించి నంత స్వేచ్ఛగా పడుకునివున్న ఆడపడు చుల్ని చూసి విస్మయంతోబాటు చూడ వేడుకగా అనిపించింది అప్పారావుకి.

దేవస్థానం వా చ్ మె న్ ని మంచి చేసుకుని ఎట్టాగో ఓ తుంగచాప సంపా యించి తెచ్చింది దుర్గ. బాగా గాలివచ్చే ప్రదేశం చూసి చాప పరిచింది. అరటి పళ్ళు, కొబ్బరిముక్కలతో కడుపు నింపు కుని పెన్న నీళ్ళు తాగి పడుకున్నారు ఇద్దరూ. అయిదు నిమిషాలు నడుం వాల్చిందో లేదో లేచి కూర్చుంది దుర్గ.

"అమ్మణ్ణికి పల్లకీసేవ జరుగుతోన్న ట్టుంది. కాసేపు వెళ్ళి చూసొద్దాం రండి." అంది దుర్గ.

"నాకు ఓపిక లేదు. కాళ్ళు పీకు తున్నాయి. కావాలంటే నువ్వెళ్ళిచూడు." అంటూ ఇటు ప క్క కి తిరిగాడు అప్పారావు.

"బుట్టభద్రం.అలాగే నిద్రపోయేరు. ఓ అర్ధగంటలో వచ్చేస్తాను" అని లేచి వెళ్ళింది.

దుర్గ తిరిగి వచ్చేసరికి అప్పారావు నిజంగానే నిద్రపోతున్నాడు.

గుళ్ళో సందడి తగ్గింది. వుండి వుండీ ఎవరో పదాలుపాడటం వినిపిస్తోంది. కొంచెం దూరంలో పడుకున్న మోతుబరి రైతు ఆ యేడు మిరపపంటను గురించి ఇంకెవరితోనో వివరించి చెబుతున్నాడు.

"నువ్వెన్నయినా చెప్పన్నా: అడ




పిల్లకి అంత మిడిసిపాటు పనికిరాదు. దాని షోకులేమో, దాని కులుకులేమో, అదసలు సంసారపక్షం పిల్ల కాదనుకో." ఇంకెవరో పెద్దమనిషితో కోడలుపిల్ల మీద అక్కసుని వెళ్ళబోసుకుంటోంది ఒకావిడ. కనకమహల్లో ఆడే కొత్త సినిమా కబుర్లు చెప్పుకుంటున్నారు ఇద్దరమ్మాయిలు.

పెన్నమీంచి వీచే చల్లని గాలి కెరటాలకి మాగన్నుగా కునుకుపడుతోంది దుర్గకి- ప్లాస్టిక్ బుట్టని తలకిందికి తీసుకుని కళ్ళుమూసుకుంది-

గర్భగుడిలో అమ్మణ్ణికి వస్త్రాపహరణం జరుగుతోంది- చీరల కంట్రాక్టరు దేవి చీరల్ని బరబరా లాగేస్తున్నాడు. ఏ భగవానుడూ అమ్మణ్ణిని ఆదుకోవటానికి ముందుకు రావటంలేదు. గుడి ముందు అరుగుమీద అమ్మణ్ణి చీరల్ని కుప్పపోసి వేలంపాట పాడుతున్నారు. అప్పారావు ఈ ఘోరాన్ని చూడలేకపోతున్నాడు. చీర లాలిచే దుశ్శాసనుని మీదికి లంఘించాడు. ఒక్క తోపు తోశాడు అప్పారావుని చీరల కంట్రాక్టరు. తూలి దేవి పాదాలమీద పడ్డాడు అప్పారావు. చిరునవ్వుతో దేవి అతడ్ని దగ్గరకి తీసుకుంటోంది.... ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు అప్పారావు. అప్పుడే ఇటువేపుకి తిరిగిన దుర్గ అతని భుజాల మీద చేతులేసి దగ్గరగా జరిగింది.

ఆ రోజుకి అన్ని సేవలూ పూర్తిచేసుకుని దేవిని పసుపురంగు పట్టుచీరలో బంధించి, గర్భగుడి తలుపులకి తాళాలు బిగించి పూజారి ఇంటికి బైలుదేరే వేళకి గంట పదకొండు కావచ్చింది. భర్తకాళ్ళకి నీళ్ళందివ్వటానికి నీరసంగా లేవబోయింది మీనాక్షి. అవసరంలేదని

చేత్తోనేసంజ్ఞచేసి, కాళ్ళు కడుక్కొని వచ్చి అయిదు నిమిషాల్లో భోజనం అయిందని పించేడు పూజారి. పిల్లలు నలుగురూ అరుబయట అరుగుమీదే పడుకుని నిద్ర పోతున్నారు.

చిరుగుల చీరలో ముడంకెవేసి పడుకున్న భార్యని ఒకసారి చూసి పక్కనే గోడకి జార్లబడి కూర్చున్నాడు పూజారి.

గర్భగుడి చీకట్లో పట్టుచీరలో నించునే నిద్రపోతున్న అమ్మణ్ణి! తన సరసన చిరుగుల మాసికల్లో మీనాక్షి!

అమ్మణ్ణికి పసుపురంగు పట్టు వస్త్రం సింగారిస్తున్నాడు–

"అబ్బ! వుండండి. చీర నలిగి పోదూ!"

"పోనీ ఇలాంటివి–పది కొని పెట్టనూ"

"ఈ రంగు మీకు నచ్చిందా?"

"నీ ఒంటి రంగులో కలిసిపోయింది."

"అంటే బాగులేదనా?"

"కాదు. నీ అంత అందంగా వుందని."

"ఛీ! పొండి"......

మీనాక్షిలో అమ్మణ్ణి కనిపిస్తోంది!

గర్భగుళ్ళో దేవిరూపంలో మీనాక్షి సాక్షాత్కరించింది.

సర్వం శక్తిమయం.

దేవీ మీనాక్షీ.

నీరసంగా మూలిగి ఇటుపక్కకి తిరిగింది మీనాక్షి. పైటచెంగు చిరుగుల్లోంచి పల్చబడిన వక్షస్థలం పేలవంగా కనిపించింది. మోకాళ్ళని కడుపులోకి లాక్కొని ముణగదీసుకుని పడుకుంది.

గంట పన్నెండు దాటింది.

పెచ్చులూడిపోయిన ఆ గదిలో కాసేపు అటూ ఇటూ తచ్చాడాడు. గోడకి తగిలించిన తాళాలు చేతికి తీసుకున్నాడు. గడికేసి నడిచాడు పూజారి. భక్తులంతా గుడిప్రాంగణంలో అలసి సొలసి నిద్ర పోతున్నారు. వాళ్ళని దాటి గర్భగుడికేసి నడిచాడు. తలుపులు తెరిచి ఒక్కక్షణం దేవిముందు నిలబడ్డాడు.

జాలిగా చూసింది దేవి.

గుండె రాయి చేసుకున్నాడు. గబగబా అమ్మణ్ణిచీర లాగేశాడు. నగ్నంగా దర్శన మివ్వలేదు దేవి. లోపల మరో నూలుచీర, దానిమీద మల్లెలసరాలు అమ్మణ్ణిని కావి లించుకుని వున్నాయి– తృప్తిగా నిట్టూర్చాడు పూజారి. మళ్ళీ తాళాలు బిగించి ఇల్లు చేరుకున్నాడు.

చిరుగు మాసికల చీరలో మానాన్ని కాపాడుకుంటూనే ఆదమరచి నిద్ర పోతున్న భార్యమీద పసుపురంగు పట్టు చీరని పదిలంగా కప్పాడు. పక్కనే మేనువాల్చి మృదువుగా భార్యచేతిని తన చేతిలోకి తీసుకున్నాడు.

అమ్మణ్ణిలాగే దర్శనమిస్తోంది అతనికి మీనాక్షి.

———

# గృహిణి

ధర్మవరపు బుజ్జిపాపరాజు



'ప్రఖ్యాత కేబరే నర్తకి నళినికి వరుడు కావలెను. 32 సం॥ వయస్సుగల నర్తకి వివాహమైన తక్షణం గృహిణిగా ప్రశాంత జీవనం గడుపుకొనుటకు నిర్ణయించుకొన్నది. ఆసక్తిగల 50 సం॥ లోపు వయస్సు వరులు పూర్తి వివరములతో క్రింది అడ్రసుకు తెలియబర్చ గోరుతున్నాం.

సూచన:- సెకండ్ మేరేజ్ వరులకు ప్రాముఖ్యత ఇవ్వబడును.'

ఆదివారం నాటి పేపర్లోని మేట్రిమోనియల్ కాలంలో అడ్వర్టయిజ్‌మెంట్ చూచిన అనేకమంది ఉత్సాహవంతులు ముందుకు వచ్చారు. నళిని చాలా అందమైంది! పైగా కేబరే డాన్సర్‌ను వివాహం చేసుకోవటం అదొక అడ్వెంచర్. ఎన్నో అప్లికేషన్స్ కుప్పతిప్పలుగా వచ్చిపడ్డాయి.

"అసలు తన జీవితంలో 'గృహిణిగా' మారగలదా" అనే భయంతో విలవిల్లాడే నళిని ఆనందం కేబరేలో, తారాస్థాయి జేరినట్టయింది!

ఎంతో ఉత్సాహంతో అన్నిటినీ పరిశీలించింది నళిని. పద్దెనిమిది నుండి అరవై వరకు ఏజ్‌గాప్‌తో ఎందరెందరో వరులు!

'ఈ వివాహం జరగకపోతే నేను బ్రతకను.'

'నేను హీరోగా, నీవు హిరోయిన్‌గా స్టేజీమీద నటిద్దాం!'

'నాకు బోలెడు ఆస్తి వుంది న్యూడ్ క్లబ్బుల్లో డాన్స్‌వేద్దాం!'

నవయువకుల అర్థింపులు.

'ఎంతో అనుభవమున్న నీలాంటి దాని కోసమే నేను కాచుకొని ఉంది. కమాన్!'

'నీతో మజాచేస్తూ కథలు వినాలని సరదా !'

'అందాలసుందరి 'అందానికి' హారతు లివ్వడానికి సిద్ధం.' పడుచు భావాలుగల వయసుమీరినవారి దేవికిరింపులు.

ఎన్నెన్నో కామెంట్స్

అన్నీ నళినికి నవ్వు పుట్టించాయి.

ఎందరో మగవాళ్లు, చాలామంది భావాలు ఒకటే!

రెండుమూడు వడపోతల తర్వాత ముఖ్యమనుకున్న ఐదు అప్లికేషన్స్ తీసింది.

అందులో ఒక ఆఫీసర్‌కు పదిహేను సంవత్సరాల కూతురుంది. 'ప్చ్' లాభం లేదు.

మిగిలిన నలుగురిని ఇంటర్వ్యూకి పిలిపించింది నళిని.

వారిలో ఇద్దరు కుటుంబనియంత్రణ ఆపరేషన్ చేయించుకున్న వాళ్లు. మనస్సు ఉసూరుమంది

చివరకు మిగిలింది ఇద్దరు!

ఒకరు టీచర్.

మరొకరు డాక్టర్.

ఇద్దరికీ పిల్లలు లేరు. ఇద్దరూ రెండో పెళ్లివాళ్లే!

సరే!

ఇద్దరినీ వాళ్ల లైఫ్‌నుగూర్చి ముఖ్యమైన స్కెచ్ పంపమని చెప్పి ఇంటర్వ్యూ క్లోజ్‌చేసింది నళిని—

* * *

ప్రియమైన నళినికి—

ఉత్తరంలోని సంభోదనకు నవ్వుకుంది నళిని. మరల కళ్లు అక్షరాల వెంట సాగుతున్నాయి.

మీరు అడిగిన విధంగా నా బయోడేటా పంపుతున్నాను. పూర్తిగా అకలింపు చేసుకుంటా రనుకుంటున్నాను.

నా మొదటి భార్య కళ్యాణి చాలా అందగత్తె. ఆ అందంవల్లనే మా వివాహమైందేమో!

మొదట నా వైవాహిక జీవితం స్వర్గతుల్యం. అందమైన కాపురం కొన్ని రోజులు ముచ్చటగా సాగింది. ఒకరి కొకరమై జీవించాం.

ఇంతలో ఉద్యోగ ధర్మంవల్ల ట్రాన్స్‌ఫర్ వచ్చింది.

అద్దె ఇంట్లో దిగాం!

మా పక్క వాటాలో వాళ్లు చాలా కలుపుగోలుగా ఉండేవాళ్లు. వాళ్లదీ కొత్త కాపురమే!

ఆయనొక పెద్ద ఆఫీసరు.

ఇంటినిండా బోలెడు సామాను. అట్టహాసంగా ఉండేది. కల్యాణి రోజులో చాలాభాగం వాళ్లింట్లోనే ఉండేది. వాళ్ల రికార్డ్‌ప్లేయర్ గొప్ప కాలక్షేపం ఆడవాళ్లకు. కళ్యాణికి పెద్ద ఎట్రాక్షన్ అయింది.

ఆయనకు కేబరే పిచ్చి!

అన్నీ కేబరేడాన్స్ రికార్డులే ఉండేవి.



మిగిలిన రికార్డులున్నా డాన్స్ రికార్డులే ఎప్పుడూ పెట్టేవాళ్లు.

ఇంకేం-

పక్కింటామె రికార్డు పెట్టుకొని డాన్స్ చేస్తుండేది. అది ఆయనకు ఇష్టం.

క్రమేపి కల్యాణిగూడ స్టెప్స్ వెయ్యటం ప్రారంభించింది. కల్యాణి బాగా చురుకు.

మూడు నెలల్లోనే కేబరే బాగా నేర్చుకుందిట। నేనూ 'పోనీలే' అనుకుని ఉదాసీనంగా ఉన్నాను.

ఒకరోజు-

'ఏమండీ ఈ ఊళ్లో ఈ రోజు గొప్ప కేబరేడాన్స్ ఉంది వెళ్దామా।' అంది.

హఠాత్తుగా కల్యాణి అలా అడిగిందని తెలిసి మతిపోయింది।

"నీ కేమన్నా మతిపోయిందా? నేను చేసేది టీచర్ ఉద్యోగం. ఖర్మగాలి

ఏ స్టూడెంట్ అన్నా నన్ను కేబరే హాల్లో చూస్తేనే కొంపలంటుకుంటాయి. అలా టిది ఇద్దరం అక్కడే ప్రత్యక్షమయితే ఇంకేమన్నా ఉందా? రేపు స్కూల్లో బోర్డులమీద మనిద్దరి కార్టూన్ బొమ్మలే ఉంటాయి,' అన్నాను వ్యగ్యంగా।

అయినా కల్యాణి వినిపించుకోలేదు.

"మీ రెప్పుడూ ఇంతే। ఎంచక్కా పక్క వాళ్లను చూడండి. ఇద్దరూ సరదాగా డాన్స్‌కు వెళ్లారు." అంది.

"అది వాళ్ల ఖేస్ట్।" అన్నాను కోపం నిగ్రహించుకుంటూ.

"వాళ్ల అదృష్టం। దేనికైనా పెట్టి పుట్టాలి." కళ్లల్లో నీళ్లు. అసలు సంసార స్త్రీ కేబరే నేర్చుకోవటమేమిటి? పైగా డాన్స్ ప్రోగ్రాముకు కూడ సిద్ధమయితే।

ఆ ఇంట్లోచేరిన కొత్తల్లో....

"హవ్వ। వింటున్నారా ఆ డ్యూయెట్లు। ఎంత నవదంపతులయితే మటుకు ఆ డ్యూయట్లేమిటండీ। మరీ విడ్డూరం।" అని ఎగతాళిచేసిన కల్యాణేనా ఇప్పుడు ఇలా మాట్లాడుతున్నది.

ఎంతలో ఎంత మార్పు।

కొంత కటువుగానైనా దీనికి ఫుల్ స్టాప్ పెట్టదలుచుకున్నాను. చివరకు ఇల్లు మారాం. అదీ నా బలవంతమే।

దీంతో కొంతగొడవ సర్దుమణిగింది.

ఆడవాళ్ల రాకపోకలు సాగుతూనే ఉన్నాయి.

కొద్దిరోజుల్లో కళ్యాణి వాళ్లక్కయ్య పురిటికి వెళ్లింది.

ఆరోజు శలవు. ఇంట్లో ఒక్కణ్ణే ఉన్నాను.

శోభ మా ఇంటికి రావటం ఆశ్చర్యం గల్గించి.

"కల్యాణి ఊరువెళ్లిన సంగతి తెలీదనుకుంటా।" అన్నాను.

"ఎందుకు తెలీదు? మీరున్నారుగా కాలక్షేపానికి" అంటూ కూర్చుంది

ఏం మాట్లాడాలో తోచడంలేదు.

కళ్యాణి ఉంటే ఆ పరిస్థితి వేరు.

"అక్కయ్య హఠాత్తుగా ఊరెళ్లితే నాకేం తోచటంలేదు. ఆయనేమో ఏదో కేంపుకెళ్లారు. ఆ ఇంట్లో ఒక్కతినే రాత్రి ఉండాలంటే బోరుగా ఉంది. అందుకే ఇలా వచ్చాను.అయినా కల్యాణి అక్కయ్య ఇల్లు నాకు పరాయిదా?" వివరించింది శోభ.

కొంపదీసి రాత్రికి ఇక్కడే మకాం వెయ్యదు గదా?

"వంటింట్లోకి పదండి ఒక గుక్కెడు కాఫీ తాగుదాం।"

చొరవగా వంటింట్లోకి దారితీసింది.

తప్పనిసరిగా నేనూ అనుసరించాను.

"అలా కూర్చోండి. నేను వంట చేస్తుంటే కబుర్లు చెప్పుదురుగాని।"

వంట ప్రారంభించింది నన్ను అక్కడే కూర్చోబెట్టి. వంట అయినంత సేపూ ఏదేదో మాట్లాడుతూనే ఉంది.

అన్నిటికీ 'ఊ' కొడుతున్నాను అన్య మనస్కంగా!

'అమ్మయ్య!' వంట అయిపోయింది అన్నట్లుగా పమిటతో గొంతుకింద పట్టిన చెమట బిందువులు తుడుచుకుంది శోభ. తలెత్తి చూశాను. అందమైన ముఖం స్టౌ వేడివల్ల కందినట్లు అయింది.

"తొందరగా స్నానం చెయ్యకపోతే బతికేట్టు లేను" బాత్ రూంకు దారితీసింది.

బాత్ రూంలో నీళ్ళ చప్పుడు.

కొద్దిగా గాలి పీల్చుకొని హాలులోకి వచ్చి పేపరు తిరిగేస్తున్నాను ఆలోచిస్తూ.

"ఏమండీ! ఆ టవల్ కొద్దిగా ఇస్తారా!" బాత్ రూంలోనుండి సన్నకేక.

'అవకాశం చిక్కింది' మనస్సు తప్పదు.

ఓరగా తెరిచిన బాత్ రూం తలుపు సందులోనుండి టవల్ అందించాను. అప్పుడే తలంటి పోసుకున్నదేమో షాంపు వాసన గుబాళించింది! శోభ అందం తళుక్కుమంది! శోభ చిరునవ్వు ముఖం కొంటెగా వెంటాడింది! తలుపు మూసుకుంది ఓరగా.

శోభ అంతర్యం అర్థమయ్యింది.

ఇందుకా కళ్యాణి లేని సమయంలో శోభ వచ్చింది! ఇలాటిది నా జీవితంలో ఎదురవడం ఇదే మొదలు. ఎలా తప్పు కోవాలి?

అందిన అవకాశానికి మనస్సు ఉత్సాహంతో గంతులేసింది—కర్తవ్యం వెన్ను తట్టింది. సంస్కారం నిలదీసింది.

చిరునవ్వులు చిందిస్తూ శోభ బాత్ రూంనుండి బయటకు వచ్చి ఓరగా నన్నే చూస్తూ వంటింట్లోకి చీర మార్చుకో టానికి వెళ్ళింది. అక్కడ కళ్యాణి చీరను సిద్ధంగా ఉంచుకునే స్నానంకోసం వెళ్ళింది.

ఇక ఆ ఇంట్లో ఒక్క క్షణమున్నా నన్ను నేను నిగ్రహించుకోలేను. తక్షణం ఇంట్లోనుండి బయటకు వెళ్ళటం అత్యవసరం.

డ్రెస్ మార్చుకొని బయటికి బయలు దేరాను.

"భోజనం చేసే సమయంలో బయటికి బయల్దేరారేం!" శోభ వంటింట్లోనుండి చక్కగా ముస్తాబై వచ్చింది కొంటెగా అంటూ!

"అహా! ఏంలేదు. ఈ రాత్రి మీరు ఇక్కడే ఉంటానన్నారుగా అందుకని."

"బాగుంది నాకోసం మీరు మీ ఇంట్లో నుండి బయటకు వెళ్తారా? నే నొచ్చిందే మీకోసం!" చివరి మాటలు కళ్ళెగరేస్తూ అన్నది.

బయటపడింది శోభ.

"శోభా! ఇద్దరమూ పెద్దవాళ్ళం. పైగా వివాహితులం. ఇద్దరికీ ఆ ఆనందం తెలుసు. మన సంసారాల్లో కావాలని కలతలు కొనితెచ్చుకోవటం సబబు గాదు."

"ఎవరి ఆనందం వారిది. కళ్యాణికి మావారిమీద ఎంత ప్రేమో నాకు మీమీద

అంతకన్న ఎక్కువ ప్రేమే ఉంది. ఇన్నాళ్లూ ఎదురుచూచి ఇలా వచ్చాను."

"అనవసరంగా అభాండాలు వేయకు" కటువుగా అన్నాను.

"బాగుంది. ఇన్నాళ్లూ మీకు తెలిసే సాగుతున్న దనుకున్నాను. మీ రెంత అమాయకులో ఇప్పు డర్థమయింది. కళ్యాణి గూడ ఈ విషయం మీకు తెలుసుననే చెప్పింది. పైగా మీరు మొహమాటస్తులట!" మూతి మూడు వంకర్లు తిప్పింది.

"శోభా ముందిక్కడ్నుండి నడువు. కళ్యాణి అలాంటిది కాదు. నీలాంటివాళ్ల లక్షమంది చెప్పినా నేను నమ్మను." కోపంతో అరిచాను.

"మీలాంటి ఏకపత్నీవ్రతులను చెడ గొట్టాలని నాకేంలేదులెండి. కళ్యాణి సంగతి తెలిసిందే గనుక ధైర్యంగా వచ్చాను. లోకం గొడ్డుపోలేదు. మీరు ఏదో మహా నీతిమంతులైనట్లు ఫోజు పెడితే నాకేం నష్టం లేదు," విసవిసా నడిచివెళ్లింది.

ఒక చేదు నిజం జీవితంలో ఎంత మార్పు తెస్తుంది.

శోభ చెప్పింది అక్షరాలా నిజమని తెలియడానికి చాలా కాలం పట్టింది.

రంకుతనం లోకమంతా తెలిస్తేగాని మొగుడుదాకా రాదుట! ఆ ఊరినుండి ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నాను.

కాని

ఏ కళ్యాణికోసమైతే నేను ఊరు మార్చానో ఆ కళ్యాణే నన్ను ఏమార్చి మద్రాసు వెళ్లిపోయింది.

మొదట సినిమాల్లో ఎగస్ట్రా వేషాలు వేసిందిట!

తర్వాత పొట్టగడవక కేబరేనే వృత్తిగా స్వీకరించిందిట! ప్రస్తుతం మీ ఊళ్లోనే వుంది కళ్యాణి!

• • •

ఉలిక్కిపడింది నళిని.

కళ్యాణి భర్త ఇతగాడన్నమాట!

కళ్యాణి నిజంగా దురదృష్ట వంతురాలు.

భార్య కాలుజారిందని తెలిసీ గుట్టుగా సంసారం చేసుకోవటానికి ఇష్టపడ్డ భర్త కన్న మించిన దైవం ఎక్కడన్నా ఉంటాడా ?

పాపం! అమాయకుడు. ఎంత వేదన అనుభవించాడో! తను మారేజ్ చేసుకో బోతున్న విషయం కళ్యాణికి తెలిస్తే!

అమ్మో! ఇంకేమన్నా ఉందా!

అందంలో, నృత్యంలో ఇప్పటికే తనది పైచేయిగా ఉంది. ఎంతటివాడి నయినా ఇట్టే ఆకర్షిస్తోంది కళ్యాణి!

ఎన్నోసార్లు ఇద్దరూ 'ఒకే బెడ్' పావనంచేసిన దృశ్యాలు కళ్లల్లో మెదిలాయి.

ఎలాగైనా తన వివాహ విషయం కళ్యాణికి తెలీగూడదు. వృత్తిపరమైన అసూయ అలా అనిపించింది.

వెంటనే టీచర్‌కు ఉత్తరం వ్రాసింది. సాధ్యమైనంత త్వరలో వివాహం

చేసుకోటానికి బయల్దేరి వచ్చి ఫైనల్‌గా మాట్లాడమని!

* * *

'హలో!'

'హల్లో నళిని హియర్!'

'నేను కళ్యాణిని.' గతుక్కుమంది నళిని.

'హలో డియర్! ఏమిటి విశేషాలు' సాధ్యమైనంత గంభీరంగా అంది నళిని.

'ఈ మధ్య నీవు మారేజ్ చేసుకోటానికి ఇంటర్వ్యూ పెట్టావుట గదా!'

'అరె! అది అప్పుడే నీదాకా వచ్చిందా!' కంగారు నళినికి.

'ఆ! ఎవరో ఫాన్స్ చెప్పక పోతారా?'

'నిజమేలే!'

'ఏమిటి అంతలోనే డల్‌గా అయ్యావు? బై దిబై నేను 'కేబరే'కి గుడ్ బై కొడుతున్నాను.'

నళిని ఆశ్చర్యపోయింది. 'ఏమైంది?'

'హీరోయిన్‌గా బుక్ అయ్యాను.'

'వ్వాట్! రియల్లీ!'

'యస్ ప్లీజ్.'

'కంగ్రాట్యులేషన్స్.' ఒక్కసారి జెలసీ ప్రవేశించింది. అప్పుడే కళ్ళ ముందు కళ్యాణి తారాపథంలో పరుగులు తీస్తున్నది.

'థాంక్ యూ!' ఫోను పెట్టేసింది కళ్యాణి.

నళినిలో పట్టుదల ప్రవేశించింది. తనూ సినిమాలకై ప్రయత్నించక గృహిణి కావటమేమిటి?

అంతే!

'ఎలాగైనా తనూ తారాపథంలో పయనించాలి!' పట్టుదలతో పైకి లేచింది నళిని.

* * *

డియర్ నళిని .

నీ వివాహ ప్రయత్నం నాకు తెలిసి ఒక్కసారి జీవితం పునరాలోకనం చేసుకున్నాను. నా తప్పు అర్థమైంది. జీవితం సరిదిద్దుకునే అవకాశం నీ ఇంటర్వ్యూ వల్ల నాకు లభించింది. నా భర్త నిన్ను ఇష్టపడ్డాడంటే నేను మళ్ళీ ప్రయత్నం చెయ్యడంలో తప్పులేదు. అది అత్యవసరం గూడ. వైవాహిక జీవితం ప్రశాంతమైంది. గతం కళ్ళముందు మెదిలింది! అందుకే ప్రయత్నించి ఫలితం సాధించాను. ఆరోజు ఫోన్‌చేసి నిన్ను రెచ్చగొట్టాను. అంతే! మరి నా దారి చూసుకోవద్దూ!

ప్రస్తుతం మా కుటుంబం సవ్యంగా సాగుతున్నది. ఈ క్రెడిట్ అంతా నీకే దక్కాలి! ఆయన ప్రోత్సాహంతోనే ఈ ఉత్తరం వ్రాస్తున్నాను.

శలవు

నళిని మనస్సు ఉసూరుమంది.

ఇంటర్వ్యూ మెదిలింది. రెండో వరుడు....

'డాక్టర్‌కు' ఉత్తరం వ్రాయడానికి ఉపక్రమించింది నళిని కాదు....గృహిణి

———

# పైడితల్లి

రాజా చంద్రం



ఎందుకో సముద్రుడు హోరుమని ఘోషిస్తున్నాడు....

తీరం చేరుకోవాలని ఆరాట పడుతున్నాయి కెరటాలు....

దూరాన ఆకాశంలో అర్ధచంద్రుడు మబ్బుల మాటుకు మెల్లగా జారుకుంటున్నాడు....

ఎవరో ఒక అమ్మాయి అనంత సాగరం కేసి శూన్యంలోకి చూస్తూ కూర్చుంది—ఎంత చూసినా ఆమె కంతా శూన్యమే కనిపిస్తోంది....

ఉన్నట్టుండి ఆమెకు ఏవేవో గుర్తుకొస్తున్నాయి—ఏవో దృశ్యాలు ఆమె మనోఫలకంపై ప్రత్యక్షమై అంతలోనే అదృశ్యమవుతున్నాయి....

ఆమెను ఓ కుర్రాడు బలాత్కరిస్తున్నాడు.. వాడిని తప్పించుకోవడానికి అటూ యిటూ గదంతా పరుగెడుతుందామె.

ఎదురుగా సముద్రుడి ఘోష....

క్రిందకు వాలిపోతున్నాయి ఆమె కన్నులు....

రవిక సగం చినిగిపోయింది—లంగా చిందరవందరగా వుంది—తనను కాపాడమని ఆమె పెట్టే ఘోష వినిపించుకునే నాధుడు ఎవడూ లేడు అక్కడ..

తీరం చేరుకోవాలని ఎగిరెగిరి వస్తుందొక పెద్ద కెరటం....

సన్నంగా వర్షిస్తున్నాయి ఆమె కన్నులు....

నేలమీద పడి గింజుకుంటుంది ఆమె—కొంచెం కొంచెంగా ఆ యువకుడు ఆమెను...

రెండు చేతుల్లో ముఖాన్ని దాచుకుని భోరుమని ఏడుస్తుందామె.

ఎదురుగా సముద్రుడి ఘోష.

అలలు చేస్తున్న అల్లరి.

అవును, ఆ అమ్మాయే మన పైడి తల్లి!

పదహారేళ్ళు కూడా నిండని అమాయకురాలు.

ఆమె పచ్చని నూరేళ్ళ బతుకు ఈ రాత్రిలో మట్టయిపోయింది. చీకటై పోయింది.

అది ఆమెకు శాపమే కావచ్చు.

కానీ, ఏ పాపం ఎరగదామె.

ఆమె చేసిన పాపమల్లా ఒకటే—అది ఆమె పిచ్చయ్యకు కూతురు కావడమే!

**2**

పిచ్చయ్య పచ్చి తాగుబోతు. చేసేది రైల్వే ఉద్యోగం. వచ్చేది నాలుగురాళ్ళ జీతం. అది కాస్తా అతని తాగుడికే సరి పోతుంది.

అందుకే పిచ్చయ్యను కట్టుకున్న పాపానికి సీతాలు బజారున పడింది.

చదువురాని సీతాలుకు నీడ చాటు ఉద్యోగం ఎవరిస్తాడు? పోనీ, ఆమెకు ఏవైనా చేతిపనులు వచ్చా అంటే—అవేం రావు ఆమెకు.

ఆమెకు ఒకటే తెలుసు.

ఆమెకు ఆమె తల్లిదండ్రులు అదే నేర్పారు.

మొగుడికి ఎట్టి పరిస్థితుల్లో కూడా ఎదురు జవాబు చెప్పకూడదు!

ఆడమంటే ఆడాలి!

పాడమంటే పాడాలి!

కొట్టినా తిట్టినా సహించాలి!

ప్రక్కన పడుకోమంటే పడుకోవాలి!

పిల్లల్ని కనమంటే కనాలి—కంటూనే వుండాలి!

సీతాలు మొత్తం ఏడుగురిని కంది. చిట్టచివరకు ముగ్గురే మిగిలారు—యిద్దరు కొడుకులు, ఒక కూతురు.

**3**

ఇంటి ప్రక్కనేవున్న రైల్వేయార్డు లోంచి బొగ్గుముక్కలు ఏరి తెచ్చు కుంటుంది సీతాలు.

వాటిని టీకొట్టు నాయర్‌కిస్తే మూడు లేక నాలుగు రూపాయలు వస్తాయి. దాంతో సంసారాన్ని ఎలాగో గుట్టుగా లాక్కొస్తుందామె.

అయితే పిచ్చయ్యకు ఏదో అను మానం. మగమహారాజు గదా!

ఇంజన్ డ్రైవర్ కామస్వామికి, సీతాలుకి ఏదో నీచ సంబంధం వుందని అతని అపోహ!

నిజమే. ఆడాళ్ళంటే పడిచస్తాడు కామస్వామి. అతనికా వూళ్ళో ముగ్గురు ముండలు వున్నారని చెప్పుకుంటారు. అదెంత వరకు నిజమో గానీ తన సొంతానికి యింజన్ బొగ్గులు వాడుకో వడం మటుకు పచ్చి నిజం.

ఏ ఆడదైనా వచ్చి తనతో సరదాగా ఓ రెండు నిమిషాలు కబుర్లాడితే చాలు ఐసైపోతాడు. కావల్సినన్ని బొగ్గు ముక్కలు తీసుకెళ్ళమంటాడు.

అంతేకాదు. బొగ్గు ముక్కలు ఏరు

కునే ఆడవాళ్ళ కొందరితో శారీరక సంబంధాలు కూడా వున్నాయి. వాళ్ళకు చీరలు, రవికెలు కొనిపెడుతుంటాడు.

బొగ్గుముక్కల గురించే కామస్వామితో స్నేహం కట్టింది సీతాలు. మరే పాపం ఎరుగదామె. అయితే అదే ఆమె పాలిట ఘోర శాపమైంది.

అనుమానపు రాకాసి ఎదలో పెట్టే రొద భరించలేక, త్రాగిన మైకంలో సీతాలుని గొడ్డును బాదినట్లు బాదేసేవాడు పిచ్చయ్య.

కానీ, ఆమెను యార్డుకు వెళ్ళకుండా ఆపలేకపోయాడు. అదే గమ్మత్తు.

ఆపేస్తే తను పెట్టే ఆ కాస్త కూడు కూడా దొరకదని అతనికి తెలుసు. మగవాడి స్వార్థానికి ఆడది ఎప్పుడూ బలి పశువేగా! అనాదిగా జరుగుతున్నదే అది!

4

భర్త పోరుపడలేక, రోజూ చావలేక ఒకరోజు నిజంగానే చచ్చిపోయింది సీతాలు!

పిచ్చయ్య ముందు నమ్మలేకపోయాడు. నూతిలోనుంచి తీసిన సీతాలు శవాన్ని చూసి నోటమాట రాక అక్కడే కొయ్యబారిపోయాడు.

సీతాలు చచ్చిపోయింది.

గుట్టుగా వుండే ఆ గూడు చెదిరిపోయింది. ఎవరికి వారైపోయారు.

భార్య పోయిన దుఃఖంలో, పిల్లలు ఏమైపోతారన్న బెంగతో సారాకొట్టులోనే కాలమంతా గడపేస్తున్నాడు పిచ్చయ్య.

పెద్దోడు సుబ్బారావు తల్లిలాగే బొగ్గుముక్కలు గురించి యార్డులో తిరగసాగాడు.

చిన్నోడు రంగారావు చదువు మానేసి జులాయిగా తిరగడం ప్రారంభించాడు.

అయిదేళ్ళ పైడితల్లిని వాళ్ల వెనకింటిలో వుంటున్న వెంకమ్మ ఆదరించింది.

5

సంవత్సరాలు గడిచిపోతున్నాయి. ఏడేళ్ళు గడిచాయి.

దేశంలో ఎక్కడ చూసినా ఒకటే గందరగోళంగా వుంది. ఎవరికి వారే ఎంత దొరికితే అంత దోచేసుకుంటున్నారు. అవినీతి, స్వార్థం కట్టలు త్రెంచుకొని ప్రవహిస్తున్నాయి. గాంధి కన్న కలలు కలలుగానే మిగిలిపోయాయి.

దేశం ఏ దిశగా పయనిస్తుందో తెలియదు. ఒకటే అయోమయంగా వుంది.

సరిగ్గా అప్పుడే పిచ్చయ్య బ్రతుకు మరో మలుపు తిరిగింది.

సారాకొట్టు ఎదురుగా ఓ చిన్నసైజు మిలిటరి హోటల్ నడుపుకుంటుంది కాంతం. వంటకాల కోసం యింజన్ బొగ్గులు ఫ్రీగా దొరికితే బాగుండునని ఎన్నాళ్ళనుంచో కలలు కంటుందామె. డబ్బులు యిచ్చి కొనుక్కోవాలంటే




ఆమెకు మహా కష్టంగా వుంది. అందుకే పిచ్చయ్యని చేరదీసింది.

కాంతానికి నా అనేవాళ్ళు ఎవరూ లేరు. ఆమె కసలు పెళ్ళయిందో లేదో తెలియదు. ఎవరెవరితోనో సంసారం సాగించింది. చివరికా హోటల్ ఒకటే మిగిలింది. అప్పుడప్పుడు ఎవరో లారీ డ్రైవర్లు వస్తుంటారు, పోతుంటారు. వాళ్ళతో తన వయసుపోరు తీర్చుకుంటుందామె.

ఇప్పుడు పిచ్చయ్య దొరికాడు. పిచ్చయ్య కళ్ళకు కాంతం అప్సరసలా కనిపించింది. అంతే, వగలు కురిపించగానే పిచ్చోడై పోయాడు.

సీతాలుని, తను కన్న బిడ్డలని మరచిపోయాడు.

## 6

వెంకమ్మ పోషణలో పైడితల్లి బుద్ధిమంతురాలని యిరుగుపొరుగులో పేరు తెచ్చుకుంది. ఇంటిపనుల్లో ఆరితేరింది. తెలుగు చదవడం, రాయడం నేర్చుకుంది. నిష్ఠగా శివరాత్రులు చేయడం అలవర్చుకుంది. ఆమెకు దేవుళ్ళంటే మహాభక్తి.

ఉన్నట్టుండి సుబ్బారావు ఉద్యోగస్తుడై పోయాడు. ఎన్నెన్నో గుమ్మాలు ఎక్కి ఎందరెందరివో కాళ్ళు చేతులు పట్టుకొని, చివరికి మూడు వేల రూపాయలు లంచం యిచ్చుకుంటానని బాండు రాసిచ్చిన తర్వాతే అతడికా ప్యూన్ ఉద్యోగం దొరికింది.

రంగారావు మటుకు పచ్చి పోకిరిగా తయారయ్యాడు.

## 7

పైడితల్లి పుష్పవతి అయింది.

వెంకమ్మ ఆనందానికి అంతులేకుండా పోయింది. కానీ, పైడితల్లికి ఎందుకో దిగులుగా వుంది. ఈ వయసులో వున్న వాళ్ళకు బాధలు, వేదనలు వుండవంటారు. అది పెద్దింటి అమ్మాయిల సంగతి కావచ్చు. ఊహ తెల్సినప్పట్నుంచి కష్టాలతో బతుకుతున్న వాళ్ళకు అన్నీ బాధలే, వేదనలే.

కన్నతల్లి లేనే లేదు. ఉన్న తండ్రి అయినా దగ్గిరుంటే ఆమెకు ఎంతో ఊరటగా, ధైర్యంగా వుంటుంది. కానీ, పైడితల్లి ఈ భాగ్యానికి నోచుకోలేదు.

కనీసం తొమ్మిదవరోజు శుభకార్యాని కయినా తన తండ్రి వస్తాడని ఆశించిందా అమాయకురాలు. కానీ, ఆ ఆశ నిరాశే అయింది. వస్తానని వాగ్దానంచేసి కూడా త్రాగుడిలో పడి రాలేకపోయాడు పిచ్చయ్య.

సరే తండ్రి హాజరు కాలేకపోయాడు. కానీ, అన్నలయినా వచ్చి తనను దీవిస్తారని ఆశించింది పైడితల్లి. ఆ ఆశ కూడా అడియాసే అయింది.

పేకాటలో మునిగిపోయి అసలు సంగతే మరిచిపోయాడు సుబ్బారావు. రంగారావు మటుకు తక్కువ తిన్నాడా ఏం, వాడు కూడా బ్లాక్‌లో సినిమా టికెట్లు అమ్ముకోవడంలో పడి చెల్లెలి సంగతే పట్టించుకోలేదు.

అయినవాళ్ళు వుండి కూడా ఎవరూ లేని అనాధే అయింది పైడితల్లి. కుళ్ళి కుళ్ళి ఏడ్చింది. వెంకమ్మ ఎంతో ఓదార్చింది. కానీ లాభం లేకపోయింది. ఆ రాత్రంతా ఏడుస్తూనే గడిపింది— పాపం పైడితల్లి!

## 8

మరో ఏడాది గడిచింది. డెబ్బైనాలుగు పోయి డెబ్బై అయిదు వచ్చింది.

దాంతోనే సుబ్బారావు జీవితంలోకి రాణి వచ్చింది.

రాణి ఓ ప్రైవేట్ కంపెనీలో స్టెనో ఉద్యోగం చేస్తుంది. ఆమె చదువుకున్న చదువుకో, వున్న అర్హతలకో ఆమెకా ఉద్యోగం రాలేదు.

ఆ కంపెనీ మేనేజర్ బాబులకు తన శరీరాన్ని లంచం క్రింద అమ్ముకుంటేనే ఆమెకా ఉద్యోగం వచ్చింది. ఆ మాట కొస్తే ఆమె రోజూ తన శరీరాన్ని అమ్ముకుంటుంది—కొనేవాళ్ళుంటే!

అది వాళ్ళ కులవృత్తి!

రాణికి తన కన్నతండ్రి ఎవరో తెలీదు. తల్లి శకుంతలాదేవే ఆమెకు అన్నీను. అసలు శకుంతలాదేవి కూడా రాణి కన్నతల్లి కాదంటారు చాలామంది. అదెంతవరకు నిజమో గానీ, శకుంతలా దేవి వేశ్యగా రిటైర్ అయిన దగ్గిర్నుంచి కొంతమంది అమాయకురాళ్ళను మాయ మాటలతో లోబర్చుకొని తోలువ్యాపారం

మహా జోరుగా సాగిస్తున్న విషయం మటుకు పచ్చి నిజం!

సుబ్బారావు జీతగాడై నాలుగు రాళ్ళు చేతిలో పడగానే అతనికి కళ్ళు నెత్తికెక్కి పోయాయి. పేకాట నేర్చుకున్నాడు. త్రాగుడు మరిగాడు. పిట్టల వేటలో పడ్డాడు.

సరిగ్గా అప్పుడే అతనికి, రాణికి ఓ లాడ్జింగ్ హౌసులో పరిచయం అయింది. రాణికి, బంగారు గనికి అట్టే తేడా లేదని వెంటనే గ్రహించాడు సుబ్బారావు. అంతే— పెళ్ళాడితే రాణినే పెళ్ళాడాలని అప్పటికప్పుడే నిశ్చయం చేసుకున్నాడు.

సుబ్బారావుకు రోజూ చేతినిండా డబ్బు కావాలి. అది రాణి దగ్గిర పుష్కలంగా వుంది. ఎటొచ్చి ఆమెకు తన మెడలో ఓ తాళిగట్టి "ఈమె నా పెళ్ళాం!" అని పదిమందిలో ధైర్యంగా చెప్పగల ఓ 'మొగుడు' కావాలి. ఇల్లాలిగా, ఉద్యోగస్తురాలిగా ఈ సంఘంలో ఘరానాగా తిరగొచ్చని రాణిలాంటి వాళ్ళకు బాగా తెలుసు. అది కొంతవరకు నిజమే. రోజులు మారిపోయాయి మరి!

అంతే. ఇద్దరిక్కీ గుడిలో పెళ్ళైపోయింది. సుబ్బరావుకు ఎంతబడితే అంత డబ్బు యిచ్చే ధనలక్ష్మి లాంటి పెళ్ళాం లభిస్తే రాణికి తను ఎవడితో పడుకున్నా అభ్యంతరం చెప్పని ఓ మంచి మొగుడు దొరికాడు.

కోడలు గురించి తెలిశాక పిచ్చయ్య కోపావేశాలతో వూగిపోయాడు. అయితే సుబ్బారావు అదలింపుతో, ఎత్తిపోటు మాటలతో వచ్చినదారినే తిరిగి వెళ్ళిపోయాడు.

రంగారావు అదేం పట్టించుకోలేదు.

పైడితల్లి చాటుగా కళ్ళనీళ్ళు పెట్టుకుందే.

## 9

రాణి సుబ్బారావు భార్య అయిన తర్వాత ఆ యింటి పెత్తనం అంతా ఆమెదే అయింది. అంతవరకు వాళ్ళుంటున్న రైల్వే కొలని వదిలేసి టౌనులో ఓ పెంకుటిల్లు అద్దెకు తీసుకున్నారు. అది రాణి యిష్టంపైనే జరిగింది.

కొత్తింటి చాకిరి అంతా పైడితల్లి నెత్తిన పండింది. అంతే కాదు. రాణి అంటగట్టిన పనల్లా ఆమె చేసితీరాలి.

రాణి బట్టలు పైడితల్లి వుతకాలి. వాళ్ళు తిన్న గిన్నెలు పైడితల్లి కడిగి శుభ్రం చేయాలి. ఇంకా ఎన్నో, ఎన్నెన్నో.

అయితే అలా అన్ని పనులు చేస్తున్నప్పటికీ రాచి పైడితల్లిని ఆడిపోసుకుంటూనే వుంది. ఎందుకో మరదలు అంటే రాణికి ఏదో జుగుప్స. బహుశా పైడితల్లి శీలవతనా?

మొత్తానికి పైడితల్లి స్థితి దీనంగా తయారయింది.

వెంకమ్మ ఒకరోజు కలగజేసుకుంది రాణికి బుద్ధిచెప్పబోయి చేయి కాల్చు

కుంది. రాణి ఎదురుతిరిగింది. అమ ర్యాదగా ప్రవర్తించింది. ఆ యింటి ఛాయలకే యిక రాకూడదని వెంకమ్మను శాసించింది. రాణి ప్రవర్తనకు పైడితల్లి అదిరిపోయింది. ఆ షాకు నుంచి తేరుకునేలోగా అంతా అయిపోయింది. వెంకమ్మ వెళ్ళిపోయింది.

అయితే వెంకమ్మ అంతటితో వూరుకోలేదు. ఆలోచించింది.

రాణి బారినుంచి పైడితల్లిని తప్పించాలంటే ఆమెకు పెళ్ళి చేసి అత్తారింటికే పంపించేయాలి. అదొకటే సరైన పరిష్కార మార్గం. అప్పట్నుంచి పైడితల్లికి తగిన వరుడికోసం గాలించడం మొదలెట్టింది.

మరి, పైడితల్లి తలరాత ఎలావుంటో గానీ, వెంకమ్మ తన ప్రయత్నాలు ఫలించక మునుపే చనిపోయింది. ఎనమండుగురిని కని, తొమ్మిదవ బిడ్డను కనలేక కని పురిటిమంచంమీదే కనుమూసింది.

అయిదుగురు తర్వాత ఆపరేషన్ చేయించేసుకుంటానంది వెంకమ్మ. కానీ, ఆమె మొగుడుగారు అందుకు ఒప్పుకోలేదు. "పోసించేవాడు నానుండగా మద్దెన నీ కేటి బాధ?" అని కొట్టిపారేసాడు.

ఎవరో అన్నారు— మన దేశంలో కుటుంబ నియంత్రణ తగినంతగా ఫలితాలు యివ్వకపోవడానికి ముఖ్య కారకులు మగ మహారాజులేనని. అది నిజమే మరి!

## 10

ఒకరోజు సాయంత్రం....

పైడితల్లిని చూసి, "ఇంత అందమైన పనిపిల్ల నీకెక్కడ దొరికిందే రాణీ?" అని ఆశ్చర్యపోయింది రాణి స్నేహితురాలు ఒకర్తె. రాణి నవ్వేసి వూరుకుంది. అంతే గానీ, ఆమె తన మరదలు అని చెప్పుకోలేదు.

జరిగిన అవమానానికి పైడితల్లి కుళ్ళి కుళ్ళి ఏడ్చింది. విషయం తెలిసి రంగారావు మండిపోయాడు.

రాణి తెలివిగా బయటకి జారుకుంది. దాంతో అన్నదమ్ములిద్దరు రంగంలో మిగిలిపోయారు. కీచులాడుకున్నారు. ఒకరినొకరు దెప్పిపొడుచుకున్నారు. ఫలితంగా రోషం వచ్చి రంగారావు యిల్లు విడిచి వెళ్ళిపోయాడు— పైడితల్లి ఎంత వారిస్తున్నా వినిపించుకోకుండా.

వెంకమ్మ చనిపోయిన తర్వాత రంగారావును చీకట్లో ఒక చిరుదీపంగా చూసుకుంటున్నది పైడితల్లి. అయితే యిప్పుడు వాడు కూడా యిల్లు విడిచి వెళ్ళిపోవడంతో ఆమె మరీ దిగజారిపోయింది.

సుబ్బారావు మీద ఆమె ఏనాడో ఆశ వదులుకుంది. అతను రాణిచేతిలో కీలుబొమ్మని ఆమెకు బాగా తెలుసు.

ఇక పోతే తండ్రి. అతను వున్నా ఒకటే లేకపోయినా ఒకటే అన్నట్టుగా




వున్నాడు. అతన్ని నమ్ముకుంటే నట్టేట్లో మునిగిపోవల్సిందే.

ఇక పైడితల్లిని ఆదుకునే దెవరు? ఫోటో ఫ్రేముల్లోంచి చూస్తున్న సీతాలా? లేక కాళికాదేవా?

## 11

అంతలో ఏమైందోఏమో, పిచ్చయ్య కామస్వామి లాంటి వాళ్ళకు ఎందరికో ఉద్యోగాలు పోయాయి.

పిచ్చయ్యకు ఉద్యోగం వూడిందని కొంతం కంగారెత్తి పోలేదు. ఇంజన్ బొగ్గులు తెచ్చిచ్చేవరకు పిచ్చయ్యను తనతో వుంచుకోవడానికి నిశ్చయించుకుంది. ఆ తర్వాత అతని దారి అతనిది తన దారి తనది.

పిచ్చయ్య సరేనన్నాడు. ఒకప్పుడు సీతాలు చేసినపనే పిచ్చయ్య యిప్పుడు తప్పనిసరిగా చేయాల్సివచ్చింది. బొగ్గులు గురించి గంపతీసుకొని యార్డులో తిరగసాగేడు.

పిచ్చయ్య కిప్పుడు తెల్సివచ్చింది— బొగ్గులు ఏరడమంటే మాటలు కాదని. సీతాలు ఆనాడు పడిన శ్రమకూడా అర్థం అయింది. ఆమె నిరపరాధి అని, నిప్పులాంటిందని ఒప్పుకోక తప్పలేదు. కానీ ఆమె అతని మూర్ఖత్వానికి బలి అయిపోయాక యిప్పుడు ఎంత విచారించినా, ఎంత పశ్చాత్తాపం పడినా ఆమె తిరిగి రాదు. ఆమె లేని లోటు తీరదు. చెదిరి పోయిన గూడు ఒకటవ్వదు. పిచ్చయ్య రోదించసాగాడు. రోజురోజుకు క్షీణించి పోసాగాడు. అతనికిప్పుడు తాగుడు ఒకటే శరణ్యం.

తండ్రికి పట్టిన దుస్థితి తెలుసుకొని

అతన్ని ఒకరోజు యార్డులో కలుసుకుంది పైడితల్లి. కాంతాన్ని వదిలేసి తనతో యింటికి వచ్చేయమని ఎంతో బతిమా లింది. కానీ, పిచ్చయ్య రానన్నాడు. పెద్దకొడుకు అన్నా, పెద్దకోడలు అన్నా అతనికి పీకలవరకు కోపంగా వుంది.

పైడితల్లి ఏదేదో చెప్పి చూసింది. కాళ్ళావేళ్ళా పడింది. అయినా లాభం లేకపోయింది.

పిచ్చయ్య మాటిమాటికి దగ్గుతో ఆయాసపడ్డం చూసి ఎవరైన మంచి డాక్టర్‌దగ్గిర చూపించుకోమని, మందులకని తను దాచుకున్న యాభై రూపాయలు తండ్రి చేతికిచ్చి యింటికి తిరిగొచ్చింది పైడితల్లి.

పిచ్చయ కేం చేయాలో తోచలేదు. ఓ వైపు జీవంలేని సీతాలు. మరో వైపు జీవం వున్న పైడితల్లి! ఇద్దరికీ తను కావాలి. కానీ, తనే యిద్దరినీ అలక్ష్యం చేశాడు. అటు భార్యకి, యిటూ కూతురికి ఏ విధంగా కూడా ఆదుకోలేక పోయాడు. సీతాలు విసిగి వేసారిపోయి తనను విడిచి వెళ్ళిపోయింది. కానీ, పైడితల్లి తనను వెదుక్కుంటూ వచ్చింది. ఆరోగ్యం కాపాడుకోమని డబ్బులిచ్చింది. పిచ్చయ్య పిచ్చిగా నవ్వు కున్నాడు. ఆ నవ్వులో జీవం లేదు. చేతిలోవున్న యాభై రూపాయలు గాలికి రెపరెపలాడుతున్నాయి—పైడితల్లి మన సులా! దుఃఖం పొంగి పొర్లిరాగా, దగ్గు ఆయాసంతో అక్కడే కూలబడి పోయాడు.

## 12

ఉన్నట్టుండి శకుంతలాదేవి బిజి నెస్సులో కూడా జోరు కొంత తగ్గింది. పోలీసు రేడులు పెరిగిపోయాయి. శకుం తలాదేవి మహా యిబ్బందిలో పడింది. కానీ, ఏం చేయగలదు—గుప్‌చిప్‌గా పడి వుండక? ఆ పనే చేసింది.

కానీ, అది కొంత కాలమే.

సరైన సమయం చూసుకొని, మళ్ళీ అదే పోలీసు అండతో విజృంభించింది. అయితే పిట్టల కొరత ఏర్పడంతో అమాయకులైన అమ్మాయిల గురించి వేట మొదలెట్టింది.

ఎందుకో మాటిమాటికి ఆమెకు పైడి తల్లి గుర్తుకొస్తుంది.

పైడితల్లిని చూసినప్పుడల్లా శకుంతలాదేవికి అప్సరసలే గుర్తు కొస్తున్నారు.

పదహారేళ్ళ వయసులో అమ్మాయిలు ఎలావుంటారో పైడితల్లి అలానే వుంది. కాకపోతే సరైన పోషణలేక కొంత నీరసంగా కనిపిస్తుంది, అంతే.

అంతలో పైడితల్లిని పెళ్ళాడడానికి ఓ యాభై ఏళ్ళ పడుచువాడు ముందు కొచ్చాడు. అతని భార్య చనిపోయి ఆరు మాసాలు కావస్తున్నాయి. పైడితల్లి వయసులో అతనికి యిద్దరు కూతుళ్ళు వున్నారు. అతను మరెవరో కాదు. సాక్షాత్తు కామస్వామే!




సమయానికి రాణి అడ్డుపడకపోయుంటే సుబ్బారావు ఆ సంబంధాన్ని ఒప్పేసుకునేవాడే. ఆ విధంగానైనా తన గుండెలమీదున్న భారం దిగిపోతుందని అతని ఉద్దేశ్యం.

పైడితల్లి మనసు కుదుటబడింది.

శకుంతలాదేవి మనసు కూడా కుదుటబడింది. చేతిలో వున్న బంగారు పిచ్చుకను వదులుకుంటే అంతకన్నా అవివేకం మరొకటి వుంటుందా?

## 18

ఆ రోజు శివరాత్రి!

నిష్ఠగా శివరాత్రులు చేయడం పైడితల్లికి చినప్పట్నుంచి అలవాటే. ఈ సారి రాణికూడా ఆమెతో జత కలిసింది.

సుబ్బారావు పేకాటకని వుదయానే బయటకి వెళ్ళిపోయాడు.

సాయంత్రం అవుతుండగా రాణి, పైడితల్లి కలిసి రాత్రి జాగారం చేయడానికి శకుంతలాదేవి యింటి కెళ్ళారు.

ఉన్నట్టుండి రాణి మెల్లగా బయటకి జారుకుంది.

పాపం పైడితల్లి ఒక్కర్తె మిగిలిపోయింది.

శకుంతలాదేవి వలలో చిక్కుకుంది. అయిదువందల రూపాయలకు అమ్ముడుపోయింది.

కన్నెపిల్లలను తొలిసారిగా అనుభవించడంలో వున్న మజా తెలిసిన ఆనంద్‌కుమార్ కళ్ళు ఏనాడో పైడితల్లిపై పడ్డాయి. అది ఈ నాటికి నేరవేరబోతుంది— శంకుంతలాదేవి పుణ్యమా అని!

కల్తీ సిమెంట్ అమ్మి అమ్మి సంపాదించిన నల్లడబ్బు తినితిని తెగ బలిసి మిసా క్రింద అరెస్టయిన జగన్నాథరావు

అనే ఓ లక్షాధికారి ఏకైక కుమారుడే ఈ ఆనంద్‌కుమార్—గతంపైన అస్త వ్యస్తమైన భవిష్యత్తును ఎదుర్కొనే శక్తి లేక అలమటిస్తున్న నేటి యువ తరానికి ప్రతీకలాంటివాడు!

ఆనంద్‌కుమార్‌కి ఏ అమ్మాయి అయినా నచ్చితే, ఆమెను మచ్చిక చేసుకునో, డబ్బిచ్చి కొనుక్కునో, లేక శకుంతలాదేవి లాంటి రాక్షసుల సాయంతో అనుభవించడమంటే భలే ప్రీతి. మరి పైడితల్లిని వూరకే వదిలేస్తాడా?

పైడితల్లి ఏడ్చింది. అర్థించింది.

అక్కడ్నుంచి పారిపోవటానికి ప్రయత్నించింది.

కడకు ఆనంద్‌కుమార్ బుర్ర పగల గొట్టబోయింది.

కానీ, ఏ ఒక్కటీ ఫలించలేదు. ఆమెను ఏ దేవుడు కూడా అదుకోలేక పోయాడు.

శివరాత్రి కదాని వూళ్ళో ఒకటే సందడిగా వుంది.

ఎందుకో సముద్రుడు హోరుమని ఘోషిస్తున్నాడు!

త్రాగిన మైకంలో ఎవరికో చేతులెత్తి నమస్కరిస్తున్నాడు పిచ్చయ్య....

సుబ్బారావు చేతుల్లోంచి పేకముక్కలు చకచకా కదిలిపోతున్నాయి....

కంట్రాక్టర్ గురవయ్యగారి చేతులు రాణిని వస్త్రాపహరణం చేస్తున్నాయి.

ఆనంద్‌కుమార్ చేతిలో పైడితల్లి....

సముద్రుడు హోరుమని ఘోషిస్తున్నాడు....

పైడితల్లి ఒంటి మీద దుస్తులు లేవు. ....గోడవైపు తిరిగి గట్టిగా కళ్ళుమూసుకుంది....

తీరం చేరుకోవాలని ఎగిరెగిరి వస్తుందొక పెద్ద కెరటం....

ఆమె నడుం చుట్టూ ఆనంద్‌కుమార్ చేతులు బిగుసుకుంటున్నాయి.

పిచ్చయ్య చేతిలో సారాబుడ్డి....

సుబ్బారావు చేతిలో పేకముక్కలు....

ఆనంద్‌కుమార్ చేతిలో పైడితల్లి....

పైడితల్లిని ఒక్కసారిగా తన వైపుకు త్రిప్పుకున్నాడు ఆనంద్‌కుమార్....

అతని కళ్ళల్లో రాకాసి— ఆమె ఎదలో ప్రళయం!

## 14

నిశ్శబ్దం! జడివాన రాత్రంతా కురిసి ఆగిపోయినంత నిశ్శబ్దం!

సముద్రుడు కూడా నిశ్శబ్దంగానే వున్నాడు.

ఊళ్ళో సద్దుమణిగింది.

మెల్లమెల్లగా, తెల్లతెల్లగా తెల్లవారుతుంది....

పైడితల్లికి ఒంటిమీద స్పృహ లేదు.

షర్టు దులుపుకొని బయటికి వెళ్ళిపోయాడు ఆనంద్‌కుమార్. శకుంతలాదేవి, రాణి తృప్తిగా నవ్వుకున్నారు.



ఎడ్లబళ్ళు మెల్లగా నడుచుకుంటూ పోతున్నాయి— కాలచక్రంలా....

చీకట్లో నిర్జీవంగా కూర్చున్న పైడితల్లికి యిద్దరే కనిపిస్తున్నారు— ఒకరు ఏ పాపం ఎరగని అమాయకంగా చూస్తున్న సీతాలు; మరొకరు నిప్పులు చెరిగే కాళికాదేవి— యిద్దరిని మార్చి మార్చి చూస్తుంది పైడితల్లి—ఎందుకో ఆమెకే తెలియాలి!

మూణ్ణెళ్ళ తర్వాత పైడితల్లి నెల తప్పింది.

కామస్వామి నోటిగుండా కూతురికి జరిగిన అన్యాయం విని భరించలేక దగ్గు ఆయాసంతో మెలికలు తిరిగిపోతూ, కళ్ళు మూతలుబడగా ఎదురుగా వస్తున్న షంటింగ్ యింజన్‌కి బలైపోయాడు పిచ్చయ్య.

"ఛీ ఛండాలా, కులటా!" అని పైడితల్లిని యింట్లోంచి వెళ్ళిపొమ్మన్నాడు సుబ్బారావు. లేకపోతే చంపేస్తానన్నాడు. అంతకన్నా అతను యింకేం చేయగలడు?

రంగారావు జాడే లేదు.

ఇక పైడితల్లికి ఏది దారి? ఒకటే దారి— గోదారి!

కానీ, శకుంతలాదేవి అంతటితో వూరుకోలేదు. మాయమాటలు చెప్పి పైడితల్లిని చేరదీసింది. తర్వాత కడుపు తీయించేసింది.

పైడితల్లిని ఆనంద్‌కుమార్ రోజూ వాడుకుంటున్నాడు. శకుంతలాదేవికి రోజుకో యాభై రూపాయలు ముడుతున్నాయి.

## 15

ఎదురుగా సముద్రుడు.

అతనికి ఎదురుగా పైడితల్లి.

సముద్రుడు హోరుమని ఘోషిస్తున్నాడు. పైడితల్లి నిశ్శబ్దంగా రోదిస్తుంది. ఇద్దరికి అదే తేడా!

కార్లో కూర్చొని విస్కీ సేవిస్తున్న ఆనంద్‌కుమార్ లేచి నిలబడ్డాడు. అడుగులు తడబడుతున్నాయి. చేతిలో విస్కీ బాటిల్ వూగుతుంది.

"ఎందు కింకా ఆ వెధవ ఏడ్పు!" అని విసుక్కున్నాడు ఆనంద్‌కుమార్— పైడితల్లి ప్రక్కనే కూర్చుంటూ.

పైడితల్లి కళ్ళు తుడ్చుకుంది.

ఖాళీ అయిపోయిన బాటిల్‌ని దూరంగా విసిరికొట్టాడు. షర్టు తీసి గాలిలోకి వదిలేశాడు.

పైడితల్లిని యిసుకలో పడుకోబెట్టి, ఆమె జాకిట్టు గుండీలు వూడదీయబోయి టక్కున ఆగాడు.

కెరటాలు ఎగిరెగిరి పడుతున్నాయి.

పైడితల్లి కదిలింది. ఆనంద్‌కుమార్ ప్రక్కకు ఒరిగిపోయాడు. అతని కడుపులో కత్తి!

పైడితల్లి లేచి నిలబడింది. ఆమె ముఖంలో ఏదో తేజస్సు! సాక్షాత్తు ఆ కాళికాదేవే దిగివచ్చినట్టుంది!

ఆనంద్‌కుమార్ శవాన్ని చూస్తూ వెనక్కి రెండు అడుగులు వేసి, గబుక్కున తిరిగి అనంతసాగరం వైపు పరుగెత్తింది.

హోరుమని సముద్రుడు.

తీరం చేరాలని అలలు

మబ్బుల మాటుకు పోయిన అర్ధ చంద్రుడు.

మాయమయిపోయిన పైడితల్లి....





# అంతర్వాహిని

కన్నెపల్లి కామేశ్వరి

చలిగాలి రివ్వున వీస్తోంది.

మృత్యుంజయరావ్‌కి తటాలున తెలివచ్చింది.

కిటికీ గుండా బయటికి చూసేడు.

చీకటి దట్టంగా పేరుకుంది.

ఆకసంలో నక్షత్రాలు చెల్లాచెదురుగా కన్పిస్తున్నాయి.

బస్సు ముందుకి దూసుకపోతోంది సన్నగా రొదచేస్తూ.

డిమ్‌లైట్ వెలుగులో ప్రయాణీకులు బస్సు కుదుపులకి జోగుతూ మ్యూజియమ్‌కి తరలింపబడ్తున్న సజీవ శిల్పాల్లా భ్రమకల్గిస్తున్నారు.

ఇందుమతి నిద్దట్లో ఏదో గొణుగుతోంది.

వసంత తల తన భుజమ్మీద వాలిపోతోంది.

చంద్రబింబం లాటి దాని ముఖంలో ఎవరూ పూడ్చలేని ఆ లోటు తన గుండెల్ని పిండేస్తోంది.

నిలువునా తనని దహిస్తోంది అనుక్షణమూ.

ఏ పాపం చేసిందని చిట్టితల్లికి ఈ నరకం నిర్దేశించేడా భగవంతుడు ?

ఆడీపాడే వయస్సులోనే ఎంత కష్టం ముంచుకొచ్చింది దీనికి !

పసుపు కుంకుమలతో, పిల్లాపాపలతో నూరేళ్ళు పచ్చగా వర్ధిల్లాల్సిన దీని బ్రతుకు ఎందుకిలా అకాలంగా మోడు బారిపోయింది ?

ఈ అభిశప్త జీవితానికి చివరివరకూ మిగిలేది కన్నీరేనా ??

గోదావరి వంతెనమీద పరుగుతీస్తోంది బస్సు.

చలికి రక్తం గడ్డకట్టుక పోతోంది.

వసంత సన్నగా వణుకుతోంది.

వసంత తలని నెమ్మదిగా తప్పించి షట్టర్ క్రిందికి లాగేడు మృత్యుంజయరావ్.

ఇందుమతికి తెలివ్వొచ్చినట్టుంది.

బద్ధకంగా కళ్లిప్పి భర్తని చూసింది.

"రాజమండ్రి దాటిపోయేమా ?"

"ఇంకాలేదు. పదో పదినిముషా లవుతుం దనుకుంటాను."

"టయిమెంతయింది?"

"పన్నెండు కావడానికింకా పది నిము షాలుంది."

ఇందుమతి వసంత వైపు పరీక్షగా చూసి, స్థానభ్రంశం చెందిన ఆమె పైటని సరిగ్గా సర్దింది.

"అమ్మాయికి నయమవుతుం దంటారా?"

మృత్యుంజయరావ్ జవాబు చెప్పలేదు.

ఇందుమతి గట్టిగా నిట్టూర్చి వెంటనే ఆవలించింది.

సీటుమీద ఒదిగిపోయి, క్షణాల్లోనే నిద్రాదేవి ఒడిలో ఒరిగిపోయింది.

పాలిపోయిన చిర్నవ్వు మృత్యుం జయరావ్ పెదాలపై మెరిసింది.

ఇందుమతి అదృష్టవంతురాలు!!

కాలభేధం లేకనే కోరినప్పుడల్లా నిద్రపోగలదు.

ఎంతమందికా అదృష్టం దక్కు తుంది?

ఎన్ని ట్రాంక్విలైజర్సు మింగితే కళ్లముందు నిద్రమబ్బులు దిగుతాయి తనలాటి వాళ్లకి!

విశ్రాంతికి మరో రూపం నిద్రేనా!?

కూతురి జీవితం కళ్లముందే రాలిపో తున్నా ఇందుమతికి చింతలేదా?

ఛీ....ఛీ....పొరపాటు.

ఇందుమతి గురించి ఇంత వక్రంగా ఎలా ఊహించ గల్గుతున్నాడు తను!

వసంత భవిష్యత్తు పట్ల అందోళన లేనిదైతే తననెందుకు పురికొల్పుతుందీ ప్రయాణానికి?

వసంత జీవితం మళ్లీ చిగురించాలన్న కోరిక బలంగా నాటుకపోవడంచేతనే, తన కిష్టంలేదని తెల్సినా 'అమ్మ' దగ్గరకు ప్రయాణం కట్టించింది.

న్యూరో స్పెషలిస్టుల మందులకి, కరెంటు ట్రీట్‌మెంట్‌కి లొంగని వసంత 'పిచ్చి' అమ్మ మహిమకి లొంగుతుందా దీని పిచ్చిగాని!!

"ఏ పుట్టలో ఏ పామున్నదో, ఏ అమ్మలో ఏ మహాత్యమున్నదో సామాన్య మానవులం, మన మెలా నిర్ణ యించగలం? చెయ్యాల్సినదల్లా మానవ ప్రయత్నం. తర్కించుకోవలసిన సమయం కాదిది. అమ్మ దగ్గరకు అమ్మాయిని తీసికెడితే ఎందుకో నయ మవుతుం దనిపిస్తోంది నాకు, కాదన కండి...."

శతవిధాలా తనని పోరింది.

తండ్రిగా తనెంత రంపపుకోత అనుభవిస్తున్నాడో, తల్లిగా ఆమె అంతకు మించిన ఆవేదనలో క్షణ క్షణమూ నలిగిపోతోంది. అంతంలేని జీవన పోరాటంలో అలసిపోయి నిస్త్రాణ చెందుతోంది.

నిస్త్రాణకి మారు రూపం కూడా నిద్రే కావచ్చునేమో!?

అవును, అంతే కావచ్చు.

ఆలోచనలు తెగిపోయాయి.

మెర్క్యూరీలైట్ల వెలుగులో పట్ట పగల్లా మెరిసిపోతోంది రాజమండ్రి బస్‌స్టేండ్.

రాత్రికీ, పగటికీ భేదం తెలీనట్టు దుకాణాలన్నీ కళ్లు తెరిచే ఉన్నాయి. కూలీల రొదతో ఇందుమతికి మళ్లీ తెలివి వచ్చింది.

వసంత కూడా కళ్లు విప్పింది.

"దాహం వేస్తోందా తల్లీ?"

జవాబు లేదు.

దాని దృష్టి శూన్యాన్ని శోధిస్తోంది.

బాహ్య ప్రపంచంతో ఏ మాత్రమూ సంబంధం లేనట్టు పేలవంగా కనపడుతున్న దాని కళ్లని చూస్తుంటే గుండెల్లోంచి దుఃఖం ఎగదన్నుకొస్తోంది.

మరి కొద్దిసేపట్లో మళ్లీ కదిలింది బస్సు.

ఇంతవరకూ వెలుగు.

ఇకపైన అంతా చీకటి.

జీవితం తీరే అంత!

చీకటి చూడని కళ్లకు వెలుగు విలువ తెలీరాదు.

కష్టం ఎరుగని జీవితాలకి సుఖం ఇచ్చే ఆనందం అర్థమవ్వదు.

కష్టం— సామాన్యమైన కష్టమా??

పూచీ కాచే వయస్సులోనే బ్రతుకునే నిలువునా దహించేస్తున్న కష్టం!!

అప్పగింతలు పెడ్తూ చిన్నపిల్లల్లా కంటతడి పెట్టేరు తామిద్దరూ.

మరో మూడునెలలకి కానీ తెల్సి రాలేదు— తమ జీవితమంతా కన్నీటికే అంకితమయిందని.

పెళ్లిముందు ఇంటికి వేయించిన వెల్ల ఇంకా పాతబడనేలేదు.

కూతురి భవిష్యత్తు వెలవెలబోయింది మూణ్ణెళ్ల కాపురంతోనే. పరవళ్లు త్రొక్కే దాని ఆనందాన్ని సహించలేని విధాత, రెక్కలు విచ్చుకుంటున్న దాన్ని సౌభాగ్యాన్ని నిలువునా నరికిపారేసాడు.

దాని పెళ్లయిన నెలరోజులకే అల్లుడు ప్రొబేషన్ ఆఫీసర్‌గా సెలక్ట్ అయినట్టు అర్డరొచ్చింది.

కలకత్తాలో ట్రయినింగ్.

దాని అదృష్టానికి తామెంత మురిసి పడ్డారని!

మరి రెండు నెలలకి దాని జీవితం ఊహించని మలుపు తిరిగింది.

వడిగా పరిగెత్తే ఎలక్ట్రిక్ ట్రెయిన్ నుండి పట్టుజారి పడిపోయిన అల్లుడి అర్ధాంతరమైన చావుతో దాని నుదుట కుంకుమ బొట్టు చెరిగిపోయింది.

కబురు తెల్సిన వెంటనే దాన్ని పుట్టింటికి తీసికొచ్చారు.

బొట్టు నోచుకోని మొహంతో, గాజు ల్లేని బోడి చేతులతో, చీకటి నిండిన గాజుకళ్లతో జీవచ్ఛవంలా తమ కళ్లెదుట అది తిరుగుతుంటే గుండెలు కరిగి కరిగి కడలిలా మారిపోయాయి.

అగ్నిపర్వాతాలు బ్రద్దలయ్యాయి సాగర గర్భంలో.

భర్త ఆకస్మిక మరణంతో దాని మనసు ఘనీభవించింది.

మస్తిష్కం మొద్దుబారింది.

చైతన్యం అదృశ్యమయింది.

అప్పట్నుండి దాని ముఖాన చిర్నవ్వు పూయలేదు.

స్తబ్దంగా, మౌనంగా కాలంతోపాటే కదలిపోతున్న దాని జీవవాహిని ఎన్ని మలుపులు తిరగబోతోందో, ఏ అగాథంలో ఇంకబోతోందో — 17

ఆర్నెళ్ళ క్రితం—

అకస్మాత్తుగా తెలివి వచ్చింది తనకి.

వసంత బెడ్‌రూమ్ తలుపులు బార్లా తెరిచి ఉన్నాయి.

లోపల లైటు వెలుగు విరజిమ్ముతోంది.

పెట్టెలు జరుపుతున్న చప్పుడు స్పష్టంగా వినబడుతోంది.

అర్ధరాత్రప్పుడు ఇదేం చేస్తున్నట్టు?

లేచి గదిలోకి నడిచేడు తను.

కళ్ళు రెప్పలు వేయడం మర్చిపోయాయి విభ్రాంతితో.

నుదుట కళ్యాణ తిలకంతో, చేతుల నిండుగా రంగురంగుల గాజులతో, కన్యాదానం చేసినప్పటి వంగపువ్వు రంగు పట్టుచీరెతో, తలనిండా కనకాంబరాలతో కాళ్ళకి పసుపుపారాణితో పెళ్ళికూతురిలా అలంకరించుకుంది వసంత.

తన రాకని కూడా గుర్తించలేదు.

చీరెలు, లంగాలు ట్రంకు పెట్టెలో సర్దుకుంటోంది.

ఆ రూపంలో దాన్ని చూస్తుంటే ఇంతవరకూ జరిగిందంతా పీడకలగా మారిపోయి ఉంటే ఎంత బాగుండునని పించింది.

కానీ జీవితం కల కాదు.

కరిగిపోయిన కాలం వెనక్కి మరలి రాదు.

"వసంతా, ఏం చేస్తున్నావమ్మా?"

తనవైపు బేలగా చూసింది.

"పెళ్ళయిన తరువాత ఎన్నాళ్ళని పుట్టింటిలో ఉండేది నాన్నగారూ? ఆయన ఈ పాటికి తిరిగి వచ్చేసి ఉంటారు ట్రెయినింగ్ నుండి. ఆయన్ని విడిచి నేనిక్కడ కూచుంటే ఆయన ఎంత అవస్థపడ్తున్నారో, ఏమో! రిక్షా కేక వేస్తారా నాన్నగారూ- బస్సుకి టయిమయిపోతోంది...."

తల గిర్రున తిరిగింది.

దాని వర్తమానస్థితి అర్థమయ్యేసరికి నిలువెల్లా కంపించింది.

"అమ్మా....వసంతా!!" గుండెల్ని చీల్చుకొచ్చిన కేక.

అప్రయత్నంగా వర్షిస్తున్న కళ్లు.

"ఎందుకు నాన్నగారూ ఏడుస్తారు? దశరాలకి మళ్ళీ వచ్చేస్తాగా! ఇంతకి నేను బయల్దేదుతున్నట్లు ఆయనకి టెలిగ్రామిచ్చేరా?"




"లేదమ్మా, లేదు. రేపు తెల్లారి టెలిగ్రామిస్తాను. ఈ రాత్రికి పడుకోవమ్మా—"

వసంత కళ్ళు తృప్తితో వెలిగేయి.

అది పూర్తిగా నిద్రలో మునిగినదాకా అలానే కూలబడిపోయాడు కుర్చీలో.

మగతతో కళ్ళ మూతలు పడ్డాయి.

మూతపడ్డ కనుల వెనుక మనోహర దృశ్యం.

ఆకసం నుండి ఎగురుకుంటూ వచ్చిన ఏ గంధర్వ రాకుమారుడో తన చేతుల్లోని దండని వసంత మెడలో వేసేడు.

దాని నుదుట కళ్యాణ తిలకమద్ది దగ్గరగా తీసికున్నాడు.

"వీల్లేదు. అది వితంతువు. దానికి మళ్ళీ పెళ్ళాడే అర్హత లేదు. విడిచిపెట్టు, విడిచిపెట్టు...." గొంతు చించుకుంటూ అరుస్తోంది ఇందుమతి.

జాలిగా తల్లివైపు చూస్తోంది వసంత.

తనేం పట్టనట్టు చూస్తున్నాడా ఘట్టాన్ని.

గంధర్వుడు వసంతని నడిపిస్తున్నాడు నెమ్మదిగా.

ఇందుమతి కంగారు పడ్తోంది.

"అడ్డుకోరేమిటండీ, అది లేచిపోతోంది. రేపొద్దున మన పరువేంగానూ: నలుగురికీ ఏమని జవాబు చెప్పను?? వెళ్ళండి, దాన్ని తీసికురండి...." పిచ్చిదానిలా ప్రాధేయపడ్తోంది.

తను రెండడుగులు వేసేడు ఇందుమతి వైపు.

ఇందుమతి కరిగిపోయి స్వరాజ్యం కన్పిస్తోందక్కడ.

"పరుగులిడే జీవవాహినికి అడ్డుతగిలే హక్కు మనకు లేదు రాజ్యం: ప్రాకృతికమైన శారీరక వాంఛల్ని చాదస్తాల

ఇనుప రెక్కల క్రింద ఎందుకని నలుపు కోవాలి? దాటిపోయిన వయసు మళ్లీ మళ్లీ రమ్మంటే రాదు. నా మాట విను, రాజ్యం-మనిద్దరం పెళ్లి చేసుకుందాం-"

"ఒద్దు, ఒద్దు మృత్యుంజయా! ఆయన మరణంతో నా సౌభాగ్యం తుడుచుక పోయింది. మరోసారి పెళ్లికూతురి ముస్తాబు చేసుకోలేను...."

సన్నగా ఏడుపు.

నిద్ర తేలిపోయింది. వసంత మంచంమీద మోకాళ్లలో తల పెట్టుకుని సన్నగా ఏడుస్తోంది.

"వసంతా-ఏమయిందమ్మా?"

వెక్కిళ్ల మధ్య చెబుతోంది, "ఆయన ఆయన నా కోసమని ఎదురుచూస్తున్నారు, రమ్మని పిలుస్తున్నారు. రావడంలేదని అలిగి వెళ్లిపోతున్నారు...."

"లేదమ్మా, అల్లుడెక్కడికీ వెళ్లిపోడు. నేను నచ్చచెప్తాగా! తెల్లారేక నేనే నిన్ను స్వయంగా దిగబెడ్తానమ్మా, పడుకో తల్లీ...."

వసంత నిద్రపోయింది తన అనునయింపుతో.

రెండోరాత్రి-మళ్లీ అదే తతంగం.

మూడో రాత్రి-మార్పులేదు.

అప్పట్నుండి మిగిలినవన్నీ కాళరాత్రులుగానే మిగిలిపోయాయి.

సాయంత్రమవుతూనే గుండెల్లో దడ.

రాత్రంతా కాపలా కాస్తూ కళ్లు ప్రత్తికాయల్లా ఉబ్బిపోయాయి.

వసంత పిచ్చి రానురాను ముదిరిపోయింది. పగటికి ప్రాకింది.

పగలస్తమానం పెళ్లికూతురి ముస్తాబులో వీధి కిటికీవద్ద నిల్చుని రోడ్డమ్మట పోయేవాళ్లలో తన భర్తకోసం ఎతుక్కుంటోంది.

ఈసంగతి కొద్ది కాలంలోనే ఊరంతా ప్రాకిపోయింది.

దాని ఉన్మాదస్థితికి సానుభూతి వ్యక్తంచేస్తున్న స్నేహితులతో ఇల్లు స్మశానవాటికలా మారిపోయింది.

వాళ్ల సానుభూతి తమ గుండెల్లో సెగడు మరింత ముందుకి తోస్తోంది. కాకినాడ మెడికల్ కాలేజి ఆస్పత్రిలో న్యూరో స్పెషలిస్ట్ మందులకి దాని ఉన్మాదం తగ్గలేదు.

షాక్ ట్రీట్మెంట్ చేయించేక ఎదురయిన పరిణామం తమని పిచ్చివాళ్లని చేసింది.

దాని చురుకుతనం అడుగంటింది.

పూర్వంలా అది అలంకరించుకోదు. కిటికీ వద్ద నిలబడదు.

మెదడులో జీవకణాలని నిలువునా కాల్చేసిన కరెంటు దాని గతాన్ని కూడా చెరిపేసింది వాటితోపాటు.

ప్రస్తుతం- అది ఏ రాగమూ పలకని మూగవీణ.

నిశ్శబ్దం.

విస్తృతమైన ప్రళయ నిశ్శబ్దం.



ఏమీ కావాలని అడగదు, ఎవరితోనూ మాట్లాడదు.

గంటల తరబడి ఎక్కడ కూచున్నది అలానే స్తబ్ధంగా ఉండిపోతుంది.

జడత్వం పేరుకుపోయింది దాని అణువణువునా.

దాని మౌనం భరించలేనిది.

అప్పట్లో, ఆ ఉన్మాదంలో చురుకుదనమే మెరుగనిపిస్తోంది వర్తమానం కన్నా.

దాని జీవితం ఇలా ముగియాల్సిందేనా!?

ఇందుమతి ఎవరినోటనో విన్నదాన్ని తనచెవుల్లో వేసింది. శ్రీకాకుళంజిల్లాలో

రాజపురం అనే గ్రామంలో 'అమ్మ' వెలసిందట.

అమ్మ చేతిలో నయమవని రోగమంటూ లేదట.

శారీరక రుగ్మతలని, మానసిక వైపరీత్యాన్ని ఎడంచేత్తో తీసి పారేస్తుందట. 'అమ్మ' దర్శనంకోసం ఇక్కడి నుండి తండోపతండాలుగా వెళ్తున్నారట స్పెషల్ బస్సులో.

ఇందుమతి పోరు భరించలేక మూడు టికెక్కట్లు తీసికున్నాడు. తనకీ అమ్మలన్నా, బాబాలన్నా విశ్వాసం లేదు.

జీవతంలో తీర్చుకోలేని కోరికల అంతరంగ మథనంలో నలిగిపోయి, పలాయనతత్వం నిచ్చెనచేసుకుని పైకెగ్రాకుదామని విఫలప్రయత్నం చేస్తున్న ఈ ఆత్మవంచకులా మరెవరి జీవితాలనో సరిదిద్దగలిగేది !

కడలి గర్భాన తుఫాను తాకిడితి ఒరిగిపోతున్న నౌకలో ప్రయాణం చేస్తున్న ఈ ఈత నేర్వనివాళ్లా మిగిలినవాళ్లని అవతలి ఒడ్డుకి చేర్చగలిగేది !!

ఎంత అజ్ఞానం, ఎంత ఆత్మవంచన!

జనంలో మూఢత్వం వేలంవెఱ్రి వేస్తోంది,

లేని గొప్పదనాన్ని అంటగట్టి తమకన్నా హీనుల్ని, క్షుద్రుల్ని అందలమెక్కిస్తున్నారు. ఆ హీనుల అండదండల్లో తమ బ్రతుకు పుష్పిస్తున్నందనుకుంటున్నారు.

గుడ్డి నమ్మకం.

ఆ నమ్మకపు కవచంలో నిర్భయంగా పయనిస్తున్నారు.

ఇందుమతి ఆ మందలో ఒకతె.

తన ఎంతగా వారించినా వినలేదు.

చివరికి తనూ తలొగ్గక తప్పింది కాదు.

దాని ఫలితం—ఈ ప్రయాణం.

* * *

బస్సు రాజపురం చేరేసరిక్కి పూర్తిగా తెల్లవారిపోయింది. ఊరికి రెండు ఫర్లాంగుల దూరాన తళతళ మెరుస్తోంది ఆశ్రమం తూరుపు వెలుగులో.

కాలకృత్యాలు పూర్తిచేసికొని ఆశ్రమం చేరేసరికి ఎనిమిది గంటలయింది.

అప్పటికే ఆ ప్రాంతం రద్దీగా ఉంది.

జనం నేల ఈనినట్టుగా బారులుతీర్చి ఉన్నారు.

మరి కొద్దిసేపట్లో 'అమ్మ' బయటికి వస్తుందట.

అశేషమైన ఈ భక్తకోటికి దర్శనమిస్తుందట.

బాధగ్రస్తుల్ని వ్యాధిగ్రస్తుల్ని పరామర్శిస్తుందట.

అమ్మ అనుగ్రహంపొందే అదృష్టం కోసం జనం తహతహ లాడిపోతున్నారు.

మృత్యుంజయరావ్, ఇందుమతి, వసంత అందరితో పాటే నిల్చున్నారు.

వెనుక వరసలో బిగ్గరగా మాటలు.

"అమ్మ ఎన్నాళ్ళక్రితం వెల్సిందట ఇక్కడ ?"

"సుమారు ఇరవై ఏళ్లు దాటిందని ఎవరో చెప్పినట్టు గుర్తు. ఇప్పుడిప్పుడే అమ్మ మహాత్మ్యం దేశంలో నలు మూలలకీ ప్రాకుతోంది. ఆ విశ్వజననిని దర్శించుకోవాలని విరగబడి వస్తున్నారు భక్తులు."

"అమ్మ ఉద్భవం వెనుక ఏమైనా చెప్పుకోదగ్గ కథలున్నాయా ? అమ్మకి తనవాళ్లంటూ ఎవరైనా ఉన్నారా ?"

"నదీమూలం, ఋషిమూలం తెల్సుకో కూడదంటారు. అమ్మ గతం ఏమిటో ఎవరికీ తెలియదు. తెల్సినదల్లా ఒక్కటే; అమ్మ తలుచుకుంటే చేయలేని దేమీ లేదని."

మెత్తని మందలింపు.

మరో గొంతు కల్పించుకుంది.

"నేను విన్నదాన్ని కూడా చెప్తు న్నాను. అమ్మ ఎవరో, ఎక్కడి నుండి వచ్చిందో ఎవరికీ తెలియదు. పాతికేళ్ల క్రితం ఈ ప్రాంతం అనావృష్టిపీడితమై దుర్భర కాటకంలో మ్రగ్గిపోయిందట. వర్షం కురవని మేఘాల వైపు ప్రజలు ఆర్తిగా చూసే సమయంలో అమ్మ అవ తరించిందట అమ్మవారి శిథిలాలయం ప్రక్కన. అమ్మ రాకతో మేఘాలు పురి విప్పినట్టు అమృతధారలు వర్షించేయట. అప్పట్నుండి ఇంతవరకూ ఈ ప్రాంతా నికి కరువు, కాటకం లేకుండా పోయా యట...."

"అంత మాత్రాని ఆమెని దైవంగాకే ఆరాధించవలసిందేనా ? యాదృచ్ఛి కంగా వర్షించనమేఘాలు ఆమెని ఉన్న తురాల్ని చేయగలిగేయా ? అమ్మ రాక తోనే అనావృష్టి దూరమవగలిగితే, ఈ దేశంలో ఇంకెన్ని ప్రాంతాలు ఏళ్లతర బడి వర్షానికి నోచుకోలేదు_ అటువంటి ప్రాంతాల్లో కూడా వర్షం కురిపించ గలదా ఈ అమ్మ ??"

"అపచారం నాయనా_ అపచారం ! అమ్మ సన్నిధానంలో కుతర్కాలకు, దుస్సంశయాలకూ తావులేదు. పెద్దపెద్ద డాక్టర్లకి కూడా అంతుబట్టని ఎందరో వ్యాధిగ్రస్థుల్ని కేవలం తన స్పర్శతోనే నయంచేయగల ఆదిశక్తి 'అమ్మ'."

అమ్మ రాకతో వాళ్ల సంభాషణ ఆగి పోయింది.

అందరూ భక్తిపూర్ణతతో చేతులు జోడించేరు.

ఒక్కొక్క వరసనీ దాటుకుంటూ అమ్మ ముందుకి నడుస్తోంది. ఒక చేతిలో త్రిశూలం, మరో చేతిలో అభయ ముద్రిక, నుదుట రూపాయి కాసంత కుంకుమబొట్టు, విరబోసిన కురులు, దేహమంతటా చందనం పూత, ఎరుపు రంగు కంచిపట్టు చీరలో అమ్మ నిజంగా శాంభవిలా ఉంది.

అమ్మ నడుస్తుంటే గజ్జెల మ్రోత శ్రావ్యంగా వినిపిస్తోంది.

మృత్యుంజయరావ్ వద్ద క్షణం ఆగి పరీక్షగా చూసింది అమ్మ.

ముందుకి రెండడుగులు వేసినదల్లా మళ్లీ వెనక్కి తిరిగింది.

మరోసారి వాళ్ల ముందు నిలబడి చేతు లెత్తి దీవించి చరచరా ఆశ్రమంలోకి నడిచింది.

కొద్దిసేపటికి లోపల్నుండి కబురొచ్చింది.

మృత్యుంజయరావ్ కుటుంబాన్ని ఆశ్రమంలోకి తీసికురమ్మని అనుజ్ఞ అయింది.

ఇందుమతి కళ్లు మతాబుల్లా వెలిగి పోయాయి.

మృత్యుంజయరావ్ ఆ శిష్యుడి వెనుక ఆశ్రమ అంతర్భాగానికి నడుస్తుంటే అతని అదృష్టానికి ఒంగిలినవాళ్లు కొద్దిగా అసూయపడ్డారు.

వసంతని జాగ్రత్తగా లోనికి నడిపిస్తోంది ఇందుమతి.

• • •

మృత్యుంజయరావ్ తలదించుక కూచున్నాడు.

వసంత 'అమ్మ' వైపు నిర్నిమేషంగా చూస్తోంది.

ఇందుమతి కన్నీటితో తమ కొచ్చిన కష్టం ఏకరువు పెడ్తోంది.

"ఎన్ని మందులకీ లొంగలేదు. ఆఖరి ఆశగా మీ పాదాలవద్దకి తీసికొచ్చా నీ పిచ్చితల్లిని. మీ అనుగ్రహంతో, ఆశీర్వాదబలంతో దీని బ్రతుకు మళ్లీ చిగురిస్తుందన్న నమ్మకం మమ్మల్ని మీ దర్శనానికి ప్రేరేపించింది."

అమ్మ వసంత వైపు తదేకంగా చూస్తోంది.

వసంత కళ్లు త్రిప్పుకోలేకపోతోంది.

రమ్మనట్టు సైగచేసింది అమ్మ.

మంత్రబద్ధలా వసంత ఆమె వద్దకి నడిచింది.

వసంత నుదుట కుంకుమబొట్టు అలంకరించింది అమ్మ.

ఇందుమతి తత్తరబడింది. వారించ బోయింది.

అడ్డు రావద్దన్నట్టు సైగచేసింది అమ్మ.

"పసుపుకుంకుమలతో నూరేళ్లు వర్ధిల్లవమ్మా !"

వసంత పెదాలపై సన్నని చిర్నవ్వు.

మృత్యుంజయరావ్ తలెత్తి చూసేడు.

ఇందుమతి వైపు చూస్తూ చెప్పుకు పోతోంది అమ్మ.

"పరవళ్లు త్రొక్కే నదీ ప్రవాహం జీవితం. స్వేచ్ఛగా, విశృంఖలంగా పరిగిడడమే దాని ధ్యేయం. దాన్ని అడ్డుకుందామన్న మూర్ఖత్వం చంపుకోవాలి మనం."

ఇందుమతి శ్రద్ధగా ఆలకిస్తోంది.

"వైధవ్యం సమాజ మేర్పరచిన కట్టుబాటు మాత్రమే ! మారే తరాలతో బాటు కట్టుబాట్లు, సంప్రదాయాలు మారిపోతున్నాయి. అది సహజం. జీవితాన్ని శాసించే అధికారం గానీ, నిర్బంధించే హక్కుగానీ మనకు లేవు. ప్రాకృతిక

మైన శారీరక వాంఛల్ని చాదస్తాల ఇనుప రెక్కల క్రింద ఎందుకని నలుపు కోవాలి ?"

మృత్యుంజయరావ్ మనస్సు పొరలు పొరలుగా విడిపోతోంది.

గుండెల్ని చీల్చుకుంటూ లావా ఎగ జిమ్ముతోంది.

"అమ్మాయికి తగిన వరుడు లభిస్తాడు కొద్దిపాటి అన్వేషణతో. ఏ సంఘర్షణకూ లోనుగాక అతని చేతిలో ఆమె జీవితాన్ని పదిలపర్చండి. అన్నీ సవ్యంగా జరుగుతాయి."

ఇందుమతి మొహం దీపంలా వెలిగి పోతోంది.

వసంత పెదాలపై చిర్నవ్వు ఆరలేదు.

మృత్యుంజయరావ్ చివాలున లేచి నిలబడ్డాడు.

అమ్మ లోపలి గదిలోనికి నడిచి పోయింది.

* * *

తన గదిలోకి చేరుతూనే 'అమ్మ' తలుపులు బిగించింది.

త్రిశూలం విసిరేసింది.

రుద్రాక్షమాలలు తీసి పారేసింది.

అలమరా తలుపు తెర్చి సీసా బయటకి తీసింది.

రెండు మాత్రలు గుటుక్కున మింగి గ్లాసెడు నీళ్ళ గటగటా త్రాగింది.

జుత్తు విరబోసుకున్న తన రూపం అద్దంలో వికృతంగా కన్పిస్తోంది. వెక్కిరిస్తున్నట్టున్న ఆ ప్రతిబింబాన్ని చూసి పిచ్చిదానిలా నవ్వుతోంది అమ్మ.

అంతకంతకూ ఆ నవ్వు పెరిగి పోతోంది.

తెరలు తెరలుగా నిండుకుంటోంది గది నిండా.

ప్రతిధ్వనుల నడుమ పూనకం వచ్చినదానిలా ఊగిపోతోంది అమ్మ.

"నీ ప్రేమని తిరస్కరించిన తర్వాత గానీ బ్రతుకంటే ఏమిటో తెలియలేదు. బ్రతుకు అర్థం తెల్సినాకా నీ కోసం నా అన్వేషణ ఫలరహిత మయిపోయింది. చేజేతులా దూరం చేసుకున్న ఆసౌభాగ్యం తిరిగిరాదని తెల్సినాక పిచ్చిదా న్నయ్యేను. ఎటుపోతున్నానో తెలియని స్థితిలో ఇక్కడికి చేరుకున్నాను. ఆ ఉద్విగ్నత, మతిచాంచల్యం నన్నో అమ్మగా మార్చివేసేయి.

అటు కట్టుబాట్లని త్రుంచుకోలేక, ఇటు ప్రాకృతిక వాంఛని అణగద్రొక్క లేకా ఘర్షణలో నలిగిన నా మనస్సు ఈ మార్గమే ఎన్నుకుంది.

పాతికేళ్ళ క్రితం నువ్వు చెప్పిన మాటలే ఈనాడు నీ కూతురికి నేను చెప్ప వలసి రావడం ఎంత విషాద వాస్తవం!!

నే ననుభవిస్తున్న ఈ నరకం ఇంకె వ్వరికీ సంభవించకూడదు. ప్రకృతికి వైధవ్యం లేనట్టే స్త్రీకి కూడా వైధవ్యం లేదు, ఉండకూడదు.

వసంత జీవితం మళ్ళీ చిగురించాలి.

అంతే మృత్యుంజయా నేను కోరు కునేది—అంతే !!"

మంచం మీద అడ్డంగా వాలిపోయింది 'అమ్మ.'

---



# చీకటిబాటున సత్యం

పాలకూర సీతాలత

చేతిలో సూట్‌కేస్‌తో స్టేషన్ బైటకు రాగానే ఆటోవాళ్ళు నా చుట్టూమూగారు, బెల్లంచుట్టూచేరే ఈగల్లాగ. వాళ్ళందర్నీ తప్పించుకుని మామూలురిక్షాలో బయలుదేరాను సత్యం ఇంటికి. స్టేషన్‌కు వాళ్ళ ఇల్లు దగ్గరే అని వాడు రాశాడు మరి.

అప్పుడే తెల్లవారడంవల్ల కాబోలు రోడ్లమీద ఇంకా అంతగా ట్రాఫిక్ లేదు. బజార్లో కొట్లన్నీ మూతపడేవున్నాయి. సత్యం ఎనిమిది గంటలకు ఫ్యాక్టరీకి వెళ్ళిపోతాడు. అంతకు ముందే నేను ఇల్లు చేరుకునేలా ఈ ట్రెయిన్లో ప్రయాణం పెట్టుకున్నాను.

రిక్షా ముందుకు సాగుతుంటే నా ఆలోచనలు వెనక్కి గతంలోకి వెళ్ళాయి. సత్యంతో నా పరిచయం ఆరేళ్ళనాటిది. నేను ఇంజనీరింగ్ కాలేజీలో చేరేసరికి సత్యం అందులోనే మూడో సంవత్సరం చదువుతున్నాడు. ఇద్దరం ఒక ఊరివాళ్ళమే. నేను కాలేజీలో చేరడానికి వెళ్తున్నప్పుడు సత్యంవాళ్ళ నాన్నగారు సత్యం పేర ఒక ఉత్తరం ఇచ్చి నన్ను అతన్ని కల్సుకోమన్నారు. నాకు కావల్సిన సహాయం అతను చేస్తాడని చెప్పారు.

ఇంజనీరింగ్, మెడికల్ కాలేజీలలో కొత్తగా చేరిన విద్యార్థులని సీనియర్స్

ఏడ్పించే 'రాగింగ్' అనే పద్ధతి ఒక టుంది. నేను దానికి గురికాకుండా సత్యం కాపాడాడు. బెదిరిపోతున్న నాకు ధైర్యం చెప్పాడు. నన్ను తనతోపాటు అతని హాస్టల్ రూంలో వుంచుకున్నాడు. ఈ 'రాగింగ్' పూర్తిఅయ్యాకనే నేను నా హాస్టల్‌కు వచ్చాను. సత్యం చాలా తెలివైన విద్యార్థి. చదువులోను, ఆటల్లోనూ కూడా ముందు వుండేవాడు. నాకు అర్థంకాని పాఠాలు బోధిస్తూ వుండేవాడు. సత్యంతో పరిచయం కావడం నా అదృష్టంగా భావించేవాడిని. ఇద్దరం ఒక బ్యాచివాళ్లం కాకపోయినా ఇద్దరం కలిసే సాయంత్రాలు గడపడం, సినిమాలు చూడటం, ఒకే మెస్సులో కల్సి భోజనం చెయ్యడం-చూస్తూండే వాళ్లం.

అతని చదువు పూర్తికావడంతో అతను వెళ్లిపోయాడు. నిజంగానే నేను చాలా బాధపడ్డాను. కానీ, చెయ్యగలిగేది ఏముంది? అతవి అదృష్టం కొద్దీ కెంపరరీదే అయినా వైజాగ్‌లో ఉద్యోగం దొరికింది. ఆ తర్వాత ఏడాదికి ఆ ఉద్యోగం వదిలేసి ఈ ఊరు వచ్చేశాడు. అసిస్టెంట్ ఇంజనీర్‌గా మంచి ఉద్యోగం దొరకడంతో అతను ఇక్కడకు వచ్చి రెండేళ్లు అయింది.

కాలేజీ విడిచిపెట్టాక అతన్ని నేను కలుసుకోకపోయినా, మా ఇద్దరి మధ్య ఉత్తరాలు నడుస్తుండటంవల్ల అతని వివరాలు నాకు తెలుసు.

నేను ఇంజనీరింగ్ ప్యాసయ్యి ఏడాది అయింది. అయినా ఇంతవరకూ ఉద్యోగం సంపాదించుకోలేకపోయాను. ఇప్పుడు ఈ ఊరు రావడం కూడా అందు కోసమే. ఒక ఇంటర్వ్యూ అటెండు కావడం కోసం.

ఈ ఇంటర్వ్యూ గురించి సత్యంకి రాశాను. కనీసం ఒక రెండు రోజులు ఎక్కువగా వుండేలా రమ్మనీ, ఈ రకంగానైనా నన్ను చూసే అవకాశం కల్గినందుకు సంతోషం అనీ రాశాడు. వాడితోను మరో రోజు గడపాలనే ఉద్దేశ్యంతో ఇంటర్వ్యూ రేపు అయినా, ఈ రోజే వచ్చి చేరాను.

రిక్షా ఆగడంతో నా ఆలోచనలూ ఆగిపోయాయి. రిక్షావాడిని పంపి ఇంటి నంబరు చూసి తలుపు తట్టాను. మరో సారి తలుపుమీద చప్పుడు చేశాక తలుపు తెరుచుకుంది. కానీ.... ఎదురుగా ఓ అమ్మాయి.

ఆ అమ్మాయిని చూసి ఆశ్చర్య పోయాను. అది సత్యం ఇల్లా, కాదా అని సందేహంతో తలుపుమీది నేమ్ ప్లేట్ మరోసారి చూశాను. సందేహం లేదు. అది సత్యం ఇల్లే. అయితే ఈమె ఎవరు? నాకు తెల్సినంతవరకూ సత్యంకి ఇంకా పెళ్లికాలేదు. ఆ అమ్మాయివైపు చూశాను. అందంగా దిద్ది తీర్చిన ముఖం. ఆకర్షణీయమైన కళ్లు. తెల్లని రంగు. అయిదున్నర అడుగుల పొడవు,

సుమారుగా. అప్పటిదాకా పనిపాటల్లో తేలి వున్నట్లు జడనే ముడిగా మార్చుకుంది. అయినా కొన్ని ముంగురులు ముఖంని ముద్దాడుతున్నాయి.

"అలా నిలబడిపోయి ఏమిటి ఆలోచిస్తున్నావు కౌండిన్యా?" అంది ఆమె.

ఆశ్చర్యపోయాను. ఆమెకు నా పేరు ఎలా తెల్సిందా అని.

"ముందు లోపలకు రా! తర్వాత ఆలోచించవచ్చు." అంటూ నేను లోపలకు వెళ్ళడానికి దారి ఇచ్చింది.

లోపలకు నడిచాను.

"అన్నయ్య స్నానం చేస్తున్నాడు. కూర్చో కాఫీ ఇస్తానుండు నిన్ను ఏకవచనంలో సంభోదిస్తున్నందుకు ఆశ్చర్యపడుతున్నావు కదూ... నన్ను గుర్తించలేదు కదూ!.. నేను.. మృదులను" అంది ఆమె.

అప్పటికి అర్థం అయింది. మృదుల సత్యం చెల్లెలు. అమెను చూసి కూడా నాలుగేళ్లు కావటంతో అమెను గుర్తించలేకపోయాను. పైగా పొంగివచ్చిన యవ్వనం కూడా అమెలో మార్పు తెచ్చింది. ఆమెను నేను ఈ మధ్య చూడకపోయినా ఆమె గురించి ప్రతి ఉత్తరంలోనూ సత్యంని అడుగుతుండే వాడిని. ఆ చనువుతోనే నన్ను అలా పలుకరించింది. అమె ప్రస్తుతం బి.ఏ. పూర్తిచేసి ఖాళీగా వుంటోందని విన్నాను. అన్నగార్ని చూడ్డానికి బహుశా ఇక్కడకి వచ్చిందేమో!

ఇంతలో సత్యం వచ్చాడు. నా చేతిలో చెయ్యి వేస్తూ 'ఎన్నాళ్ళకు ఎన్నాళ్ళకు?...' అన్నాడు. ఆప్యాయంగా కుశల ప్రశ్నలు వేశాడు. ఇంతలో కాఫీ తెచ్చింది మృదుల.

"మృదులను గుర్తించావు కదూ! నాకు తోడుగా వుంటుందని ఇక్కడకు పిలిపించాను. అందువల్ల హోటల్ కూడు తినే ఖర్మ కూడా తప్పింది..." అన్నాడు.

ఆ తర్వాత ఫ్యాక్టరీకి వెళ్ళడానికి తయారయ్యాడు.

"భోజనం చేసి విశ్రాంతి తీసుకో. సాయంత్రం అలా ఫ్యాక్టరీవైపు రా. ఇద్దరం కాస్సేపు తిరిగివద్దాం. నువ్వొచ్చినందుకు వెళ్ళకూడదనుకున్నా అర్జంటు పని వుండటంతో తప్పలేదు.." అన్నాడు.

"భలేవాడివి! డ్యూటీ మానెయ్యడం ఎందుకు? నువ్వు వెళ్ళు..." అన్నాను. ఆ తర్వాత సత్యం వెళ్ళిపోయాడు.

స్నానం చెయ్యడానికి వేడినీళ్ళు ఇచ్చింది మృదుల. ప్రయాణంలోని అలసట అంతా ఎగిరిపోయింది స్నానం చెయ్యడంతో. ఆ తర్వాత ఆమె పెట్టిన టిఫిన్ తిన్నాను. అంతసేపూ మృదుల మా యింట్లో వాళ్ళ క్షేమసమాచారాలు అడిగింది. నా ఉద్యోగ ప్రయత్నాల గురించి అడిగింది.

బట్టలు మార్చుకుని అక్కడికి దగ్గర్లోవున్న బజారు రోడ్లు సర్వేచేసి తిరిగి పదకొండు గంటల ప్రాంతంలో ఇల్లు చేరాను. ఆమె వడ్డించిన భోజనం చేశాను. ఆ తర్వాత హాల్లోనే మడత మంచం వాల్చి పడుకోమంది. రాత్రి సరిగా నిద్రలేదేమో గాఢంగా నిద్ర పోయాను.

నిద్ర లేచేసరికి నాలుగయ్యింది. ముఖం కడుక్కొని బట్టలు మార్చుకునే సరికి మృదుల 'టీ' కప్పుతో సాక్షాత్కరించింది. ఆమె ఎంతో శ్రద్ధగా ఈ పన్లు అన్నీ చేస్తుంటే కన్నతల్లి గుర్తు రాక మానదు.

"చాలా థాంక్స్ మృదులా! నా కోసం చాలా శ్రమ తీసుకుంటున్నావు..." అన్నాను.

"నువ్వేదో పరాయివాడివి అయినట్లు అదేం మాట? అయినా ఇందులో శ్రమ ఏముంది? నీకోసం ప్రత్యేకంగా ఏమీ చెయ్యటంలేదు కదా! మాతోపాటే నువ్వూను..." అంది సన్నగా నవ్వుతూ.

ఎంత అందంగా నవ్వింది!! ఈమెను కట్టుకోబోయేవాడు ఎవరో కానీ అదృష్ట వంతుడే.

వెళ్తానని చెప్పి బైటపడ్డాను.

సత్యం ఇచ్చిన చిరునామా పట్టుకుని వెతుక్కుంటూ వెళ్లాను.

వాడు పనిచేస్తున్న ఫ్యాక్టరీ చాలా పెద్దది. చాలా బిజీగా వున్నాడు. ఆరు గంటలదాకా వాడి పని తెమలలేదు.

"ఇదంతా ఓ పెద్ద మెస్. నేను కల్పించుకోనిదే ఏదీ కాదు. అర్ధరాత్రి మా ఇంట్లో ఫోను మ్రోగితే అది ఫ్యాక్టరీ నుంచి అనే అర్థం. నైట్ షిఫ్టులో ఏదో చెడిపోయిందనే అనుకోవాలి. అందుకే రాత్రిపూట మ్రోగే ఫోను అంటే భయం నాకు...." అన్నాడు.

ఆ తర్వాత ఇద్దరం కాస్సేపు బజార్లు సర్వే చేశాం. ఒకరిద్దరు స్నేహితుల ఇంటికికూడా తీసుకెళ్లి పరిచయంచేశాడు. రాత్రి ఇల్లు చేరేసరికి ఎనిమిది అయింది. భోజనాలు చేశాక పదకొండు గంటల దాకా హస్కుకొడుతూ కాలం గడిపాం. నేను నా నిరుద్యోగపు అనుభవాలు, వాడు తన ఉద్యోగపు అనుభవాలూ చెప్పుకున్నాం. ఆ తర్వాత కాస్సేపు మా కామన్ ఫ్రెండ్స్ గురించి మాట్లాడుకున్నాం.

అప్పటికే మృదుల లోపల గదిలో నిద్రపోతోంది. సత్యం కూడా వెళ్లి పోయాడు పడుకుందుకు. నేను హాల్లోనే మంచంమీద పడుకున్నాను.

ఆ రాత్రి నిద్రలో వుండగా లీలగా మెళకువ వచ్చింది. సన్నగా ఏవో కబుర్లు విన్పించాయి. అది కలో, నిజమో కూడా తెలియని స్థితిలో వుండిపోయాను. కళ్లు విప్పుదామన్నా రెప్పలు లేవలేదు. వీధి తలుపు తీసిన చప్పుడు, ఆ తర్వాత వేసిన చప్పుడు. వీధి మెట్లమీద అడుగుల సవ్వడి - సన్నగా విన్పించాయి. అది బహుశా కలకావచ్చు అనుకున్నాను.

మరి కాస్సేపటికి దాహంవేసి మెళకువ వచ్చింది. లేచి కూర్చున్నాను. మధ్య గదిలో లైటు వెలుగుతూ కన్పించింది. రాత్రి పడుకునే ముందు సత్యం ఆ లైటు ఆర్పడం నాకు బాగా గుర్తు. మళ్ళీ ఎవరు వేసి వుంటారు? లోపలకు తొంగి చూశాను. ఏ రకమైన అలికిడీ లేదు. హాల్లో నా కోసం ప్రత్యేకంగా మంచినీళ్ళ పెట్టలేదు. కనుక దాహం తీర్చుకుందుకు సత్యం గదిలోకో, వంటింట్లోకో వెళ్లాలి. అనవసరంగా ఇప్పుడు మృదుల నిద్ర పాడుచెయ్యడం ఎందుకు? అందుకే లోపలకు నడిచాను.

వంటింట్లోకి వెళ్ళబోతూ సత్యం పడుకునే గది కర్టెను తలుపు పైకి వేసి వుండటంతో అప్రయత్నంగా లోపలకు చూశాను.... ఆశ్చర్యం....గదిలో రెండు మంచాలూ ఖాళీగా వున్నాయి. మృదుల గానీ, సత్యంగానీ కన్పించలేదు. అంత వరకూ మంచంమీద నిద్రపోయినట్లుగా కొద్దిగా నలిగిన పక్క, కాళ్ల వైపు కుప్పగా పడివున్న దుప్పట్లు సాక్ష్యం ఇచ్చాయి. అయితే మరి వాళ్లు ఏరీ? ఇంతరాత్రివేళ ఎక్కడకు వెళ్లివుంటారు?

ఇందాకా నాకు విన్పించిన శబ్దాలు కలలోవి కాదు అన్పించింది. దాహం విషయం మర్చిపోయి గబగబా వీధి తలుపు దగ్గరకు వెళ్లాను. ఆ తలుపు గడియ రాత్రి నేనే వేశాను. ఇప్పుడది తెరిచి వుంది. తలుపు లోపలకు లాగాను. రాలేదు. అంటే....? బైట వైపు గడియ పెట్టి వుండాలి. లేదా తాళంవేసి వుండాలి.

అంటే అర్థం? అన్నా చెల్లెళ్ల ఇద్దరూ ఇంట్లో లేరు. బైట తాళంపెట్టుకుని ఈ రాత్రివేళ ఎక్కడికో వెళ్లారు. అయితే నన్ను లేపలేదేం?

ఇంత రాత్రివేళ వీళ్లకు బైటకు వెళ్లవల్సిన పని ఏమిటి?

నేను నిద్రపోతున్నాను కనుక లేపడం ఎందుకని అనుకున్నారో లేక ఈ విషయం నాకు తెలియకూడదని అనుకున్నారో తెలియదు కానీ నన్ను లేపి తలుపులేసుకోమని చెప్పకుండా బైటనే తాళం వేసుకుని వెళ్లారు.

బహుశా తెల్లవారేలోగానే వాళ్ళు తిరిగి రావచ్చు. ఆ తిరిగిరావడం నాకు తెలియాలి. అందుకే వీధి తలుపును లోపల గడియవేశాను. తాళం తీసినా తలుపు రాదు కనుక లోపలిగడియ తియ్యడంకోసం నన్ను లేపితీరాలి వాళ్లు.

ఆ తర్వాత మంచినీళ్ళు తాగి నిద్ర పోయాను.

ఎవరో తలుపు కొడుతున్న చప్పుడు అయ్యింది. లేచి కిటికీలోంచి చూశాను. వెలుగు వచ్చేసింది. టైము ఆరున్నర అయ్యింది. బద్ధకంగా ఒళ్ళు విరుచుకుని తలుపు తీశాను. గుమ్మందగ్గర చేతిలో తాళంకప్ప పట్టుకుని మృదుల నిలబడి వుంది. సత్యం జాడలేదు. ఆమె ముఖం కూడా అప్పుడే నిద్రలేచినదానిలా వుంది.




ఏం మాట్లాడడానికీ అది సమయం కాదని మళ్ళీ వెళ్ళి పడుకున్నాను. మృదుల లోపలకు వెళ్ళిపోయింది.

ఏడున్నర అవుతుండగా లేచి ముఖం కడుక్కున్నాను. కాఫీ తెచ్చింది మృదుల. మాట్లాడకుండా తాగేశాను.

"స్నానానికి నీళ్ళు రెడీగా వున్నాయి" అంది.

స్నానం చేసి వచ్చేసరికి టిఫిన్ పెట్టింది. అది తిని రెండో రౌండు కాఫీ తాగాను. పదిగంటలకు ఇంటర్వ్యూ. తొమ్మిదికయినా బయలుదేరాలి.

"మృదులా! నిన్నో విషయం అడగనా?" అన్నాను.

"నిన్న రాత్రి మేం బైటకు వెళ్లడం గురించేనా?" అంది మృదుల కొంచెం చిన్నతనంగా.

అవునన్నట్లుగా తల వూపాను.

"అయితే చెప్తాను విను...." అంది.

ఆమె చెప్పడం ప్రారంభించింది.

* * *

ఆ రాత్రి సుమారు ఒంటిగంట ప్రాంతంలో సత్యానికి ఫ్యాక్టరీనుంచి ఫోను వచ్చింది. ఏదో మిషను పాడైనందుకు ప్రొడక్షన్ ఆగిపోయింది. సత్యం వెంటనే ఫ్యాక్టరీకి వెళ్లాలి.

బట్టలు మార్చుకున్నాడు సత్యం. మృదులను లేపాడు.

"నేను అత్యవసరంగా ఫ్యాక్టరీకి వెళ్తున్నాను...." అన్నాడు.

"సరే... వెళ్లు...."అంది బద్ధకంగా మృదుల మంచంమీదే అటుపక్కకు తిరిగి పడుకుంటూ.

"ఎలా వెళ్లను?" అడిగేడు.

"ఏం? సూ్కటర్ వుందిగా...."
అంది మృదుల తేలిగ్గా.

"ఇంట్లో నువ్వు ఒక్కతివీ వున్నా ఇలాగే వదిలేసి వెళ్ళేవాడిని. కానీ హాల్లో ఇప్పుడో పరాయి మగవాడు వున్నాడు. మీ ఇద్దర్నీ ఈ రాత్రివేళ వదిలి" నణిగేడు సత్యం.

ఆశ్చర్యంగా కళ్ళు విప్పింది మృదుల. ఆమె నిద్ర అంతా ఆ మాటలకు ఎగిరిపోయింది.

"అంటే నీ ఉద్దేశ్యం? నేనంత నీచమైన.. "

"నీ గురించి కాదు....".

"అయితే కౌండిన్య అంత నీచమైన ......"

"అతని గురించి కాదు...."

"మరి...."

"లోకం గురించి. వయసులో వున్న మీ ఇద్దర్నీ ఇలా రాత్రిపూట వంటరిగా వదిలినట్లు తెలిస్తే...."

"ఎలా తెలుస్తుంది?...."

"ఏమో!...."

"అయితే ఏమంటావు? నేను కూడా నీతో ఫ్యాక్టరీకి రానా?" కోపంగా అంది.

"అక్కర్లేదు. బైట తాళం పెడదాం. నిన్ను పక్కింటి పార్వతమ్మ గారింట్లో వదిలేస్తాను. అక్కడే పడుకో. తెల్లవారాక తాళం తీసుకుని రా."

"ఈ విషయం కౌండిన్యకు తెలిస్తే..?"

"తెలియదు. వాడిది మొద్దునిద్ర. ఆ విషయం నాకు తెలుసు. వాడు లేచే అవకాశం లేదు. వాడు నిద్ర లేచేలోగానే నువ్వు వచ్చేస్తావు. ఇంకెలా తెలుస్తుంది?"

"ఈ పద్ధతి నాకైతే ఏం నచ్చలేదు. నామీదా, అతనిమీదా నీకు నమ్మకం లేక పోవడమే దీనికి కారణం అని అనుకోవల్సి వస్తోంది...."

"నువ్వు ఏమైనా అనుకో మృదులా, నేను చెప్పినట్లు జరగవల్సిందే. ఆలస్యం చెయ్యకుండా త్వరగా బయల్దేరు. నేను అర్జంటుగా వెళ్లాలి మరి...."

మృదుల ఇంక మరేమీ మాట్లాడలేక పోయింది. గుండెల్లోంచి అభిమానం పొంగివస్తున్నా అన్నగారిని ఎదిరించే ధైర్యం లేకపోయింది.

'మనసులో ఎలాంటి దురభిప్రాయమూ లేకపోయినా ఏ సంబంధమూ లేని ఒక అమ్మాయి, ఒక అబ్బాయి కల్సి వుండడానికి లోకం ఒప్పుకోదు కాబోలు' అనుకుంది.

'అన్నయ్య భయంలో నిజం వుందా? జరగకూడనిది జరిగే అవకాశం వుందా? కౌండిన్యను చూస్తే మర్యాదస్తుడిలాగ, పెద్దమనిషిలాగ అన్పిస్తున్నాడు. అతన్ని ఇంత నీచంగా తలపోయడం ఎంత వరకు సబబు?'

"త్వరగా బయల్దేరు మరి!........" మరోసారి తొందరపెట్టాడు సత్యం.

ఇక తప్పదన్నట్లుగా లేచి బయలు దేరింది మృదుల.

ఇద్దరూ తలుపుబైట తాళం పెట్టేక, పార్వతమ్మగారిని లేపారు.

సంగతంతా విని ఆవిడ అంది—

"నిజమే బాబూ! మంచిపని చేశావు. ఆమె ఈ రాత్రికి ఇక్కడే పడు కుంటుందిలే. పరాయి మగాడు ఇంట్లో వుండగా ఆమె ఎలా పడుకోగలదు?.... నువ్వు వెళ్లిరా బాబూ...."

ఆ తర్వాత స్కూటరెక్కి వెళ్ళి పోయాడు సత్యం.

* * *

సంగతంతా విన్నాక నాలో ఎక్కడ లేని అభిమానమూ పొడుచుకొచ్చింది. నన్నింత నీచంగా ఎలా జమకట్టకలిగేడు సత్యం?

ఇన్ని సంవత్సరాల స్నేహంలో అతను నా ప్రవర్తనని సరిగా అర్థం చేసుకోలేకపోయాడా?

"ఏది ఏమైనా జరిగినదానికి నేను చాలా సిగ్గుపడుతున్నాను. మా అన్నయ్య తరపున క్షమార్పణలు కోరుతున్నాను...." అంది మృదుల.

"ఫర్వాలేదులే! ఈ విషయం నాకు తెలియదనే నమ్మకంతోటే సత్యం వున్నాడు కనుక నాకు ఈ విషయం తెల్సిందన్నట్లుగా నువ్వు అతనికి చెప్పకు. నాకు ఏమీ తెలియదనే అతన్ని అనుకోనీ...." అన్నాను.

ఇంటర్వ్యూ లెటర్, ఇతర సర్టిఫికెట్లు సర్దుకుని బయల్దేరబోతుండగా సత్యం వచ్చాడు.

"బయల్దేరుతున్నావన్న మాట. గుడ్.... విష్ యు బెస్టాఫ్ లక్...." అన్నాడు.

"థాంక్స్.... అన్నట్లు ఇప్పుడు నువ్వు మళ్లీ వెళ్లాలా?" అన్నాను.

"ఇప్పుడు వెళ్లను. ఇప్పుడు కాస్సేపు నిద్రపోతాను. మధ్యాహ్నం భోజనం చేసి వెళ్తాను." అన్నాడు.

అతనితో చెప్పి వెళ్లబోతుంటే అన్నగారికి కాఫీ తెచ్చి ఇచ్చిన మృదుల వెనకనుంచి—

"బెస్టాఫ్‌లక్..." అంది చిర్నవ్వుతో.

"థాంక్స్ వెరీమచ్.... మీ నోటి చలువ వల్లనైనా ఈ ఉద్యోగం వస్తే..."

"ఊఁ! .... వస్తే?" రెట్టించి అడిగింది.

"మీకు ఋణపడి వుంటాను...." అన్నాను.

"భలే చెప్పావు...."

బైటకొచ్చి ఆటో ఎక్కాను.

ఇంటర్వ్యూ తతంగం మామూలుగానే ముగిసింది.

చెయ్యవల్సిన పనికి ఏమాత్రమూ సంబంధించని ప్రశ్నలు అడిగారు.

అమెరికా విదేశాంగ మంత్రి ఎవరో చెప్పమన్నారు. బీహారు ముఖ్యమంత్రి ఎవరని అడిగారు. ఇరాన్‌లో అల్లర్ల

గురించి ప్రశ్నించారు. ఆ తర్వాత ఇంజనీరింగ్‌కు సంబంధించిన రెండు ప్రశ్నలు వేశారు. అపైన ఇక వెళ్ల మన్నారు.

ఆ ఉద్యోగం వస్తుందన్న నమ్మకం లేకపోయింది.

ఇల్లు చేరేసరికి టైము రెండు దాటింది.

భోజనం చేసి సూట్‌కేస్ సర్దుకో సాగాను. అది చూసి మృదుల అడిగింది.

"అదేం? అప్పుడే వెళ్లిపోదామనే?"

"అవును."

"రెండు మూడు రోజులపాటు నువ్వు వుంటావని చెప్పాడు అన్నయ్య."

"నేనూ వుండాలనే అనుకున్నాను."

"మరి."

"ఏంలేదు. మిమ్మల్నందర్నీ ఇబ్బంది పెట్టడం ఇష్టంలేక. మళ్లా ఈ రోజు రాత్రి కూడా సత్యం ఫ్యాక్టరీకి వెళ్లవల్సి వస్తే, నువ్వు మరొకరి ఇంట్లో పడుకునే శ్రమ నీకు ఇయ్యకూడదని." అన్నాను ఆమె ముఖంలోకి చూస్తూ.

"కొండిన్యా." అంది బాధగా. దెబ్బ తిన్నట్లు చూసింది.

"ఫర్వా లేదు. డోంట్వర్రీ... సాయంత్రం నాకు ట్రెయినుంది. ఫ్యాక్టరీకి వెళ్లి సత్యాన్ని కలిసి అట్నుంచి వెళ్లిపోతాను."

ఆమె మరేం మాట్లాడలేదు.

ఆమెకు వెళ్తున్నానని చెప్పి సూట్‌కేస్‌తో బైటపడ్డాను. సత్యాన్ని కలిశాను. మరో రెండు రోజులు వుండమన్నాడు.

"సారీరా। నువ్వేం అనుకోకు. మా ఫాదర్‌కి వంట్లో బాగోలేదు. వెంటనే వెళ్లిపోవచ్చునని వచ్చాను. ముందసలు ఇంటర్వ్యూకే రావద్దనుకున్నాను కానీ అవకాశం ఎందుకు వదులుకోవాలని వచ్చాను." అంటూ అబద్ధం ఆడేను.

ఇంకేం అభ్యంతరం చెప్పలేదు.

"వెళ్లగానే మీ నాన్నగారు ఎలా వున్నారో తెల్పుతూ ఉత్తరం రాయి." అన్నాడు.

సరేనని వచ్చేశాను.

* * *

మూడు నెలలు గడిచాయి. నాకే ఆశ్చర్యం కలిగేలా నాకు ఉద్యోగం ఇచ్చారు కంపెనీవాళ్లు. పోస్టింగ్ కూడా సత్యం వుంటున్న ఊళ్లోనే.

అప్పాయింట్‌మెంట్ ఆర్డర్ చూసుకుని మురిసిపోయాను.

ఆ తర్వాత మరో నెలకి ఉద్యోగంలో చేరిపోయాను.

కొత్తలో ఒక వారం రోజులు సత్యంతోపాటే ఉన్నాను. మృదుల వాళ్లింటికి వెళ్లిపోవడంతో సత్యం ఒక్కడే వుంటున్నాడు. అందుకే వారం రోజులైనా వాడితో వున్నాను.

తనతోటే వుండిపొమ్మనాడు కానీ కంపెనీకి దూరం అవుతుందని నచ్చచెప్పి వేరే పోర్షన్ తీసుకున్నాను.

విడివిడిగా వుంటున్నా మేం ఇద్దరం తరుచు కల్సుకుంటూనే వున్నాం.

కలవు .వచ్చిందంటే వాడు ఇటు వచ్చెయ్యడమో, నేను అటు వెళ్లడమో చేస్తున్నాం. కలిసే సినిమాలు చూస్తున్నాం.

అలాగే మరో నాల్గు నెలలు గడిచి పోయాయి.

ఒకరోజు ఆదివారంనాడు ఉదయమే నా దగ్గరకు వచ్చాడు సత్యం.

"ఒరేయ్ ! మా మృదుల మీద నీ అభిప్రాయం ఏమిటి ?" అడిగేడు.

ఇప్పుడీ ప్రశ్న ఎందుకు వేస్తున్నాడో అర్థం చేసుకోలేక పోయాను.

సిన్సియర్‌గా జవాబు చెప్పాను.

"మృదుల కేంరా ? ఏ మాత్రమూ వంక చూపించలేం ఆమెకి. అమ్మాయి రూపసి. అందుకు తగ్గ చదువు వున్నది. దానికి తోడుగా సంస్కారం కలది. బుద్ధిమంతురాలు. చక్కని చుక్క. ఆమెను పెళ్లాడబోయేవాడు ఎవడో కానీ లక్కీ ఫెలో "

ఆ కామెంటుకి సత్యం ఎంతో సంబర పడిపోతున్నట్లు అతని ముఖమే చెప్పింది.

"ఆ లక్కీ ఫెలోవి నీవే ఎందుకు కాకూడదు ?" అడిగేడు.

రెండు నిముషాలు నాకు నోట మాట రాలేదు. ఆశ్చర్యంతో చూస్తూ వుండి పోయాను. నిజానికి ఇది ఒక గొప్ప ఆఫర్. మృదులలాంటి అందమైన యువతి భార్య అవుతుందంటే ఎగిరి గంతు వెయ్యవల్సిన మాట. కట్నం సంగతి మర్చిపోయి ఎదురు కట్నం పిల్లకే ఇచ్చుకోవల్సిన మాట. ఆ అందానికి శాశ్వతంగా బానిసనై పడివుంటానని ఆ అమ్మాయికి ప్రోనోటు మీద రాసి ఇయ్యాల్సిన మాట.

కానీ ఇదంతా నా విషయంలో కాదు. కారణం ఆ రోజు రాత్రి జరిగిన సంఘటన. అందుకే నేను ఎగిరి గంతూ వెయ్యలేదు, పంకలు గుద్దుకోనూలేదు.

"ఆమె గురించి ఇంత చక్కని అభిప్రాయం చెప్పిన వాడివి ఏమిటిలా ఆలోచిస్తున్నావు ? " అడిగేడు.

"నేనీ ఊరు ఇంటర్వ్యూ కోసం వచ్చినప్పుడు రాత్రిపూట నువ్వు ఫ్యాక్టరీకి వెళ్తూ మృదులని పక్క వారింట్లో పడుకోబెట్టావు. గుర్తుందా ?" అన్నాను.

దెబ్బ తిన్నట్లు చూశాడు సత్యం.

"ఆ విషయం నాకు తెలియదని ఇన్నాళ్లూ అనుకున్నావు కానీ ఆ విషయం అప్పుడే తెల్సు నాకు "

"అయితే ఏమిటంటావు ?" అన్నాడు కొంచెం అసహనంగా.

"చెప్తాను. అందుకు కారణం నీకు నా మీద నమ్మకంలేకనే అని నేనంటాను. నాతో ఇంత పరిచయం వుండి, నా గురించి ఇంతగా తెల్సిన నువ్వు నామీద ఇంత అపనమ్మకం కలిగివుండటం బాధ అన్పించింది. అందమైన అమ్మాయి అందుబాటులో వుండగానే నేను ఆమెకు అన్యాయం చేస్తానని నీ భయం. మృదుల

నీకు చెల్లెలు కావచ్చు కానీ ఆమెను నేను అంతకంటె ఎక్కువగా గౌరవిస్తాను. ఆ రోజు రాత్రి నిజానికి మృదుల మనసే చంచలమయ్యి తనతో పొందుకోసం నన్ను ఆహ్వానించినా ఆమెను వారించి తప్పు జరగకుండా చూసేంతటి మనో నిబ్బరం నాలో వుంది. ఆ నిబ్బరం నాలో వుందనీ, వుంటుందనీ నువ్వు ఊహించ లేదు. కనుకనే ఆ రోజు అలా ప్రవర్తించావు."

సత్యం మాట్లాడలేదు.

నేనే అన్నాను— "నాలో అంత నీచమైన భావాలు ఉన్నాయని భావించావు. నన్ను ఒక నెంబరు విలన్ విలన్‌గా అను కున్నావు. ఆడపిల్ల కన్పడితే ఆమెను చెరచడమే పనిగా పెట్టుకున్న రోగ్‌లాగ నన్ను లెక్కవేశావు సరే నేనంత రోగ్‌నీ, విలన్‌నీ అయినప్పుడు అలాంటి వాడిని నీ చెల్లెలుకి ఇచ్చి పెళ్ళి చెయ్యాలని ఎందుకు అనుకుంటావు? ఒకవేళ ఆ విషయం మర్చిపోయి నువ్వు అలా అడిగి వుండవచ్చు. కానీ నాకు గుర్తువుంది కనుక అలాంటి విలన్‌ని నీ బావగా రానివ్వను. అందుకే మృదులను చేసుకునేందుకు నేను అభ్యంతరం చెప్తున్నాను. ఆమెను పెళ్ళి చేసుకోవడం కుదరని పని."

ఆవేశంతో కాకుండా ఆలోచనతోటే ఆ నిర్ణయం తీసుకున్నవాడిలా అన్నాను.

"అది కాదురా." ఏదో అన బోయాడు సత్యం. మధ్యలోనే అందు కున్నాను.

"ఆ పని చేసింది నీమీద నమ్మకం లేకకాదు. మా చెల్లాయి మీదనే నమ్మకం లేక అలా చేశాను' అని అంటావేమో! అందుకు కూడా నా దగ్గర జవాబు సిద్ధంగా వుంది. నీ చెల్లాయిమీదనే నీకు నమ్మకం లేక ఆమెను మరొకరి ఇంట్లో పడుకో బెట్టావని అనుకుందాం. అంటే నీ చెల్లెలు చంచలస్వభావురాలు అన్నమాట. మగవాడు కన్పిస్తే కోరికలు దాచుకో లేనిది అన్నమాట.

"తనలో రేగిన సెక్సు వాంఛని తీర్చు కోవడంకోసం పరాయి మగవాడినైనా రెచ్చగొట్టే 'వాంప్' అన్నమాట. ఆ విషయం నీకు తెలుసు కనుకనే అలా ప్రవర్తించావు అన్నమాట.. ఒకవేళ అదే నిజమైతే అలాంటి 'వాంప్' అమ్మాయిని భరించే శక్తి నాకు లేదు. కట్టుబాట్లను విస్మరించి మగవాడి వెంట పడుగులు తీసే అమ్మాయి నాకు అక్కర్లేదు. అందుకే ఆమెను పెళ్ళి చేసుకోలేను.

"కనుక ఆమెను పెళ్ళిచేసుకోవడం కుదరని పని."

సత్యం ముఖం పాలిపోయిందని స్పష్టంగా తెలుస్తోంది.

అందుకే ఇంకా మాట్లాడాలనివున్నా అంతటితో అపుచేశాను.

"మరొక్క విషయం చెప్పనివ్వు

నన్ను. నేను ఇంటర్వ్యూకని వచ్చిన రోజున పగటిపూట నన్ను, మృదులనీ ఒంటరిగా వదిలి వెళ్లావు. అప్పుడు నీలో ఈ అనుమాన ప్రభూతం లేక పోయింది. అదేరోజు రాత్రి మమ్మల్ని అలా ఒంటరిగా వుంచలేకపోయావు. అంటే తప్పు అనేది జరిగితే రాత్రి పూటే జరుగుతుందనీ, పగటిపూట జరగదనీ నీ ఉద్దేశ్యమా ?. అదే నిజమైతే నీ అభిప్రాయం తప్పు. మనసులో ఏ పాపపు ఆలోచనా లేక పోతే అది రాత్రివేళ అయినా తప్పు జరగదు. అలా కాక తప్పుచెయ్యాలనే వాంఛ కనుక కల్గితే అందుకు పగలు అడ్డురాదు. నిజంగానే నాలో దురాలోచన వుంటే పగటిపూటే ఆ తప్పు జరిగి వుండేది. పగటిపూట తప్పు జరగలేదు కనుక రాత్రివేళ కూడా ఏమీకాదని నువ్వు నమ్మి వుండవల్సింది .. ఎనీవే ఆ విషయం ఇంక వదిలెయ్. లెటజ్ ఫర్ గెట్ ది హోల్ ఇష్యూ .." వాతావరణాన్ని తేలిక చెయ్యాలనే ఉద్దేశ్యంతో నవ్వాను.

సత్యం మాత్రం నవ్వలేదు. అలాగే వుండిపోయాడు.

మరీ నిష్కర్షగా మాట్లాడి వాడి మనస్సు నొప్పించానా ? వాడి మనసు నొచ్చినా ఫర్వాలేదు. ఇన్నాళ్లు నా మనసులో వున్నమాట బైటకు కక్కి బరువు తగ్గించుకున్నాను. అంతే చాలు.

నిజంగా ఆనాడు సత్యం అలా ప్రవర్తించి వుండకపోతే మృదులను పెళ్ళిచేసుకుని తీరతానని కాగితం మీద స్టాంపు అంటించి మరీ రాసిఇచ్చేవాడిని. ఎందుకంటే మృదులలాంటి అందమైన యువతి భార్యకావటం ఒక అదృష్టం గానే నేను భావిస్తాను కనుక.

ఆ తర్వాత ఏవో నాల్గు జోకులు చెప్పి వాడిని నవ్వించి మామూలు ధోరణిలో పడేశాను.

ఆ రోజు ఇద్దరం కలిసే హోటల్లో భోజనం చేశాం. ఇద్దరమూ మ్యాటినీకి వెళ్లాం.

ఆ తర్వాత మృదుల గురించి వాడు నాతో ఎప్పుడూ మాట్లాడలేదు.

* * *

తర్వాత మరో ఆరు నెలలు భూత కాలంలోకి వెళ్ళిపోయాయి. ఈ మధ్య కాలంలో మృదులకీ, నాకూ కూడా పెళ్లయింది . అంటే పెళ్లి మా ఇద్దరికీ కాదు . మృదుల పెళ్లి ఎవరో సూర్యారావుతో, నా పెళ్లి మృణాళినితో_

మృణాళినిది విశాఖపట్నం. వాళ్ళ నాన్నగారు పోర్టులో ఆఫీసరు. నేను మొదటిసారిగా పెళ్ళిచూపులకని వెళ్ళి చూసింది ఆమెనే. అన్నీ అలా కుదిరి రావడంతో నెలరోజుల క్రింద నే పెళ్లయింది. నా పెళ్లికి సత్యం రాలేక పోయాడు. అందులో వాడి తప్పులేదు. సరిగ్గా నా పెళ్లి జరిగిన ముహూర్తానికే మృదుల పెళ్లి వుంది. అదీ కారణం.

నేనూ అదే కారణం వల్ల మృదుల పెళ్ళికి వెళ్ళలేకపోయాను.

మృణాళినితో కొత్త కాపురంలోని కొత్త అనుభవాలతో హాయిగా రోజులు గడిపేస్తున్నాన. ఆ హాయి ఎలాంటిదో పెళ్ళయిన పాఠకులందరికీ తెల్సు కనుక ఇక్కడ రాయటంలేదు. పెళ్ళికాని పాఠకుల కోసంకూడా రాయటంలేదు. ముందే తెలిస్తే పెళ్ళయ్యాక 'సస్పెన్స్' పోతుందని.

సత్యం ఈ మధ్య ఫ్యాక్టరీలో ఎరీ బిజీగా వుంటున్నందున నేను నా భార్యను తీసుకువచ్చిన తర్వాత వాడు మా ఇంటికి రాలేదు. మేం ఇద్దరంబైట ఎక్కడో కల్సుకుని మాట్లాడుకోవడం వేరే సంగతి.

వాడిని ఇంటికి రమ్మని రోజూ కోరుతూనే వున్నాను.

చివరికి ఒక రోజు వీలుచూసుకుని వచ్చాడు.

నా భార్యను పరిచయం చేశాను. ఆ రోజు ఓ రెండు గంటలు నాతోగడిపాడు.

"నాకంటె పెద్దవాడివి. నా పెళ్ళి అయిపోయింది. నువ్వింకా చేసుకోలేదు .. " అన్నాను.

"మృదుల పెళ్ళి గురించి ఆగాను. ఇంక తర్వాత ఛాన్సు నాదే. .." అన్నాడు నవ్వుతూ.

ఆ తర్వాత వాడు వెళ్ళిపోయాడు.

సత్యం వెళ్ళిపోయాక మృణాళిని అడిగింది నన్ను–

"ఏమండీ! మీ సత్యంగారు ఇదివరకు వైజాగ్‌లో ఉద్యోగం చేశారా ?"

"అవును. ఏం? అక్కడ చూసినట్లు గుర్తుందా అలా అడిగేవు? మీది ఆ వూరేగా " అన్నాను

"ఆయన ఇల్లు ఎక్కడ వుండేదో మీకు తెల్సా ?"

వాడు వైజాగ్‌లో వుండగా వాడికి ఉత్తరాలు రాసేవాడిని కనుక ఆ చిరునామా నాకు ఇంకా గుర్తుంది. అదే చెప్పాను మృణాళినితో.

"అవును ఆయనే ఈయన. నా అనుమానం నిజమే అయ్యింది. ఆ నుదురుమీద వున్న పెద్ద పుట్టుమచ్చ చూసే అనుకున్నాను. " అంది మృణాళిని.

సత్యం నుదుటిమీద పెద్ద పుట్టుమచ్చ వుండటం నిజమే.

"ఏమిటి సంగతి ?" అన్నాను.

"ఈయన చాలా ప్రమాదకరమైన మనిషి. వైజాగ్‌లో ఓ అమ్మాయి ఆత్మహత్యకు కారకుడు ఈయన...." అంది మృణాళిని, నాకు తెలియని నిజాన్ని బైటపెడుతూ.

నమ్మలేనట్లు చూశాను.

అది గమనించి కాబోలు మృణాళిని అంది–"నిజమేనండీ! ... నా మాట నిజం... ఈయన మా వీధిలోనే అద్దెకు

వుండేవారు ఒక ఇంట్లో వీధివైపు గదిలో. ఆ ఇంటాయన ఊరికి వెళ్ళిన సమయంలోనే ఇంటావిడకు జ్వరం వస్తే హాస్పటల్లో చేర్చారు. ఆ రాత్రి ఆ ఇంటి వాళ్ళమ్మాయి ఒక్కత్తే ఇంట్లో పడుకుంది. ఆ అమ్మాయి నా స్నేహితురాలే. ఆయనలో ఏం దుర్బుద్ధి పుట్టిందో ఆమె ఒంటరిగా ఉన్న సమయం చూసి ఆమెను బలవంతంగా అనుభవించేడు. ఆ అమ్మాయి ముందు ఎదిరించినా ఆతని పశుబలానికి లొంగిపోయింది. ఆ తర్వాత ఆమెను పెళ్ళిచేసుకుంటానని మాట ఇచ్చాడు. పరువు పోతుందనే ఉద్దేశ్యంతో ఆ అమ్మాయి నోర్మూసుకుని అతను పెళ్ళిచేసుకుంటాడని నమ్మకంతో వుంది. ఆ విషయం ఆ అమ్మాయి నాతో స్వయంగా చెప్పింది. తర్వాత ఆ అమాయకురాలు నెలతప్పితే తనకేం తెలియదన్నాడు. దాంతో ఆ అమ్మాయి ఆత్మహత్య చేసుకుంది. ఆ తర్వాత ఆయనకి బదిలీ అయ్యి వెళ్ళిపోయాడు....”

ఆ స్నేహితురాలు గుర్తు వచ్చి కాబోలు మృణాళిని గొంతు ఆఖర్లో బొంగురుపోయింది. ఆమె గొంతులోని సిన్సియారిటీ చూసి ఆమె మాటలు నమ్మాను.

ఆరోజు రాత్రి వాడు మృదులని వేరే వాళ్ళింట్లో పడుకోబెట్టడానికి కారణం అప్పుడు తోచింది నాకు. నేను కూడా వాడిలాగే ప్రవర్తిస్తానని భయపడ్డాడు. వాడిలో వున్న పశువాంఛ నాలోనూ ఉంటుందని నమ్మాడు. మృదులను ఇంట్లోనే వుంచితే ఆమెను నేను అనుభవిస్తానని అనుమానించాడు. తద్వారా మృదుల గర్భవతి అవుతుందని ఆలోచించాడు. తర్వాత ఆమెను నేను నిరాకరిస్తానని భయపడ్డాడు. అటు పిమ్మట ఆమె ఆత్మహత్య చేసుకుంటుందని వణికిపోయాడు. అందుకే అలా జాగ్రత్తపడ్డాడు.

కానీ, వాడికి తెలియని విషయం ఒకటుంది. నేను సత్యాన్ని కాదు. కౌండిన్యని. ఆ విషయం మర్చిపోయాడు.

ఎంతో అమాయకంగా కన్పించే సత్యం వెనుక ఇంత కథ వుందా?

‘చీకటి చాటున వున్న సత్యం ఇదన్న మాట’.

ఆలోచిస్తూ వుండిపోయాను.

“ఏమిటండీ ఏదో ఆలోచిస్తూ వుండిపోయారు?” నా భుజాలు కుదుపుతూ అడిగింది మృణాళిని.

ఆమె చేతిని నాచేతుల్లోకి తీసుకుంటూ—“అబ్బే !. . .ఏం లేదు. . .” అన్నాను.



# మారుతున్నప్రేమకథ

పి.బి. ఆర్ శివకుమార్



మొన్నటి ప్రేమ :

హో రున కురుస్తున్న వాన చీకటిని మరింత చిక్కన చేస్తోంది. అర గంట క్రితమే అధాట్టుగా మొదలైనా, ఎన్నో గంటలనించీ కురుస్తున్నట్టుగా ఊరంతటినీ జలమయం చేసేస్తోంది.

గదిలో కూర్చుని కెమిస్ట్రీ పుస్తకం చదువుకుంటున్న లీల చేతిలో పుస్తకాన్ని గబుక్కున టేబుల్ మీద పడేసింది. కారణం-తలుపుమీద అయిన చప్పుడే!

'చప్పుడయింది తన గది తలుపు మీదేనా? ఇంత రాత్రివేళ తన గది కెవరొస్తారు?.... నో.... తన గది తలుపు అయుండదు. ఇంకే చప్పుడో అయుంటుంది.'

ఆమె మళ్లీ పుస్తకాన్ని చేతుల్లోకి తీసుకోబోయింది. మళ్లీ చప్పుడు మరింత స్పష్టంగా. .

భయం ఆమె వెన్నులో జరజర పాకింది.

'ఎవరు . ఎవరు?'

లీల లేచి నిలబడింది. నెమ్మదిగా తలుపుదాకా నడిచింది.

"ఎవరు." అడిగింది గట్టిగా. జవాబు లేదు. మళ్లీ చప్పుడు..

"ఎవరదీ?" మరింత గట్టిగా, నోటిని తలుపుకి దగ్గరగా పెట్టి అరిచింది.

"నేను.... వేణుని..." జవాబు అలవోకగా వినవచ్చింది.

'వేణు ?' ఆశ్చర్యపోయిందామె.

'ఇంత రాత్రివేళ. . ఈ వానలో . . తన గదికి వేణు ?! ఎందుకొచ్చాడు ?'

మళ్లీ చప్పుడు. నెమ్మదిగా తలుపులు తెరిచింది. ఈదురుగాలి, వానజల్లు విసురుగా గదిలోకి వచ్చాయి. వాటి వెనకే వేణు కూడా అడుగుపెట్టి, తలుపులు దగ్గరకు వేశాడు. ఆమెవైపు తిరిగి అపాలజిటిగ్గా చూశాడు.

"నేను ... సూర్యం వాళ్లింటికివెళ్లి .. నోట్సు రాసుకుని వస్తున్నాను.

"బయల్దేరేముందు ఆకాశం మామూలుగానే వుంది. తీరా ఓ మైలు దూరం నడిచేసరికి....ఈ వాన ! అకస్మాత్తుగా మొదలయింది. చినుకులే కదా, గబగబ నడుద్దామనుకున్నాను. లేదా, ఏ రిక్షానో ఎక్కుదామనుకున్నాను. ఏదీ దొరకలేదు.

ఈ వానలో ఏం చెయ్యాలో తోచలేదు.

దారిలో కనపడింది నీ గది. నీ కభ్యంతరం లేకపోతే . వాన తగ్గేదాకా కాస్త ఆగుదామని.. "

తడబడతూ వివరించి, ఆగిపోయాడు వేణు. మౌనంగా వింటూనే అతడి మాటల్లోని నిజనిజాల్ని అంచనా వేస్తోంది లీల.

గత మూడేళ్లుగా వేణుని తనెరుగును. మూడేళ్ల క్రితం ఫస్టియర్లో అయిన పరిచయం యీ మూడేళ్లలోనూ స్నేహంగా మారి, ప్రేమగా స్థిరపడింది. అయితే చదువులు పూర్తయి, ఎవరి కాళ్లమీద వాళ్లు నిలబడితే తప్ప పెళ్లి విషయం మాట్లాడుకోదల్చుకోలేదు వాళ్లు. అందుకే ప్రేమ ప్రేమగా పెరుగుతున్నా పరిచయం స్నేహాన్ని దాటి ఎదగలేదు.

'మూడేళ్లుగా ఏనాడూ హద్దుదాటి ఎరగని వేణు.... ఈ రాత్రి వేళ హఠాత్తుగా యిలా....

'నిజమేనా అతడు చెబుతోంది ?'

నిజమేనంటున్నాయి అతని చేతి రుమాల్లోంచి తొంగిచూస్తున్న నోట్సులు. నిజమేనంటున్నాయి అతడి నోట్లోంచి తడబడుతూ వచ్చిన మాటలు. నిజమే నమ్మమంటున్నాయి అతడి కళ్లు చూస్తున్న దీనమైన చూపులు.

లీల కదిలింది.

"తడిసిపోయివున్నావ్. ముందు తల తుడుచుకో" అంది పొడిగా.

అతను తలుపు దగ్గర్నుంచి రెండడుగులు ముందుకు వేశాడు. గాలి విసురుకి తలుపులు తటాలున తెరుచుకున్నాయి. అతను వెనక్కి తిరిగి, గడియ పెట్టబోతూ ఆమెవైపు భయంగా చూశాడు.

"గడియపెట్టు వేణూ ! వానజల్లు గదిని తడుపుతోంది" అంది లీల. అతను గడియపెట్టేసి గదిలో ఓ పక్కగా వున్న బట్టల స్టాండ్ దగ్గరికి నడిచాడు.

స్టాండ్‌మీదున్న టవల్ అందుకని

తల, కాళ్లు, చేతులు తుడుచుకున్నాడు. టవల్ స్టాండ్‌మీద వేశాడు.

"బట్టలు గూడా బాగా తడిశాయి. అవి తీసి ఆరేసి, ఈ లుంగీ కట్టుకో. మా అన్నయ్య వచ్చినప్పుడల్లా అవసరం వస్తుందని ఇక్కడే వుంచేశాడు." అందామె, పెట్టెలోంచి లుంగీ, బనీను తీసి టేబుల్‌మీద పెడుతూ.

"ఎందుకు? వద్దు. మరో పావుగంటో, అరగంటో చూసి, వెళ్లిపోతాను." మొహమాటంగానూ, కంగారుగానూ అన్నాడు వేణు.

"ఫర్వాలేదు. ఫాన్ పెడితే అర గంటలోనైనా కాస్త ఆరతాయ్. అంత దాకా తడిబట్టల్లోవుంటే జలుబు చేస్తుంది" అంది లీల.

అతను లుంగీ, బనీన్లనీ టేబిల్‌మీంచి అందుకున్నాడు. ఆమె వంటకోసం వున్న లోపలి గదిలోకి వెళ్లి, మిగిలున్న పాలు వెచ్చబెట్టసాగింది. అతను బట్టలు పిండి, ఆరేసి కుర్చీలో కూర్చున్నాడు.

లోపల్నించి గ్లాసులో వేడివేడి పాలు తీసుకొచ్చి, అందించిందామె.

"ఎందుకిప్పుడు అనవసర శ్రమ...."

"తప్పేముందీ? వానలో తడిసొచ్చావ్. వేడిగా కాసిని మిరియాలపాలు తాగటం వంటికి మంచిది." నవ్వింది లీల.

వేణు గ్లాసు అందుకున్నాడు. మిరియాల పాలు ఊదుకుంటూ తాగాడు. గ్లాసు పక్కన పెట్టి,

"ఏమిటి చదూతున్నావ్?" అంటూ బల్లమీదున్న పుస్తకాన్ని చేతిలోకి తీసుకున్నాడు. అది కెమిస్ట్రి టెక్స్టుబుక్.

"అరె, నేనూ కెమిస్ట్రి నోట్స్ కోసమే సూర్యంగదికి వెళ్లింది," అన్నాడు. "చివరి ఛాప్టర్ల మీద మంచి నోట్స్ ప్రిపేర్ చేశాడతను. ఆ నోట్స్ పూర్తిగా రాసుకోందే కదలబుద్ధి కాలేదు. టైం కూడా తెలియలేదు. సూర్యం అన్న కూడా అన్నాడు 'పోనీ, ఈ రాత్రి కిక్కడే పడుకోరాదా' అని. పడుకుండి పోయినా బాగుండేది. ఫర్లేదు, ఏ రిక్షానో ఎక్కి వెళ్తానని బయల్దేరాను అనవసరంగా... "

"ఫర్లేదులే వేణూ, ఎందుకన్నిసార్లు బాధపడతావ్? నువ్వు చేసిందాంట్లో తప్పేముంది? వెళ్లిపోదామనుకున్నావ్. వానవల్ల వీలుకాలేదు. అంతేగా!" అంది సానుభూతిగా లీల.

కృతజ్ఞతగా ఆమెవైపు చూశాడు వేణు.

ఆ తర్వాత వాళ్ల సంభాషణ రానున్న పరీక్షల మీదికీ, సబ్జక్టుల మీదికీ మళ్లింది.

అరగంట గడిచినా వాన తగ్గలేదు. కిటికీ తెరిచి చూశాడు వేణు. తగ్గే సూచనలూ కనిపించలేదు.

"పోనీ... ఈ రాత్రికి... ఇక్కడే పడుకో." నెమ్మదిగా అంది లీల. తల విదిలించాడు వేణు, "ఛీ....అనవసరంగా నిన్ను ఇబ్బందిపాలు చేస్తున్నాను.





అలాగే తడుస్తూ వెళ్ళినా, ఈ పాటికి నా గదికి చేరుకునేవాణ్ణి."

లీల జవాబేం యివ్వలేదు. అలాగే కూర్చుంది మంచమ్మీద. మాటయితే అనేసింది గానీ ఆమె మనసు మాత్రం మనసులో లేదు.

'ఆ మాట అనక తప్పదు. ఎలాగూ యింత రాత్రి.... ఈ వానలో....అతను వెళ్ళలేదు. వెళ్ళమని తనూ అనలేదు.

అలాటిది, అతను నోరు తెరిచి అడిగే కన్న, ముందుగా తనే వుండిపొమ్మన టమే మర్యాదగా వుండదూ!

అందుకే వుండిపొమ్మంది గానీ— యిప్పుడెంత భయంగా వుంది!

పరాయి మగాడితో .. పెళ్ళికానంత వరకూ ఎంత ప్రేమికుడైనా పరాయి వాడేగా... అతనితో ఈ రాత్రంతా ఈ గదిలో ఎలా గడపటం? రేపెవరికయినా తెలిస్తే ఎంత అసహ్యంగా వుంటుంది!... ఎవరేమంటారో!'

వేణు కూడా ఆలోచిస్తున్నాడు.

'ఇక్కడే పడుకోవటమా! ఇంత కన్న ఆ సూర్యం గదిలోనే వుండిపోతే ఎంత బాగుండేది! ఛీ . తొందరపడి ఎలాటి డెలికేట్ సిచుయేషన్లో పడ్డాడు తను!

'వుండిపొమ్మని అనటమైతే అన్నది గానీ, లీల మాత్రం మనసులో చిరాకు పడుతూ వుండదూ?

'కానియ్.. తప్పేదేముంది? మా పవిత్రత మా మనసులకి తెలుసు. అంతే! అంతకన్న ఎవరికి జడిసి మాత్రం యిప్పుడు చేసేదేముంది?'

"క్షమించు లీలా! అనుకోకుండా నిన్ను ఇబ్బందికి గురిచేశాను." అన్నాడు చివరికి గొంతు పెగుల్చుకుని.

"ఫర్లేదులే. చాలా రాత్రయింది. ఇక పడుకో." అంది లీల మంచంమీంచి లేచి నిలబడుతూ.

"మరి నువ్వు?"

"నేను లోపల వంటగదిలో పడు కుంటాను."

"అక్కడా! ఫాన్ లేకుండా.... దోమలతో. "

"ఏం ఫర్లేదు. ఒక్క రాత్రికేగా...."

అతను మౌనంగా మంచంమీది దుప్పటి, దిండు తీసి టేబిల్ మీద వుంచాడు. ఆమె వంటింట్లో చాప పరుచు కున్నాక వచ్చి వాటిని అందుకుంది.

వంటగదిలోకి వెళ్లబోతూ ఆగి,

"గుడ్ నైట్" అంది.

"గుడ్ నైట్" జవాబిచ్చాడు వేణు. ఆమె నిష్క్రమించింది. తలుపులు దగ్గరగా మూతలుపడ్డాయి.

ఒక్కసారి మనసు ఉగ్గబట్టి, ఊపిరి బిగబట్టి విన్నాడు వేణు- ఆ తలుపుల గడియపడ్డ చప్పుడు.

మనసు చివుక్కుమంది.

'గడియ.. వేసుకోవాలా? తన మీదున్న నమ్మకం అంతేనా?'

మళ్లీ అతనికే అనిపించింది.

'ఆమె జాగ్రత్త ఆమెది. పెళ్లికాని పిల్ల.... జాగ్రత్తలో వుండటంలో తప్పు లేదుగా!'

మనసుకి సర్దిచెప్పుకుంటూ మంచం మీద నడుంవాల్చాడు.

ఆ రాత్రంతా ఆ యిద్దర్లో ఎవరికీ సరిగ్గా నిద్రపట్టలేదు.

'ఎప్పుడెప్పుడు తెల్లవారుతుందా.... ఎప్పుడెప్పుడు ఈ పరిస్థితి ముగుస్తుందా' అనుకుంటూనే పక్కలమీద దొర్లారు తెల్లవారే వేళదాకా!

(మరో ఆరు నెలల తర్వాత.... వాళ్లిద్దరూ పెళ్లిపీటల మీదకు వెళ్లి, నలుగురిలో ఒకటయ్యేదాకా, ఆమెలో ఆ రాత్రిని గురించిన బెదురు అలాగే వుండిపోయింది.)

## 2

నిన్నటి ప్రేమ :

'ఛీ . ఛీ... వెధవ వాన' విసుక్కు న్నాడు వేణు. వానొస్తుందని ఊహించ లేక సైకిలుమీద సినిమాకి వచ్చినందుకు తిట్టుకున్నాడు. చైను పడిపోయిన సైకిల్ని మరింత తిట్టుకున్నాడు. సైకిలు దిగి, ఆ చీకటిలోంచి దగ్గర్లో వున్న వో లైటు స్తంభంవైపు సైకిల్‌తోసహా నడిచాడు. సైకిలుకి స్టాండ్ వేసి, చుట్టు పక్కల వెతికి, గట్టిగా వున్న ఓ కర్ర ముక్క సంపాదించాడు. అయిదు నిమిషాలు తంటాలుపడి చైను వేశాడు. సైకిలెక్కి మళ్ళీ ముందుకి సాగాడు.

వాన చినుకులు సూదిములుకుల్లా మొహమ్మీద సూదులు గుచ్చుతున్నాయి. గాలివాటుకి సైకిల్ ముందుకు నడవ టానికి మొరాయిస్తోంది. అలాగే

ఈడుస్తూ తొక్కుకుంటూ మెయిన్‌రోడ్డు దాటి, ముందున్న మలుపు తిరిగాడు.

"ఇంకా రెండుమైళ్ళు ఛ " చవకగా దొరికిందని వూరిబయట రూం తీసుకున్నందుకు తనని తనే తిట్టుకున్నాడు.

అయిదు నిమిషాల్లో రెండో మలుపు తిరిగాక, ఆ యిల్లు చూసేసరికి గుర్తుకు వచ్చింది లీల. సైకిల్ అకస్మాత్తుగా ఆగిపోయింది. ఆలోచనలు చురుగ్గా నడిచాయి.

'తప్పేముంది. అవసరంలో వున్నాను. అవకాశం వుంది. కనుక అడిగితే సరి. తొందరపడనంతవరకూ ఏదీ తప్పు కాదు. తామిద్దరూ పరాయివాళ్లూ కాదు.'

ఆలోచనల్ని సమర్థించుకుంటూ, వెళ్ళి ఆ గదితలుపు తట్టాడు. కొద్ది క్షణాల తర్వాత కిటికీ రెక్క తెరుచుకుంది.

"ఎవరు ?" చీకట్లో అతను సరిగ్గా కనపట్టంలేదు.

"నేను " అంటూ కిటికీ వెలుగులోకి వచ్చాడు.

"నువ్వా " ఆమె చప్పున కిటికీ వెనక మాయమై, తలుపు తీసి ప్రత్యక్షమైంది. అతను సైకిల్ని వీధి అరుగు మీద వుంచి, తాళంవేసి, గదిలోకి నడిచాడు. తలుపులు మూసేశాడు.

"ఏమిటింత వానలో? ఎక్కణ్ణించీ?" అడిగింది లీల.

"ఫస్టోకి వెళ్ళాను. వెధవ సినిమా మధ్యలో కరంటు పోయి అరగంట ఆగిపోయింది. వదిలేసరికి పదిన్నర యింది. అక్కడినించీ అనుకోకుండా యీ వర్షం

ఇహ ఈ పదకొండు గంటల వేళ, యీ వాన, రొచ్చులో ఊరిబయటిదాకా వెళ్ళలేననిపించి "

"ముందు తల తుడుచుకో. మట్టిబుర్రగానీ అయితే మొక్కలు మొలుస్తాయ్." నవ్వింది లీల.

"పోన్లే మట్టిబుర్ర కాదేమోనన్న అనుమానం కూడా వుంది కదా!" అంటూ ఆమె చేతిలోని టవలూ, నూలు చీరా అందుకున్నాడు. "నా గదిలో లుంగీలు లేవు" అంది లీల నవ్వుతూనే.

"బొత్తిగా పాతకాలం మనిషివి మరి!" వెక్కిరిస్తూ, తల తుడుచుకునేందుకు ఉపక్రమించాడు వేణు

"ఇలా వచ్చి నిన్నేమయినా ఇబ్బంది పెట్టెయ్యటం లేదు కదా !"

"అలాంటి అనుమానం వున్నవాడివి అసలు రాకుండానే వుండాలిసింది."

చిన్నబుచ్చుకున్నాడు వేణు.

"లేకపోతే ఏమిటా మాటలు ? అర్ధరాత్రి, వానలో తడుసుకుంటూ వచ్చిన వాడిని–నా కిబ్బంది అవుతుందబ్బాయ్, వెళ్ళిపొమ్మని అంటా ననుకున్నావా ?"

అతను తృప్తిగా వూపిరి పీల్చుకున్నాడు

"అంతే ఎవరొచ్చి ఆతిథ్య మడిగినా అంతేనా ?" కొంటెగా అన్నాడు.

"ఎవడికన్నా అర్ధరాత్రి నా గది తలుపులు తట్టేందుకు ఎంత ధైర్యం ?" ఆమె నవ్వుతూ అంటించింది

అతను టవల్‌తో వొళ్ళు తుడుచుకుని, చీరెని లుంగీచేసి కట్టుకుని, గదిలోనే వో మూలవున్న దండెంమీద తడి పాంటు, షర్టు ఆరేసి వెనక్కి తిరిగే వేళ్టికి ఆమె వేడివేడిగా హార్లిక్స్ తేవటం అయింది.

"నా ఒక్కడికేనా?నువ్వూ తాగు "

"అలా అంటావనీ, అల్లరి చేస్తావనీ తెల్సు. అందుకే, ఇదిగో, రెండో గ్లాసు కూడా కలిపాను." ఆమె అల్లరిగా నవ్వింది

ఇద్దరూ ఎదురెదురుగా కూర్చున్నారు— ఆమె మంచమ్మీదా, అతను గ్రాడ్రెజ్ కుర్చీలోనూ. హార్లిక్స్ పూర్తయింది.

"ఇంతక సంగతేమిటి ?" అతని కంఠంలో కొంటెదనం.

"నాకేం కొరత ? నా మంచం నాకు వుండనే వుంది. నీ సంగతే "

"నాకేం కొరత ? మంచానికి రెండో చివర్న నేను."

"పాపం—చాలా ఆశే వుంది. అదేం కుదర్దు. కింద చాపా, దుప్పటీ వేస్తున్నాను. పడుకో బుద్ధిగా."

"చాపా, దుప్పటీ—అడవాళ్ళ అలవాట్లు మగాళ్ళకి కాదు."

"షటప్. అల్లరిమాటలు మనదగ్గర కుదరవ్."

"అలాగేం " అంటూ అతను హఠాత్తుగా లేచాడు. మెరుపులా ఆమె మీదికి వంగాడు.

"ఏమ్ ఏమిటీ పని ?" ఆమె చిరుకోపంగా పెదాలు తుడుచుకుంటూ అంది.

"నువ్వేగా షట్ అప్ అన్నావు "

"వేణూ ! టూమచ్ చేస్తున్నావ్. నా కిలాటివి గిట్టవని ఎన్నో సార్లు చెప్పాను. మనం యింకా కొన్నాళ్ళు దాకా మన పరిధుల్లో వుండక తప్పదన్నానా ?" ఆమె సీరియస్‌గా అంది.

వేణు మౌనంగా లేచి నిలబడ్డాడు. మూలనున్న చాప అందుకుని ఓపక్కగా పరిచాడు. మంచంమీద కాళ్ళవారీగా వున్న దుప్పటీ, తలగట్టు వున్న రెండో దిండు తీసి చాపమీద పడేశాడు. చటుక్కున లైట్ తీసేసి, నైట్‌లాంప్ స్విచ్ నొక్కాడు.

ఆ తర్వాత చాపమీద దుప్పటి పరుచుకుని, వెల్లకిలా పడుకున్నాడు. రెండు చేతులూ వెనక్కి మడిచి, తల క్రింద, దిండుమీద పెట్టుకున్నాడు.

అప్పటిదాకా అలాగే నిశ్శబ్దంగా కూర్చుంది ఆమె. అతను పడుకున్నాక అంది.

"ఇదేనా పద్ధతి ?"

" "




"నేనన్న మాటలకి అర్థం యిదేనా?"

"..........."

"నవ్వులాటకి అన్న మాటల్ని సీరియస్‌గా తీసుకోవటమేనా? నేను చాపమీద పడుకుని, నీకు మంచం ఇచ్చే పాటి కొంచెం సంస్కారం కూడా నాకు లేదనుకున్నావా?"

"..........."

"మాట్లాడు వేణూ! అంత కోపం ఎందుకు నీకు? నేనేం తప్పు మాట్లాడానని?"

అప్పటికీ లీలకి అతడి మౌనమే మిగిలింది. ఆమె నిస్సత్తువగా మంచం మీద వాలిపోయింది.

అనుకోకుండా అద్భుతం జరిగినట్టు అర్ధరాత్రి, వానవేళ అతను ప్రత్యక్షమయ్యాడు. ఎంతో సంతోషంగా గడపవలసిన రాత్రి హఠాత్తుగా తమ మధ్య ఈ కోపం—పట్టుదలా ఎందుకు చోటు చేసుకున్నాయి?

తప్పు తనదేనా? ఎంతో నిగ్రహంగా, మర్యాదగా ప్రవర్తించే వేణుని పరిధిలో వుండమని హెచ్చరించటం తన తొందరపాటేనా?

ఒంటరిగా వున్న ఆడపిల్ల తను. ఎంత అయినవాడైనా, మనసైనవాడైనా, చట్టరీత్యా తనవాడు కాని అతడిని ఆ పాటి హెచ్చరించటమూ తప్పేనా?

ఆలోచనల వేడికి ఆమె గుండెలోని కన్నీళ్ళు కరిగి, కనుకొలకుల్లో చేరి, నెమ్మదిగా చెంపలమీదుగా జారి, దిండు మీద పడి ఇంకిపోతున్నాయి.

వేణు మనసులోనూ ఆలోచనలు.

'ఆమెకి ఎందుకంత భయం? ఇన్నాళ్ళ సాన్నిహిత్యంలోనూ తను ఏనాడైనా ఆమెపై చనువు తీసు

కున్నాడా ? తన ప్రవర్తనలో ఎప్పుడయినా తొందర కనబర్చాడా ? అయినా ఆమెకి తనపై నమ్మకం లేకపోవటం న్యాయమా?

అసలు తనిలా అర్ధరాత్రివేళ ఆమె గదికి రావటంలోనే తప్పు చేశాడా ?

తమ ప్రేమ యింకా పెళ్ళిమాటల దాకా రాలేదు.

నిజమే.

అయితే, పెళ్ళి చేసుకుంటే తప్ప ప్రేమికుల మధ్య చనువుండకూడదా? ముక్కూ, మొహాలెరగని జంటలమధ్య పెళ్ళి కలిగించేపాటి అధికారం, ఏళ్ళ తరబడి ఒకరి నొకరు అర్థంచేసుకుని, మనసులిచ్చి పుచ్చుకున్న ప్రేమికులకి వుండకూడదా ?'

కళ్ళు మూసుకుని ఆలోచిస్తున్నాడు వేణు.

లీలలో ఆవేశం చల్లారి, కన్నీళ్ళు ఆగిపోయాక మనసు ఆ కన్నీళ్ళకి తడిసి, మెత్తబడ్డాక, ఆమె ఆలోచనలు మరోదారిన పయనించాయి.

'పాపం! క్రింద పడుకున్నాడు' అనుకుంటూ తల తిప్పి వేణువైపు చూసింది.

అప్పటికి వేణులోని ఆలోచనలూ మరో రూపు దాల్చాయి.

'లీల తప్పు మాత్రం ఏముంది? ఆడపిల్ల .... పవిత్రతే ప్రాణమనే నమ్మకం వేళ్ళుపాతుకున్న సమాజంలో పెరుగుతోంది.

తనని తొందరపడవద్దని హెచ్చరించటంలో ఆమె ముందు జాగ్రత్తే తప్ప తప్పు ఏముంది?'

ఆలోచనలు కదులుతుండగానే చాప మీద, తనపక్కనే ఏదో అలికిడయినట్లయింది. కళ్ళు తెరవబోయాడు. అంతలోనే కళ్ళపై సులివెచ్చగా పెదిమల మెత్తదనం. నుదుటిమీద దీర్ఘమైన శ్వాస తాకింది. చటుక్కున కళ్ళు తెరిచిన వేణు మొహంమీదే మొహం పెట్టి లీల.

ఇద్దరి మధ్యా వున్న కోపం ఒక్కసారిగా ఎగిరిపోయినట్లయింది.

'లీలా....' అంటూ రెండు చేతుల్నీ తలకిందినించి లాక్కుని ఆమె వీపు చుట్టూ పెనవేశాడు వేణు.

'వేణూ....మై డార్లింగ్....'అంటూ అతడిమీదికి ఒరిగిపోయింది లీల.

అతని బనీను లేని ఛాతీమీద ఆమె గుండెలు మెత్తగా హత్తుకుపోయాయి. మోకాళ్ళపై కూర్చున్న ఆమెని వెనక్కి జరిపి, మీదకి లాక్కున్నాడు వేణు. మరి మాట్లాడే వీలులేకుండా ఇద్దరి పెదాలూ అతుక్కుపోయాయి. అతని చేతులు ఆమె బ్లౌజ్‌బటన్లమీద తారట్లాడుతున్నాయి.

* * *

తెలతెలవారుతుండగా మెళకువొచ్చిన లీల ఉలిక్కిపడి లేచి తనని తను చూసుకుంది. దూరంగా గుట్టలా

పడివున్న చీరె, దాని పక్కనే జాకెట్. తనని చుట్టేసి అతని చేతులు.

నెమ్మదిగా చేతుల్ని తప్పించి లేచి కూర్చుంది లీల.

'ఏం జరిగింది రాత్రి?'

ఆమె కదలికకి మెలుకు వొచ్చిన వేణు కళ్ళు తెరిచాడు. ఎదురుగా అర్ధ నగ్నంగా లీల. మళ్ళీ ఆమెని మీదికి లాక్కోబోయాడు.

"వేణూ....నన్నన్యాయం చెయ్యవు కదూ...."

లీల గొంతులో అపనమ్మకంతో పాటుగా సుడులు తిరుగుతున్న కన్నీళ్లు!

"లీలా....డార్లింగ్....ప్లీజ్.... బాధ పడకు. నీ బాధతో అందమైన మన ఆనందపు టనుభూతిలో అపశృతి పలికించకు. ఇప్పుడు తప్పేంజరగలేదు. మనం ఎప్పటికైనా భార్యాభర్తలమే!" అంటూ ఆమెని మరింత గట్టిగా హత్తుకున్నాడు వేణు.

ఆమె బేలగా అతడికి అతుక్కుపోయింది.

(మరో ఆరు నెలల తరవాత.... వారిద్దరూ పెళ్ళిపీటల మీదికి వెళ్ళి, నలుగురిలో ఒకటయ్యేదాకా ఆమెలోని భయమూ, బేలతనమూ అలాగే వుండిపోయాయి)

### 3

**నేటి ప్రేమ:**

బార్లోంచి బయటకు వచ్చాడు వేణు. టపటపమంటూ హేట్ మీద పడసాగాయి చినుకులు. 'డర్టీ వెదర్' తిట్టుకున్నాడు. రెయిన్‌కోట్ వొళ్ళంతా కప్పివున్నా, కడుపులోకి వెచ్చగా దిగిన ద్రవం వున్నా అతగాడు ఒక్కసారి చలిగాలికి వణికాడు.

నెమ్మదిగా కదిలి, స్కూటర్ దగ్గరకు నడిచాడు. చలికి, నీళ్లకి తడిసిన స్కూటర్ స్టార్ట్‌కానని మొరాయించింది. సహనం పరీక్షకి వచ్చేసరికి ఇంగ్లీషు కల్చర్ని కాసేపు మర్చిపోయి, 'దీనమ్మ....' అని అచ్చ తెలుగులో తిట్టుకున్నాడు. మరి నాలుగు కిక్కులిచ్చేక, ఓ మూలుగు మూలిగి కదిలింది వాహనం.

'ఎలా? ఇప్పుడేం చెయ్యాలి?'

చలి, గాలి, వాన.... వాతావరణం 'అనువు' కుదిర్తే మత్తుగా, గమ్మత్తుగా గడిచిపోయేలా వుంది. కానీ, అనువుగా లేని ఈపూట మాత్రం చిరాగ్గా వుంది. స్కూటర్ రోడ్డుమీద దొర్లిపోతోంది. ఆలోచనలు బుర్రలో దొర్లుతున్నాయి. సడెన్‌గా రోడ్డుమీద ఓ గుంటలోకి దొర్లింది చక్రం. ఎగిరిపడి, మళ్ళీ ముందుకు దూసుకుంది స్కూటర్. వేణు బుర్రలోనూ ఆలోచన్లు ఒక్కసారి ఎగిరిపడి కొత్తమలుపు తీసుకున్నాయి.

'కరక్ట్. ఎ గుడ్ ఐడియా' అనుకున్నాడు, స్కూటర్ గేరు మారుస్తూ.

'అర్ధరాత్రి వచ్చానని ఏమైనా అనుకుంటుందా? .... నాన్సెన్స్ .... అంత

పాత చింతకాయ పచ్చడి కాదులే. లెటజ్ సీ. అయినా, ఆ మాత్రం చనువు లేదా తమ ఇన్నాళ్ళ పరిచయానికి?'

ఆలోచనల్లోనే స్కూటర్ ఆ యింటి ముందాగింది. నెమ్మదిగా స్కూటర్ని గోడ దగ్గరకు నడిపి, సన్ షేడ్ కింద స్టాండ్ వేశాడు. ముఖంమీద పడ్డ నీటి చినుకుల్ని ఎడంచేత్తో తుడుచుకుంటూ వెళ్లి తలుపుతట్టాడు.

తలుపు తెరుచుకుంది. హేట్ తీసి చేత్తో పట్టుకుని, లోపలికి అడుగుపెట్టాడు వేణు.

"వేణూ!....యూ....ఇన్ ది లేట్ నైట్.... సర్ప్రైజింగ్ ...." అంది లీల, తలుపులు మూస్తూ.

"యస్....సర్ప్రైజింగే! ఈ రాత్రి వేళ....ఈ వానలో నా గదిలో నే నొంటరిగా.... తోడెవరూ లేకుండా.... వుండలేక, రూమ్‌కి వెళ్దామని బయల్దేరిన వాడినే, మధ్యలో నీ గది కనిపించి, 'నీ లీలని వంటరిగా ఈ చలిలో.... చీకటిలో ....వదిలేసి పోతావా?' అని నిలదీసే సరికి, నువ్వూ వంటరిగానే వుంటావని గుర్తొచ్చింది. పోన్లే, కంపెనీ యేనా యిద్దామని...."

"యూ నాటీ...." అంది లీల కోపం ప్రదర్శిస్తూ.

"యస్ మై స్వీటీ" అంటూ గట్టిగా నవ్వాడు వేణు. అనక నీళ్ళోడుతున్న రెయిన్‌కోట్ విప్పి హేంగర్ చివర్న తగిలించేశాడు. అక్కడే వున్న మంచం మీద కూలబడ్డాడు.

"అబ్బ, ఫాన్ ఆఫ్ చెయ్యరాదూ?" అన్నాడు.

"ఫాన్ ఆపితే దోమలు...."

"వాట్ దోమల్? మస్కిట్వోటో కాయిల్ వెలిగించమని ఎన్నిసార్లు చెప్పాను?" అని నవ్వుతూ, జేబులోంచి పాకెట్ తీసి ఓ సిగరెట్ వెలిగించాడు. గట్టిగా వో దమ్ము పీల్చి, 'అమ్మయ్య' అన్నాడు.

"వేడిగా ఏదైనా తీసుకుంటావా?" అడిగింది లీల.

"అంటే?" కొంటెగా అడిగాడు, "యూ మీన్ కిస్ ఆర్ కౌగిలీ?"

"ఛీ....పాడు మాటలు. ఏమిటివాళ మరీ శృతిమించుతున్నావ్?"

"శృతి మించటం లేదు. శృతి చేస్తున్నాను. ఇన్నాళ్ళ మూగవీణని ఈనాడైనా పలికిద్దామని."

"ఊఁ....కవిత్వం కూడా వస్తోందే!"

"యస్, వచన కవిత్వం. బావుందా?"

"నాకు బావుంది గానీ....యింకెవ్వరికీ వినిపించకు. పాపం, చస్తారు!"

"ఎవరికో ఎందుకు వినిపిస్తాను? నా గానం, నా కవితా నీకోసం!"

నవ్విందామె. "కాఫీ తీసుకుంటావా?"

"నో...నీ కభ్యంతరం లేకపోతే..." జేబులోంచి బాటిల్ తీసి, "ఇది తీసుకుంటాను" అన్నాడు.




"వేణూ...." లీల కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి, "ఏమిటిది? అప్పుడప్పుడు తాగుతావనే అనుకుంటున్నాను గానీ, ఏమిటిలా డైరెక్ట్‌గా నా గదికే తీసుకొచ్చేశావ్?"

"సారీ, నీ గదికని తీసుకురాలేదు. నా గదికే తీసుకువెళ్దామని బయల్దేరాను. చెప్పాను గా, మధ్య దారిలో మతి చెదిరి...."

ఆమె మాట్లాడలేదు. అతను షెల్ఫ్ లోంచి గ్లాసు అందుకున్నాడు. అందులోకి విస్కీ వంచుకుని, జాలో నీళ్ళ కొద్దిగా వొంపుకుని సిప్ చేశాడు.

"ఊఁ.... చెప్పు. ఏమిటి కబుర్లు?"

"అర్ధరాత్రి .... ఆడపిల్లతో ఏముంటాయ్ కబుర్లు?" అంది లీల కొంచెం కోపంగా.

"కరక్ట్. అర్ధరాత్రి ఆడపిల్లతో కబుర్లేమిటి నా పిచ్చి కాకపోతే...." కొంటెగా ఆమె మాటల్ని స్వీకరించి, నవ్వాడు వేణు.

"ఏయ్! బీ ఇన్ లిమిట్స్..."

"లిమిట్స్?? ఏ విషయంలో? మందు విషయంలో లిమిట్స్ దాటినా నాకేం కాదు. ఇక నీ విషయంలో.... మన యిద్దరి మధ్య వున్న చనువుకి అసలు లిమిట్స్ లేవు!" గట్టిగా నవ్వాడు వేణు.

"అలాగే! అసల్నీకు చనువివ్వటం నాదే బుద్ధితక్కువ."

"అవును. ఒట్టి చనువే యివ్వటం బుద్ధితక్కువే!"

"నీతో అసలు మాట్లాడను బాబూ, ప్రతిమాటకీ రెండర్థాలు తీస్తావ్!"

"అవును మాట్లాడొద్దు. వట్టి మాటలు కట్టిపెట్టోయ్ అన్నాడు కదా ఆయనెవరో! వాటివల్ల ప్రయోజనం వుండదు-చేతలు ముఖ్యం."

"..............."

సగం గ్లాసు పూర్తికాగానే వేణు లేచి, ఆమె దగ్గరగా నడిచాడు.

"లీలా, ప్లీజ్....గివ్ మి కంపెనీ!" అంటూ గ్లాసుని ఆమె నోటిదగ్గర పెట్టాడు.

"ఛీ....ఛీ...." అంటూ దూరంగా తోసేసింది లీల.

అతను వదల్లేదు.

"ఇదేనా అర్ధరాత్రి అతిథికి మర్యాద? ప్లీజ్....కొంచెం తీసుకుంటే తప్పేమిటి? జస్ట్ ఫర్ కంపెనీ సేక్...."

ఎడంచెయ్యి భుజం మీదుగా వేసి గట్టిగా పట్టుకుని, కుడిచేత్తో గ్లాసు ఆమె పెదాల దగ్గరికి తెస్తూ మళ్ళా అన్నాడు. ఆమె ఏదో అనాలని నోరు తెరిచింది. చటుక్కున ఆమెని వెనక్కి వంచి, గ్లాసులోని ద్రవం ఆమె నోట్లోకి వంపాడు. రెండు గుటకలు అప్రయత్నంగా మింగి, పొలమారగా దగ్గుతూ సరిగ్గా కూర్చుంది లీల. ఆమెని వదిలేసి, నిటారుగా నిలబడ్డాడు అతను.

"వ్రతభంగం అయిపోయిందిగా! ఇహనైనా యీ కొంచెం....ప్లీజ్!"

ఒక్కసారి అతని మొహంలోకి చూసింది లీల.

"మొండి...." అంటూ గ్లాసు అందుకుని నాలుగు గుక్కల్లో ఖాళీ చేసేసింది.

"ఛీ....ఏం బావుందనీ?" అంది మండుతున్న గొంతు చేత్తో రాసుకుంటూ.

"మొదట్లో బావుండదు. అలవాటయితే అదే మధురంగా వుంటుంది."

"నాకు అలవాటు కానూ వద్దు. దాని మాధుర్యం తెలియనూ వద్దులే!" అంది లీల.

వేణు వెనక్కి వెళ్ళి మంచం మీద వాలిపోయాడు. ఒక్క నిముషం కాగానే,

"లీలా, కాస్త యీ షూస్ విప్పుతావా?" అన్నాడు.

లీల లేచి అతడి కాళ్ళవైపుగా వెళ్ళింది. తడిసిన షూ లేసులు ఓ పట్టాన రావటం లేదు. ముందుకు వంగి, గట్టిగా ప్రయత్నించబోయింది. జారిన పైట ఆమె చేతులమీద అడ్డంగా పడింది.

చటుక్కున లేచి లీల రెండు రెక్కలు పుచ్చుకుని, మంచం మీదకు లాక్కున్నాడు వేణు. లీల బిత్తరపోయింది.

"వేణూ! ఏమిటిది?" అంది. ఆమెని మాట్లాడనీయకుండా పెదాలు మూసేశాడు వేణు.

లీల బలవంతంగా వదిలించుకోవాలని పెనుగులాడింది. వేణు బలవంతంగానైనా సరే లొంగదీసుకోవాలనే పట్టుదలలో వున్నాడు. లీలకున్న బలం పెనుగులాటకి చాలలేదు. వేణు బలం అతని




"వేణూ ...." లీల కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి, "ఏమిటిది? అప్పు డప్పుడు తాగుతావనే అనుకుంటున్నాను గానీ, ఏమిటిలా డైరెక్ట్‌గా నా గదికే తీసుకొచ్చేశావ్?"

"సారీ, నీ గదికని తీసుకురాలేదు. నా గదికే తీసుకువెళ్దామని బయల్దేరాను. చెప్పాను గా, మధ్య దారిలో మతి చెదిరి...."

ఆమె మాట్లాడలేదు. అతను షెల్ఫ్ లోంచి గ్లాసు అందుకున్నాడు. అందు లోకి విస్కీ వంచుకుని, కూజాలో నీళ్ల కొద్దిగా వొంపుకుని సిప్ చేశాడు.

"ఊఁ.... చెప్పు. ఏమిటి కబుర్లు?"

"అర్ధరాత్రి .... ఆడపిల్లతో ఏముం టాయ్ కబుర్లు?" అంది లీల కొంచెం కోపంగా.

"కరక్ట్. అర్ధరాత్రి ఆడపిల్లతో కబుర్లేమిటి నా పిచ్చి కాకపోతే...." కొంటెగా ఆమె మాటల్నే వక్రీకరించి, నవ్వాడు వేణు.

"ఏయ్! బీ ఇన్ లిమిట్స్...."

"లిమిట్స్?? ఏ విషయంలో? మందు విషయంలో లిమిట్స్ దాటినా నాకేం కాదు. ఇక నీ విషయంలో.... మన యిద్దరి మధ్య వున్న చనువుకి అసలు లిమిట్స్ లేవు!" గట్టిగా నవ్వాడు వేణు.

"అలాగే! అసల్నీకు చనువివ్వటం నాదే బుద్ధితక్కువ."

"అవును. ఒట్టి చనువే యివ్వటం బుద్ధితక్కువే!"

"నీతో అసలు మాట్లాడను బాబూ, ప్రతిమాటకీ రెండర్థాలు తీస్తావ్!"

"అవును మాట్లాడొద్దు. వట్టి మాటలు కట్టిపెట్టోయ్ అన్నాడు కదా ఆయనెవరో! వాటివల్ల ప్రయోజనం వుండదు-చేతలు ముఖ్యం."

"                    "

సగం గ్లాసు పూర్తికాగానే వేణు లేచి, ఆమె దగ్గరగా నడిచాడు.

"లీలా, ప్లీజ్ గివ్ మి కంపెనీ!" అంటూ గ్లాసుని ఆమె నోటిదగ్గర పెట్టాడు.

"ఛీ ఛీ " అంటూ దూరంగా తోసేసింది లీల.

అతను వదల్లేదు.

"ఇదేనా అర్ధరాత్రి అతిథికి మర్యాద? ప్లీజ్ కొంచెం తీసుకుంటే తప్పేమిటి? జస్ట్ ఫర్ కంపెనీ సేక్ "

ఎడంచెయ్యి భుజం మీదుగా వేసి గట్టిగా పట్టుకుని, కుడిచేత్తో గ్లాసు ఆమె పెదాల దగ్గరికి తెస్తూ మళ్లా అన్నాడు. ఆమె ఏదో అనాలని నోరు తెరిచింది. చటుక్కున ఆమెని వెనక్కి వంచి, గ్లాసులోని ద్రవం ఆమె నోట్లోకి వంపాడు. రెండు గుటకలు అప్రయత్నంగా మింగి, పొలమారగా దగ్గుతూ సరిగ్గా కూర్చుంది లీల. ఆమెని వదిలేసి, విటారుగా నిలబడ్డాడు అతను.

"వ్రతభంగం అయిపోయిందిగా! ఇహనైనా యీ కొంచెం ప్లీజ్!"

ఒక్కసారి అతని మొహంలోకి చూసింది లీల.

"మొండి " అంటూ గ్లాసు అందుకుని నాలుగు గుక్కల్లో ఖాళీ చేసేసింది.

"ఛీ ఏం బావుందనీ?" అంది మండుతున్న గొంతు చేత్తో రాసుకుంటూ.

"మొదట్లో బావుండదు. అలవాటయితే అదే మధురంగా వుంటుంది."

"నాకు అలవాటు కానూ వద్దు. దాని మాధుర్యం తెలియనూ వద్దులే!" అంది లీల.

వేణు వెనక్కి వెళ్లి మంచం మీద వాలిపోయాడు. ఒక్క నిముషం కాగానే,

"లీలా, కొస్త యీ షూస్ విప్పుతావా?" అన్నాడు.

లీల లేచి అతడి కాళ్లవైపుగా వెళ్లింది. తడిసిన షూ లేసులు ఓ పట్టాన రావటం లేదు. ముందుకు వంగి, గట్టిగా ప్రయత్నించబోయింది. జారిన పైట ఆమె చేతులమీద అడ్డంగా పడింది.

చటుక్కున లేచి లీల రెండు రెక్కలు పుచ్చుకుని, మంచం మీదకు లాక్కున్నాడు వేణు. లీల బిత్తరపోయింది.

"వేణూ! ఏమిటిది?" అంది. ఆమెని మాట్లాడనీయకుండా పెదాలు మూసేశాడు వేణు.

లీల బలవంతంగా వదిలించుకోవాలని పెనుగులాడింది. వేణు బలవంతంగానైనా సరే లొంగదీసుకోవాలనే పట్టుదలలో వున్నాడు. లీలకున్న బలం పెనుగులాటకి చాలలేదు. వేణు బలం అతని




బలవంతపు కోర్కెకి పూర్తిగా సాయ పడింది.

వేణుమీద, భవిష్యత్తుమీద ఎన్నో ఆశలు పెట్టుకున్న లీల అరిచి గోలచేసే ప్రయత్నం చెయ్యలేకపోయింది. ఆమె మనసులో నాలుగో వంతు అతడి కోరిక తోనూ సహకరించింది. ఆ రాత్రి చాలా సేపటికి బలవంతంగా తెల్లవారింది.

* * *

"వేణూ! మన పెళ్ళి సంగతి త్వరగా తేల్చుకోవటం మంచిది" అంది లీల మర్నాటి సాయంత్రం అతణ్ణి కలిసి నప్పుడు.

"పెళ్ళి ...." వక్రంగా నవ్వాడు వేణు, "మారేజ్ ఈజ్ యెనేక్సిడెంట్. ప్రమాదాలు చెప్పి జరగవ్ కదా! అందుచేత పెళ్ళిళ్లూ అంతే! ఎప్పుడెవరికి ఎక్కడ రాసిపెట్టి వుందో దేవుడే రాసి పంపుతాట్టగా! చూద్దాం – మనిద్దరికే రాసుంటే అలాగే జరుగుతుందిగా! తొందరెందుకూ, లెటజ్ వెయిట్ అండ్ సీ!" ఆ మాటలనేసి, అతడు అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

లీల నిశ్చేష్టురాలై కూచుండిపోయింది కాసేపు. ఆ తరవాత ఆమె నెమ్మదిగా తెలివైన ఆలోచనల్లోకి మళ్ళింది.

(మరో మూడు నెలలదాకా తన కొచ్చిన భయం ఏదీ లేదు. ఈలోగా వేణు విషయం స్పష్టంగా తేలుతుంది. ఆనాడు తనకంటూ ప్రత్యేకమయిన భయమేదయినా మిగిల్తే .... అందుకి అధునాతన సమాజంలో ఎన్ని శాస్త్రీయ పరిష్కారాలు లేవూ! అనుకుంది లీల. ఆ నిర్ణయానికి వచ్చేశాకే ఆమెలో మిగిలివున్న భయమూ, బాధా పూర్తిగా తొలిగిపోయాయి!)

———

# వర పుత్రుడు



రేచింట్ల హేమవతి

ఎదురుగా ఉన్న దంపతుల్నీ, వారి చిరంజీవినీ చూచేసరికి స్వామికి పాతిక సంవత్సరాల క్రితం గృహ త్యాగం చేసి పరమగురువుతో బయలు దేరటం గుర్తుకొచ్చింది. తనకు జన్మ నిచ్చినందుకు తను వాళ్లకేం చేశాడు సేవ?....? పోనీ....సన్యాసిగా వాళ్ళకేం ఉపకారం చేశాడు.....?.....?.....?.....

"అంతా దైవేచ్ఛ....!" చిన్నగా నవ్వు కుంటూ ఆ వచ్చిన కుటుంబాన్ని దీవించి పిబూది, కుంకుమ ఇచ్చి పంపించారు స్వామి.

తరువాత పది నిమిషాలలోనే ఆయన యోగనిష్ఠలోకి వెళ్లిపోయారు. గుబురుగా పెరుగుతున్న గెడ్డం, మీసాలలోంచి మబ్బుల్లో చందమామలా కాంతులు ప్రసరిస్తూ చిరునవ్వుతో నిర్మలంగా ఉన్న మొహంలోకి తన్మయత్వంగా చూస్తూ మనస్సుని అంతర్ముఖంగా మరల్చు కోవటానికి ప్రయత్నిస్తున్నారాయన శిష్యులు.

అర్ధరాత్రిలో ఆశ్రమం వరండాలో అటూ, ఇటూ పచార్లు చేస్తున్నారు స్వామీజీ. మనస్సులోనే అంచనాలు వేసుకుంటూ ఆలోచిస్తున్నారు. ఆ అంచనాల పర్యవసానమే మరుసటి రోజున ముగ్గురు శిష్యులతో జీలుగుపట్టు గ్రామానికి ప్రయాణం సాగింది.

* * *

ఆ ఊరికి ఏ స్వామీజీ వచ్చినా రామాలయంలోగాని, ఆంజనేయస్వామి ఆలయంలోగాని ఉపన్యసించేవారు. ఈ స్వామి సరాసరి పాడుబడిన సత్రానికి ఎందుకొచ్చాడో అర్థం కాలేదు. అకస్మాత్తుగా శిష్యులతో సహా స్వామీజీ అక్కడికి వచ్చేసరికి అక్కడ పేకాటలో గోలగా అరుచుకుంటూ సిగరెట్ మీద సిగరెట్ ఊదేస్తూ, ఆ ఊరి యువతుల

వేషభాషలు - ఆకార స్వభావాల మీద జోక్‌లు విసురుకుంటున్న యువక బృందం చేష్టలుడిగి గుడ్లప్పగించి చూస్తుండిపోయింది.

"చూడండి బాబూ! నే చెప్పేది నిదానంగా వినండి. ఈ పేకముక్కలు ఇంత శ్రద్ధగా పంచుకుంటున్నారే మరి! ఈ ఊరిలోని కష్టసుఖాలనూ, ఇబ్బందులనూ కూడా మీరిలాగే పంచుకుంటే...... వాటిని తొలగించటానికి ప్రయత్నిస్తే కాలం సద్వినియోగం అవుతుంది." అన్నారు స్వామి.

ఒకతను హేళనగా నవ్వుతూ "దీంట్లోని థ్రిల్......ఓహ్ మీకు తెలియదు స్వామీ....!"

"నిజమే! నాకు తెలియకపోవచ్చు. కాని.... సంఘసేవలో, తల్లిదండ్రుల సేవలో, న్యాయార్జనలో దీనికంటే రెట్టింపు థ్రిల్ ఉందిబాబూ! దాని అనుభవం పొందితేనేగాని అర్థంకాదు."

ఆ ఊరిలోకెల్లా పచ్చిరౌడీ అని పేరు తెచ్చుకున్న ముకుందం స్వామివైపు విసుగ్గా చూశాడు. "ఇక్కడ అనవసరపు బోధ చెయ్యకండి. ఈ బోధలు ఏ ముసలివాళ్ళదగ్గరకో వెళ్ళి చెయ్యండి. మాలాంటి వారి వద్ద మీ ఉనికి, ఉపన్యాసాలూ సుద్ధ వ్యర్థం. వెళ్ళండి. ముక్కు మూసుకొని మూల కూర్చోవలసిన మీరు ఇలా మా మీదకి దండెత్తటానికి అర్థం?"

స్వామి ముకుందాన్ని చూస్తూ చిరునవ్వుతో తల పంకించారు. "కాలం దగ్గరకొచ్చిన ముసలివాళ్ళేం చెయ్యగలరు బాబూ! రోజుకి కొన్ని నిర్ణీత సమయాలలో ముక్కు మూసుకుని ఈ జగత్సర్వాన్నీ మరచి భగవధ్యాన్నంలో గడపటం ఎంత ముఖ్యమో, మిగతా సమయంలో సంఘసేవ కూడా అంత ముఖ్యం. మీలాంటి యువకులు సంఘసేవకు ముందుకు వచ్చి, ఈ సమయాన్ని చక్కగా వినియోగించాలి."

"ఓహ్హో...హ్హో.... డైలాగులు బా....లా బాగున్నాయి. ఇలాంటి బైరాగుల వల్ల ఎవరికీ లాభం లేదు. దొంగ ఫోజులూ వీళ్ళూను." అన్నాడు ముకుందం మిత్రుడు. మిగతా అందరూ పకపక నవ్వారు.

ఇంకొక మిత్రుడు అతి నిర్లక్ష్యంగా చూస్తూ మళ్ళీ పేకముక్కలు నలుగురికీ పంచాడు. అందరూ ఆ ముక్కల్ని చేతుల్లోకి తీసుకున్నారు. ముకుందం తలెగరేస్తూ "మమ్మల్ని ఏమార్చటం మీ తరం గాదు. మీరేం చెయ్యగలిగితే అది చెయ్యండి." అన్నాడు పొగరుగా.

మిగతా ముగ్గురూ అతన్ని బలపరుస్తున్నట్లు నోళ్ళు అష్టవంకర్లూ తిప్పి వెక్కిరిస్తున్నట్లు వికటంగా నవ్వారు. వారి పిచ్చిచేష్టలు స్వామీజీకి నవ్వు తెప్పించాలి. కాని ముకుందం సవాలు

చేస్తున్నట్లు పలికిన మాటలు వారికి బుద్ధి తెలిపేందుకు దారి, ఉపాయం తెలిపాయి.

కొంచెం సేపు కళ్ళు మూసుకొని నిశ్చలంగా నిలిచారు. తర్వాత కనులు విప్పి చికిలించి వారి చేతులలో ఉన్న పేకముక్కలవైపు చూశారు స్వామీజీ. అవి భగ్గున అంటుకున్నాయి. చేతులు చుర్రుమనటంతో, తెల్లబోతూ చేతిలో ఉన్న పేకముక్కలు కంగారుగా క్రిందకి పదిలేశారు.

"ఏం బాబూ! వదిలేశారేం? భద్రంగా దాచుకోండి వాటిని. థ్రిల్ అనుభవిద్దురు గాని." అన్నారు స్వామి అదే చిరునవ్వుతో.

"మాడి మసైపోయాయ్. అవెందుకు....?" అన్నాడు ముకుందం. మిగతా యువకులు ఈ సంఘటనతో కాస్త బెదిరారనే చెప్పవచ్చు. కాని.... ముకుందం.... మాత్రం....? ఊహు....!

"ఈ పేకాటల్లో పడి బ్రతుకుని అశ్రద్ధ చేస్తే మీ జీవితాలు, మీ ప్రక్కనున్న వారిజీవితాలూ 'ఇదిగో' ఇలాగే మాడి మసైపోతాయి. మీకు.... ఆ కాలి మసైన ముక్కలకున్న విలువే మిగుల్తుంది. బాగా ఆలోచించి మీ ఈ దురలవాటు మానుకోండి!" నిదానంగా చెప్పారు స్వామీజీ.

నలుగురు మిత్రులూ ఒకరి నొకరు చూచుకొన్నారు. ముకుందం మిగతావారి వంక విప్లవాత్మకంగా చూడటంతో ఆ సైగను అర్థంచేసుకొన్న ముగ్గురు మిత్రులూ స్వామీజీని హింసించి అవమానించాలనే దృష్టితో ముందడుగు వేశారు. తలమీద, వీపుమీద, గుండెల మీద, ముఖం మీద నలుగురూ కలిసి దబదబ బాదారు. తమ మోచేతులతో అందిన చోటెల్లా పొడిచారు. స్వామీజీ ఏమాత్రం చలించలేదు. వారు నలుగురికీ విపరీతమైన ఆశ్చర్యం వేసింది.

నలుగురూ కలసి స్వామీజీని ఎత్తి కిందవేసి బాగా అణగతొక్కాలనుకొన్నారు. ఇద్దరు చేతులూ, ఇద్దరు కాళ్ళూ పట్టుకున్నారు. నలుగురూ దృఢకాయులే. ఏం లాభం....? ఎంత శ్రమ పడినా స్వామీజీని అంగుళం కూడా కదల్చలేకపోయారు. వారిలో పట్టుదల పెరిగింది. మరింత బండతనంగా వాళ్ళ శక్తినంతా పణంగా పెట్టి మళ్ళీ, మళ్ళీ, మళ్ళీ ప్రయత్నించారు. చమటలు పట్టి వాళ్ళ శరీరాలు అమితంగా అలసిపోయాయి తప్ప ఇంకేమీ మార్పు కనిపించలేదు. అశక్తతమీద వాళ్ళకే చాలా కోపం వచ్చింది. ముఖ్యంగా ముకుందానికి అవమానంతో దుఃఖంకూడా వచ్చేసింది. కాని....ఇంకోపక్క మహా ఆశ్చర్యంగా ఉంది కూడా!

'ఇంత సన్నని స్వామీజీలో అంత శక్తి ఏమూల దాగివుంది? ఏమిటీ మాయ? తన శక్తి....ఇంతేనా? తనను మించినవాడెవడూ లేడనుకున్నాడే?'

విచిత్రంగా స్వామివంక చూస్తుండి పోయాడు ముకుందం.

మిగతా ముగ్గురూ "క్షమించండి స్వామీ" అంటూ కన్నీరు కారుస్తూ ఆయన పాదాలమీద ఒరిగిపోయారు.

అప్యాయంగా వారి తలలు నిమిరి "బాబూ! ఉన్న ఆయుష్షు కాస్తా ఇలాంటి వ్యసనాలకి ఖర్చైపోతే ఇంక మనిషి జన్మెత్తింది ఏం చెయ్యటానికి? కేవలం చెడ్డ పనులు చెయ్యటానికి మాత్రమేనా? చెడు స్నేహాలు మానేసి బుద్ధిగా బతకండి. సద్బుద్ధి సద్వృత్తిని చూపుతుంది. పోయిరండి" అని దీవించి పంపించారు స్వామీజీ.

వారు వెడుతూ ముకుందం వంక 'నువ్వు కూడా వస్తావా?' అన్నట్లు చూశారు. కాని ముకుందం వారిని గమనించలేదు. ఏదో అలౌకికమైన దృశ్యం చూస్తున్నట్లూ, తానేదో అపూర్వమైనదాన్ని కనుగొన్నట్లూ స్వామీజీని ఆసక్తిగా చూస్తూ నుంచున్నాడతడు.

ముకుందం వంక ప్రీతిగా చూస్తూ 'ముకుందం!' అన్నారాయన.

ఉలిక్కిపడి "నా పేరు మీ కెలా తెలుసు?" ఆశ్చర్యంగా అడిగాడు.

"తమ్ముడిపేరు అన్నగారికి తెలియటంలో ఆశ్చర్యమేముంది!"

అర్థంకాక కనుబొమలు ముడివేసి స్వామీజీకేసి చూశాడు ముకుందం.

"లౌకిక భాషలో, బాంధవ్య పరిగణనలో, ఈ జన్మ కథలో నువ్వు నా శరీరానికి తమ్ముడివి. నా శరీరం నీకు అన్నగారవుతుంది."

"నాకు...నాకు నమ్మకం కుదరటం లేదు." బేలగా అన్నాడు ముకుందం.

ఒకగంట తర్వాత స్వామి ఆనతి ప్రకారం స్వామీజీ శిష్యులతోబాటు ముకుందం కూడా కోనేటిలో స్నానం చేసి బట్ట పిండి ఆరేసి, అవి ఆరాక కట్టుకుని వచ్చి స్వామికి చేతులు జోడించి అతని సమీపంలో కూర్చున్నాడు. స్వామీజీ చెప్పే మాటలకోసం అతని మనస్సు, చెవులు ఆత్రపడుతున్నాయి.

* * *

వసుంధర మాటలను కాదనలేక బైరాగిని లోపలికి పిలిచాడు భాస్కరం. ప్రకాశిస్తున్న బైరాగి ముఖంలోకి చూస్తూ భక్తిగా నమస్కరించింది వసుంధర. భార్య ననుసరించాడు భాస్కరం. మనసులో భార్యమీదున్న విసుగు చెదిరిందతనికి. బైరాగి ముఖంలోని దివ్యతేజస్సు చూచి చకితుడయ్యాడు భాస్కరం.

వసుంధర వేసిన చిరుచాపను ప్రక్కకి తోసి జింకచర్మం పరచుకొని దానిపై ఆశీనుడయ్యాడు బైరాగి. హృదయం చేస్తున్న తొందరకు నిదర్శనంగా వసుంధర తనచేతిని చాచి అతని ముందుంచింది. ఆతృత నిండిన ఆమె

ముఖాన్నవలోకించిన బైరాగి చెయ్యి చూడకుండానే చెప్పసాగాడు,

"అమ్మా నువ్వు మాతృత్వంకోసం పరితపిస్తున్నావు. నీకు సంతానం కలుగుతుంది తల్లీ....నీ కోరిక తప్పక నెరవేరుతుంది ..."

"ఎప్పుడు స్వామీ .... ఎప్పుడు?" సంతోషంతో కంగారుగా ప్రశ్నించింది ఆమె.

"చాలా కష్టనష్టాల అనంతరం....నీ గర్భం ఫలిస్తుంది. వికలాంగులకు దండిగా దానధర్మాలు చెయ్యి. నీమీద ఆధారపడిన వారిని కనికరించు నీమీద కృతజ్ఞత కలిగేలా వ్యవహరించి ఆ దీనుల దీవెనలందుకో. భగవద్భక్తిని పెంచుకో." కనులు మూసుకొని యోచిస్తూ చెప్పాడు బైరాగి.

"అలాగే స్వామీ! మీ మాటను అనుక్షణం గుర్తుంచుకొని ఆచరిస్తాను. ఆశీర్వదించండి" సాష్టాంగపడింది వసుంధర.

"మంచిదమ్మా! నీకు పుత్రుడుదయించగానే శ్రీశైలం ప్రాంతంలో అరణ్యంలోని మఠాన్ని మనసారా స్మరించు తల్లీ. నా ధ్యానమే నీ పుత్ర జనన వార్త నాకు తెలుపగలదు."

అంగీకారంగా తలూపింది వసుంధర. భాస్కరానికి చిన్నతనం నుంచీ బైరాగుల మీదున్న చులకన భావం ఈనాడే స్వామిని చూడగానే పటాపంచలైంది. నాగస్వరం విన్న సర్పంలాగ విన్రముడై బైరాగి మాటలు వింటున్నాడు భాస్కరం. ఇద్దర్నీ శాంతదృష్టితో చూస్తూ "త్యాగబుద్ధి అలవర్చుకోండి. మీకు ప్రాణప్రదమైన దాన్ని త్యాగం చెయ్యాల్సి వచ్చినా జంకకుండా మనస్ఫూర్తిగా త్యాగం చెయ్యండి. దైవం మిమ్మల్ని మెచ్చి .... మీకు మేలు చేయుగాక ...." గంభీరంగా చెప్పి లేచి నుంచున్నాడు బైరాగి.

"స్వామీ....!" దంపతులిద్దరూ ఒకేసారి అన్నారు. వారి కళ్ళల్లోని అభ్యర్థన, సంశయం కనిపెట్టిన బైరాగి చిరునవ్వుతో "బైరాగిని నాకేం కావాలమ్మా! నాకు కావల్సినది లోకకళ్యాణం. అవసరమైన సమయంలో నేనే వచ్చి మీరివ్వవలసిన సహాయం అర్థిస్తాను. సడలని ధైర్యంతో భగవానుని అర్చించండి." అంటూ వారి జవాబుకై ఎదురుచూడకుండా చరాచరా సాగిపోయాడు బైరాగి.

బైరాగి ఆఖరి మాటలు విచిత్రంగా విన్పించాయి భాస్కరానికి. వసుంధర భక్తిగా బైరాగి వెళ్ళినవైపే చూస్తూ ఉండిపోయింది. సంతాన భాగ్యంకోసం తాము చెయ్యబోయే సత్కార్యాలను ఆమె మనస్సులో చిత్రించుకోసాగింది.

* * *

వసుంధర,భాస్కరం పుణ్యక్షేత్రాలు దర్శిద్దామని బయలుదేరారు. సమయానికి వాహనాల సౌకర్యం దొరికేది గాదు.







దానిమూలంగాకొంత,కొంత పాదయాత్రే చెయ్యాల్సి వచ్చేది. ఆ యాత్రలో ఎన్నో ఇబ్బందులను, అవస్థలను ఎదుర్కొన్నారు. వారి పొరుగు యాత్రికులు బుద్ధిమంతులు కాకపోవటంతో, వారినుంచి నిందలూ, మనోవ్యధా భరించారు. కొన్నిచోట్ల త్రాగటానికి నీరుకూడా దొరికేది కాదు. ప్రతీ చిన్న విషయానికి చిరాకుపడే భాస్కరం ఓర్పుగా ఉండటం చూసి ఆశ్చర్యంగా ఉండేది వసుంధరకి. ఆ మాటే భాస్కరంతో అంటే "ఈ పరిస్థితుల్ని బట్టి ఆలోచిస్తే ఇదంతా దైవపరీక్షేమో అన్పిస్తోంది" అన్నాడు భాస్కరం. "నిజమేనేమో" సంతోషంగా అనుకొన్నదామె.

ఎంతటి చిక్కు పరిస్థితులొచ్చినా దేనినీ నిందించలేదా దంపతులు. ప్రతీ ఆలయంలోనూ భార్యతో కలసి సంతాన ప్రాప్తికోసం ఎన్నడూ ఎరుగనంత శ్రద్ధగా ప్రార్థించాడు భాస్కరం. ముఖ్యమైన యాత్రాస్థలాలన్నీ చూసి వెనుతిరిగారు.

ఇంటికి వచ్చేసరికి తలుపులన్నీ సగం, సగం పగులకొట్టి ఉన్నాయి. ఇనప్పెట్టె అంతా ఖాళీ. ఎవర్ని నిందించగలరు? ఇరుగుపొరుగువాడు వచ్చి "చప్పుళ్ళు విని మొగవాళ్ళను లేపి, మేమందరం కలసి వచ్చేసరికి దొంగలు పారిపోయారు" అని చెప్తే "అంతా దేవుని లీల. మధ్య మీరేం చెయ్యగలరు." అని చెప్పి వచ్చినవారందరికీ ప్రసాదం,

పసుపు, కుంకుమ లిచ్చి పంపింది వసుంధర.

'ఈ ఇబ్బందులన్నీ పంటలు రాగానే సర్దుకుంటాయిలే,' అనుకొని దంపతులు ఒకరికొకరు ధైర్యం చెప్పుకొన్నారు. కాని ఆ యేడు కురిసిన అతివృష్టి ఫలితంగా పంటలన్నీ పాడయిపోయాయి. పిల్లా, పాపలతో తిండికి లేక అల్లాడి పోతున్న ఆ రైతు కుటుంబాలను చూసి వారిని పంటగింజలు అడగలేదు సరిగదా తమవద్దనున్న ధాన్యం తమతోబాటు వారికే పంచారా పుణ్యదంపతులు

సంస్కృతాంధ్రాలలో పాండిత్యం గడించిన భాస్కరం ఆ ఊరిలోని హైస్కూల్లో ఉపాధ్యాయుడుగా పని చెస్తున్నాడు. ఆ సంవత్సరం అంతా ఆ జీతం రాళ్ళతోనే సరిపెట్టుకున్నారు. "ఎంత లక్షాధికారినైనా కాలం భిక్షాధి కారిని చెయ్యగలదనటానికి నిదర్శన మిదే" అన్నాడు భాస్కరం.

కాలం నిదానంగా గడుస్తోంది. తర్వాత సంవత్సరం అనావృష్టి ఫలితం కొంత, తెగుళ్ళు పట్టి కొంత పంటలు నశించిపోగా, రెండవప్రక్క "వినాశ కాలే విపరీత బుద్ధి" అన్నట్లు సమ్మెలు జరిపి హైస్కూలు మూసివేయటం వల్ల ఆ ఆధారం కూడా ఆగిపోయింది వారికి.

నిరంతరావస్థలకు గురైనారు. ఆ పరిస్థితిలో ఆ కరువు, కాటకాలకు తట్టుకోలేక విసిగిన ఆ దంపతులకు 'బైరాగి' చెప్పిన సూక్తులు గుర్తొచ్చి వారి విసుగును 'సంతానభాగ్యమనే' తరగం వచ్చి చెరిపేసేది. సుడిగాలి ఎదరనున్న దూదిపింజల్లా చెదిరి తునా తునకలై దానిస్థానే శాంతి, భక్తి మొలకలెత్తి వృద్ధిచెందేవి.

"మనకి మంచిరోజులు రాబోతున్నాయి. అందుకే ఈ అనర్థాలన్నీ సమూహంగా మనపై దండెత్తుతున్నాయి. చీకటి ఉధృతం హెచ్చాకే గదా ఆ చీకటి చెదిరి వెలుగురేఖలు వచ్చి సూర్యోదయ మయ్యేది?" అనుకొని దంపతు లిద్దరూ మంచి రోజుల కోసం ఎదురుచూడ సాగారు.

* * *

"ఏమండీ మరొక్కసారి ఆ మల్లి కార్జునుడి దర్శనం చేసుకోవాలని కోరికగా ఉందండీ" అన్న వసుంధర కోరికని అన్ని ఇబ్బందులైనా వాయిదా వెయ్యలేదు భాస్కరం.

పాఠశాల తెరిచి జీతం అందగానే భార్యను తీసుకొని యాత్రకి బయలు దేరాడు భాస్కరం. ఉపవాసంతో కాలి నడకన కొండ ఎక్కుతున్న వసుంధర మనస్సులో 'మల్లికార్జున స్తుతి' పఠిస్తున్నది. స్వామి సాకార వర్ణనతో ఆమె హృదయం నిండిపోయింది ఆమె కన్నులకు సర్వం ప్రకాశమయంగా, జ్యోతిర్మయంగా కన్పట్టింది. శరీరం మాత్రం నిస్సత్తువగా సొమ్మసిల్లింది.

ఆమె భక్తిపారవశ్యం ఎరిగివున్న భాస్కరం కంగారుపడలేదు. అతి సున్నితంగా ఉన్న భార్యను మెల్లగా ప్రక్కకు జరిగి పరుండజేసి మరచెంబులోని చల్లనినీరు ఆమె వదనమ్మీద చిలకరించి భార్యకు తెలివి తెప్పించాడు. మృత్యుంజయ స్తోత్రం చదువుతూ భార్యను లేవదీశాడు.

ప్రక్కనుంచి నడచిపోతున్న కాషాయాంబరధారి వీరిరువుర్నీ చూచి చిరునవ్వుతో "నీవు ధ్యాన్నించు మృత్యుంజయుడై నీ ఇంట వెలయునులే" అనటం విని ఆశ్చర్యంగా అటు చూశారు. భక్తిగా నమస్కరించారు. అప్పటికే అతడు మూడు మెట్లు దాటిపోయాడు. సన్యాసి ఆశీస్సు విన్న వసుంధర రెట్టించిన ఉత్సాహంతో మెట్లెక్కటం మొదలెట్టింది.

* * *

శ్రీశైలం నుంచి వచ్చిన తర్వాత తొమ్మిది నెలలు నిండుతూనే పండంటి బిడ్డనెత్తుకొంది వసుంధర. నామకరణం పీటలమీద కూర్చున్న వసుంధరకి శ్రీశైలం మెట్లమీద దీవించిన సన్యాసి మాటలు గుర్తొచ్చి "నా బాబు మృత్యుంజయుడు. పుట్టకముందే పేరు స్థిరపర్చుకున్నావా తండ్రీ" అంటూ ముద్దుచేసింది. ఆ పేరే భాస్కరం బియ్యం నింపిన పళ్ళెరంలో వ్రాశాడు.

* * *

అల్లారుముద్దుగా పెరుగుతున్న మృత్యుంజయుడు నాల్గవ ఏటనే వారి పూర్వాచార ప్రకారం అక్షరాభ్యాసం చేయించుకొని చదువులో ప్రవేశించాడు. "ఓం నమఃశివాయః" మొదలుపెట్టిన వారం రోజులకే మొదటి తరగతి పుస్తకంలోని పేర్లు చదవటం మొదలు పెట్టాడు. ఒకసారి చదివిన వాక్యాన్ని రెండవసారి చూడకుండా అప్పజెప్తున్న కుమారుని జ్ఞాపకశక్తి అతని తల్లి దండ్రుల్ని తబ్బిబ్బు చేసింది.

జాతకం వ్రాయటంలో మంచి అనుభవం ఉన్న వసుంధర తండ్రి మృత్యుంజయుడి జాతకం చూసి నిర్ఘాంతపోయాడు. కాని అతడే విషయమూ ఎవ్వరికీ చెప్పలేదు. మామగారు బాలుని జాతకం చూసి కూడా ఏమీ చెప్పకపోవటంతో దానికి అనేక కారణాలు సృష్టించుకొని తల్లడిల్లిపోయాడు భాస్కరం. అతడు మామగార్ని ఏ సంగతీ చెప్పమని బలవంతం చెయ్యటంతో ఇంక విధిలేక "మన మృత్యుంజయుడు సామాన్య బాలుడు కాడు. మనం చెయ్యగలిగిందేమీ లేకపోయినా ఒక కంట అతడిని కనిపెడుతూ ఉండు క్రమేపీ నీకే తెలుస్తుంది" అని మాత్రం చెప్పాడు.

మృత్యుంజయుడు తన ఆరవయేడు పూర్తయేసరికి నాలుగు తరగతుల పుస్తకాలు సునాయాసంగా ముగించాడు.

పట్టుమని పదినిమిషాలు కూడా పుస్తకం ముట్టని మృత్యుంజయుడు రెండు సంవత్సరాలలో నాలుగు తరగతులు ముగించేసరికి విస్తుపోయారు భాస్కరం, వసుంధర.

మృత్యుంజయుడ్ని గురించే ఆలోచిస్తున్న వసుంధరకి ఆరోజు సరిగ్గా నిద్రపట్టలేదు. "వయసుకి మించిన తెలివి మృత్యుంజయుడికుండటం మంచి లక్షణమా?" అనే ఆలోచన వచ్చేసరికి వసుంధర గుండె దడదడ లాడింది. తన తండ్రి భర్తను రహస్యంగా తీసుకెళ్ళి ఏదో చెప్తూంటే తమా చాటునుంచి కుతూహలంగా విన్న సంగతి గుర్తొచ్చిందామెకు.

తండ్రి తన దగ్గర ఆ విషయాలు వివరంగా చెప్పకపోవటానికి కారణం ఏమిటి? ఇన్నాళ్లూ తనా విషయాన్ని ఎందుకు అశ్రద్ధ చేసింది? తండ్రి హెచ్చరిక గుర్తొస్తూనే కొడుకు పుస్తకాలు పరీక్షిద్దామని గబగబా లోపలి గదిలోకి వెళ్ళిందామె. మృత్యుంజయుడి అలమరు తెరచి అతని క్లాసు పుస్తకాలన్నీ పరీక్షించింది.

ఇంకా అడుగున ఉన్న పుస్తకాలు తీసి పేజీలు తిరగేసిన వసుంధరకి ముచ్చెమటలు పోశాయి. ఆశ్చర్యం, దుఃఖం, సంతోషాలతో ఉక్కిరి బిక్కిరవుతూ భర్తను కుదిపి లేపింది. భర్త బద్ధకం వదిలించి విషయం వివరించింది. సంగతంతా విన్న భాస్కరం "నేను వాడి ధోరణి చూస్తూనే ఉన్నాను. వాడు చదువు నేర్చుకొంటున్నట్లెప్పుడూ కనబడడు. ఎప్పుడూ ఏదో జ్ఞాపకం చేసుకుంటున్నట్లే కనబడతాడు. ఊం నడు చూద్దాం" అంటూ భార్య వెనకాలే అడుగువేశాడు భాస్కరం.

పద్యాలు చెప్పటానికే నోరు తిరగని వయస్సుగల మృత్యుంజయుడినోట్సుల్లో అన్నీ సంస్కృత శ్లోక పరంపరలే. వాటిని భర్తకు చూపించి అర్థం అడిగింది వసుంధర.

ఎంతో నీతిని బోధించే ఆ శ్లోకాల్లో అంతా కఠిన సంస్కృత పదజాలమే. అవన్నీ చదువుతూ తనని తానే మరచిపోయాడు భాస్కరం. చదివి తానర్థం చేసుకొని వసుంధరకు చెప్తూ నాలుగు పేజీలు పూర్తిచేసేసరికి తెల్లవారు ఝామయింది. కోడికూత ధ్వనితో ఈ లోకంలోకి వచ్చిపడ్డారా భార్యాభర్తలు.

ఆ మరునాటి రాత్రి భాస్కరమే పుస్తకాలన్నీ వెదికి, వెదికి వెలికితీశాడు. ఒక్కొక్క పుస్తకం ఒక్కొక్క సాటిలేని కావ్య కళాఖండం. భాస్కరం ఆశ్చర్యానందాల్ని కూడా మరచిపోయి గ్రంథ పఠనంలో మునిగిపోతున్నాడు. రోజుకొక గ్రంథాన్ని పరిశీలించి భద్రపరచుకుంటున్నాడతడు.

ఆరోజు ఆఖరి పుస్తకాన్ని తీశాడు. "స్వీయకథ" అనే అక్షరాల్ని విస్మయంగా

చూస్తూ పేజీలు తిప్పాడు. అందులో ఒకపుట అతన్ని అమితంగా ఆకర్షించింది.

"నేను రాజశేఖరుడిని. నా కావ్యాలలో, గ్రంథాలలో నిత్యం తప్పులు పట్టే రామభద్రయతిని ఎదిరించాను. కోపంతో రెచ్చిపోయి అతనిని నానా దుర్భాషలాడాను. 'తన కోపం తన శత్రువు !' అను నానుడి నాయందు నిరూపితమైంది. రామభద్రయతి "శాపం" వల్ల క్రితం జన్మలో యతిని కాలేకపోయాను. అయిష్టంతోనే పెండ్లాడి, బిడ్డల్ని కని వారిని సాకలేక, విస్మరించలేక నలిగి, నలిగి పరలోకాని కేగాను. నా ఈ జన్మకు కారకుడైన రామభద్రయతి దర్శనం ఎప్పటికో ?

ఆయన ఈ ఇంటివాకిటకి వచ్చి నాకీ భవబంధ విముక్తి కావిస్తానని వాగ్దానం చేసి, మరీ, మరీ ఒప్పించి నన్ను వీరి కొమరుని గావించాడు.

ఆయన రాకతో నాకు శాప విముక్తి అవుతుంది. నేను యతిని అవుతాను"

ఈ పై వాక్యాలు చదివిన భాస్కరానికి పితృవాత్సల్య బాష్పధారలాగలేదు.

తానెంత అదృష్టవంతుడు? తా నెప్పుడో చదువుకొన్న రాజశేఖర చరిత్ర ! ఇతనిదే ! సందేహం లేదు" అను కొన్నాడు

అయితే రామభద్రయతి దర్శనం తనకూ అవుతుందా ? ఎవరతడు ? ఎక్కడుంటాడు ? నిజంగా అతడింకా బ్రతికే వున్నాడా ? యిప్పటి రాజశేఖర చరిత్ర ? అప్పటి రామభద్రయతి ఇప్పటికీ ఓహ్ యతీశ్వరులకు అసాధ్యమేముంది ?

ఇదంతా తెలిస్తే వసుంధర ఏమౌతుంది ? ఇహలోక బంధాలు త్రెంచుకొన్న చిన్నారి మృత్యుంజయుడ్ని విడిచి ఉండగిలదా ? తన కొమరుని స్థితికి ఆనందం ఒకప్రక్క, లేక లేక కలిగిన ముద్దుబిడ్డడు దూరమవుతాడే అనే చింతతోనూ నలిగిపోతున్నాడు భాస్కరం.

అతడి దుఃఖ, సంతోష మిశ్రిత పరిస్థితి గ్రహించిన వసుంధర భర్తను తరచి, తరచి అడుగగా "మన బాబు మనకు దక్కడు వసుంధరా" అన్నాడతను నిట్టూరుస్తూ.

"అంటే అంటే " నీటిపొర మెరిసింది వసుంధర కంటిలో.

"కంగారుపడకు. క్షేమంగా నే ఉంటాడు. కాని ముందు, ముందు మనతో కలసి ఉండకపోవచ్చును. మనకు బాబు దూరమైపోతాడనిపిస్తోంది నాకు." భార్యకు ధైర్యం చెప్పిన భాస్కరం కళ్ళు కూడా చెమర్చాయి.

నిదానంగా విన్న వసుంధర మొహం నిస్తేజంగా అయిపోయింది.

"జరిగేది జరగక మానదు. అంతా భగవద్విలాసం" భార్యకి నచ్చచెప్తూ

తనకి తానే, మనస్సుకి వైరాగ్యశిక్షణ ఇచ్చుకోవటం ప్రారంభించాడు భాస్కరం.

* * *

అంతా అర్థం చేసుకొని హరాయించుకోలేని వసుంధరకి అయోమయంగా రోజులు గడుస్తున్నాయి. మమతా బంధాలను దూరంగా నెట్టి ఆ శుభ సమయం కోసం ఎదురుచూస్తున్నాడు భాస్కరం.

ఒకనాటి అర్ధరాత్రి అకస్మాత్తుగా మెలకువ వచ్చి మళ్ళీ నిద్రపట్టలేదు భాస్కరానికి. త్వరలో ఏదో ఘటన జరగబోతోందని మనస్సు తొందర చెయ్యటం మొదలెట్టింది. మెల్లగా భార్య, కొడుకు పడుకున్న మంచం దగ్గరకెళ్ళాడు. గాఢంగా నిద్రపోతున్న వసుంధర మొహంలో ఒకప్రక్కగా సన్నని నిస్పృహరేఖ తారట్లాడటం గమనించి ఆవేదనగా నిట్టూర్చాడు.

యోగనిద్రలో ఉన్నట్లు చేతుల్ని గుండెమీద ధ్యానరూపంలో జోడించి నిద్రపోతున్నాడు పాలబుగ్గల మృత్యుంజయుడు. వెనుతిరగబోయిన భాస్కరానికి ఏదో స్ఫురణకు రాగా మెల్లిగా వంగి "మృత్యుంజయా బాబూ! !" అని పిలిచాడు. దానికి ఎటువంటి జవాబు రాలేదు.

వసుంధర మాత్రం ప్రక్కకి వత్తిగిలి పడుకుంది.

కొంతసేపాగి "రాజశేఖరా !" నెమ్మదిగా పిలిచాడు భాస్కరం. మృత్యుంజయుడు "ఊఁ " అన్నాడు.

"నీ కెవరు కావాలి" అడిగాడు భాస్కరం.

"రామభద్ర యతీశ్వరులు కావాలి. వచ్చారా ! ఏరీ !" అంటూ హఠాత్తుగా విడిగా లేచి కూర్చున్నాడు మృత్యుంజయుడు. వసుంధర కూడా ఉలికిపడి లేచి కూర్చుంది. బెంగగా ఉందామెకు. ఈ సంఘటన చూచి పుట్టెడు దుఃఖ పడింది. కాని ఏం చెయ్యగలదామె? భగవధ్యాన్నం చేస్తూ "కొడుకుని నాకు దక్కించు భగవాన్" అని వేడుకొన్నది. ఆమె దీనవదనం భాస్కరాన్ని కలవర పరచింది.

* * *

ఒక శుభోదయాన మృత్యుంజయుడు పుట్టుకను తెలిపిన బైరాగి వారింటి తలుపు తట్టాడు. తలుపు తీసిన భాస్కరం, లోపలినుంచి వచ్చిన వసుంధర బైరాగికి సాష్టాంగపడ్డారు. బైరాగిని చూడగానే గతంలో అతడు చెప్పిన "త్యాగబుద్ధి అలవరచుకోండి" అన్న మాటలు గుర్తొచ్చాయి భాస్కరానికి.

ఉత్కంఠ దాచుకోలేక "మీరు రామభద్రయతీశ్వరులా స్వామీ!" అని అడిగాడు భాస్కరం.




"అవును " అన్నారాయన చిరునవ్వుతో.

తెల్లబోయి చూస్తున్న వసుంధరకి ఆ రోజు రాత్రి "కొడుకు నోటినుంచి వచ్చిన పేరిదే!" అర్థమైంది.

ఏదో తెలియని భీతి కలిగి భర్తవైపు చూసింది బేలగా.

బైరాగి ఆజ్ఞతో అంతా వివరంగా ఆమెకు చెప్పాడు భాస్కరం. లోకమంతా చీకటైనట్లు అయి తెలివి తప్పిందామె. ఎన్నో ఉపచారాలు చేశాక స్పృహవచ్చిన వసుంధర బైరాగిని "మోసగాడనీ, మాంత్రికుడనీ" నిందించింది. పోలీసులకు పట్టిస్తానని బెదిరించింది. ఇంకా ఏవేవో నానామాటలూ అంది. ఆమె పుత్రవాత్సల్యం పీడలేక అలా గడబిడ చేస్తోందని తెలుసు భాస్కరానికి. ఆమె చేస్తున్న తప్పిదానికి ఆ బైరాగి ఏమి శపిస్తాడోనని భయంతో తల్లడిల్లిపోయాడు భాస్కరం. అతనికీ వసుంధర పుత్రప్రేమ ఒక సమస్యలాగే అన్పించింది.

కాని బైరాగి చిరునవ్వుతో అన్నీ భరించాడు. ఆమెను రెచ్చగొట్టకుండా పసిపాపను చూసినట్లు వాత్సల్యంగా చూశాడామెవైపు.

చివరకు వసుంధర దుఃఖంతో "వరం ఇచ్చినట్లు మాకు పుత్రుడు కలుగుతాడని దీవించావు. వాడిని మళ్ళీ నీవే తీసుకొని మమ్మల్నన్యాయం చేస్తావా స్వామీ! నా కొడుకును నానుంచి దూరం చేసిన పాపానికి నీకు నరకం ప్రాప్తించదా!" అంటూ దీనంగా ప్రార్థించింది.

మానసిక వైకల్యాన్ని భరించలేక

ఎత్తి అంతలోనే బైరాగిని దూషించింది. బైరాగి కోపం తెచ్చుకోలేదు. ఎంతో ఉన్నతంగా మానవధర్మాన్నీ, భగవత్సృష్టినీ విడమర్చి బోధించాడు.

"అమ్మా నువ్వు మాతృదేవతవి. నీ మనోవ్యథ ఎటువంటిదో నాకు తెలుసు తల్లీ. కాని ఆ మాణిక్యకాంతినీ, దాని ఫలితాన్ని మనం ఒక్కళ్ళమే అనుభవించాలనే స్వార్థం కంటే దేశం—లోకం అందరూ ఆ మాణిక్య ప్రకాశాన్నీ, అది బోధించే సుసూక్తినీ పంచుకోవాలనే ఉద్దేశ్యం ఉత్తమమైనది."

"నీ మృత్యుంజయ కుమారుడు కారణజన్ముడు. అతన్ని కన్న నీకు లోకం జోహార్లు అర్పిస్తుంది. జన్మనిచ్చిన తల్లిదండ్రుల్ని మరచే దుర్గుణం నీ మృత్యుంజయుడి వద్ద లేదమ్మా! నా మాట నమ్ము తల్లీ!"

"నీవు త్వరలోనే గర్భం దాల్చి నీ వంశం నిలబెట్టే సుపుత్రుడినీ, ఏడేడు తరాల్ని తరింపజేసే సద్గుణవతియైన సుపుత్రికను కవల సంతానాన్ని పొందబోతున్నావు. నిరాశ, నిస్పృహలను దరిచేరనీయకు. ప్రతీ కుటుంబంలోనూ నలుగురిలో ఒకడు యోగై, విషయ వాంఛలకు దూరమై దేశానికి ఉపయోగపడితే, సంఘ–దేశ–లోక అభ్యుదయానికి నడుంకడితే ఏ దేశంలోనూ కరువు కాటకాలుండవు. దేశం సుభిక్షమవుతుంది. స్వార్థాన్ని విడనాడు తల్లీ. కలగబోయే సంతానం నీకు కన్నుల పండుగ చేయగలదు. నీ ఈ మృత్యుంజయుడిని మాత్రం దేశాని కర్పించు తల్లీ."

వసుంధర నిశ్శబ్దంగా కూర్చుండిపోయింది బొమ్మలాగ. ఆమె యోచనా ముద్ర చూచిన బైరాగి 'లోహం వేడెక్కి ఉన్నప్పుడు వేసిన దెబ్బలకే బాగా సాగుతుందని' గ్రహించిన కమ్మరిలాగ సమయం కనిపెట్టి తన బోధ తిరిగి కొనసాగించాడు.

"అమృతం లాంటి ఔషధాన్ని రోగికివ్వకుండా సీసాలోవేసి దాన్ని అతి భద్రంగా దాస్తే ఏమైనా ప్రయోజనం ఉందమ్మా! నువ్వే ఆలోచించు. ఇలాంటి వరపుత్రుడిని కన్నందుకు మీరిద్దరూ పుణ్యదంపతులుగా ఖ్యాతి పొందుతారు. ఇంతటి వరపుత్రుని కని జగత్తుకి అర్పిస్తున్నందుకు ఆనందించాలి గాని దుఃఖించటం అవివేకం తల్లీ."

దైవోపదేశం వింటున్నట్లు అంతా విన్నది వసుంధర. మెల్లిగా బాహ్య దృష్టిలో పడింది. తన తప్పిదాలను మన్నించమని బైరాగిని వేడుకుంటూ సాగిలపడింది. చిరునవ్వుతో ఆశీర్వదించి, వారిచ్చిన అర్ఘ్యపాద్యాలను స్వీకరించి, ఫలాన్ని ఆరగించి "అమ్మా మీ దంపతులిర్వురూ భగవన్నామస్మరణ మానవద్దు. అదే మిమ్మల్నాదుకొని ఒడ్డుకు చేర్చేది." అంటూ తన జోలె



లోంచి 'వేదాంత సారం' అనే గ్రంథాన్ని బహూకరించి ముందుకు సాగిపోయాడు రామభద్రయతి.

అతడటు వెళ్ళగానే వసుంధర మళ్ళీ ప్రాపంచక స్థితిలో పడిపోయింది. తనకు తానుగా బైరాగి వచ్చిన విషయం మృత్యుంజయునికి తెలియజేయరా దను కొన్నది వసుంధర. భాస్కరాన్ని కూడా చెప్పనివ్వలేదు.

ఆ మరునాడు తెల్లవారి లేస్తూనే "రామభద్రయతీశ్వరులనేవారు మనింటికి వచ్చారామ్మా!" అని అడిగాడు మృత్యుంజయుడు.

దడదడలాడే గుండెను అదిమిపట్టు కుంటూ ఆర్తిగా భర్తవైపు చూచిందామె. "అవును. వచ్చారు" అన్న తండ్రి జవాబుతో మృత్యుంజయుడి ముఖం కొన్ని సంవత్సరాల అనంతరం ప్రియ మిత్రుడిని కలుసుకొన్నట్లు విప్పారింది తండ్రి నడిగి సంగతంతా తెలుసుకొని ఆ రోజంతా ఉత్సాహంగా గడిపివేశాడు.

మరునా డుదయమే తలిదండ్రులకు

నమస్కరించి- "అమ్మా! మీ ఇద్దర్నీ నేను ఎన్నటికీ మరచిపోను. నేను సన్యసించాలని నిర్ణయించుకున్నాను. పుట్టబోయే చెల్లాయి, తమ్ముడూ మీకు కుటుంబ సంబంధమైన కోరికలు తీరుస్తారు. రేపు సూర్యోదయానికి పూర్వమే నేను సన్యాసాశ్రమానికి బయలుదేరబోతున్నాను. నన్ను గురించి నువ్వు విచారించవద్దు. నా సన్మార్గానికి అడ్డుచెప్పకు. నాచుట్టూ వాత్సల్యపు తెరను దించకమ్మా! నా ఔన్నత్యాన్ని కోరుతూ అందరికీ ఆత్మీయుడైన పరమేశ్వరుణ్ణి స్మరించు. నువ్వు నిత్యం భజించే సర్వాంతర్యామిలోనే నన్ను చూడు. నీకు తప్పక మనశ్శాంతి దొరుకుతుంది" అన్నాడు మృత్యుంజయుడు.

భాస్కరం దగ్గరకు చేరి 'కన్న కూతుర్ని అత్తవారింటికి పంపుతూ జాగ్రత్తగా చూచుకొమ్మని' అల్లుని అర్థిస్తున్న కన్నతండ్రిని జ్ఞప్తికి తెచ్చే మోముతో "నాన్నగారూ! అమ్మ చాలా అమాయకురాలు. ఆమెకు ధైర్యంచెప్పి నామీదున్న బెంగ తగ్గించగల నేర్పు మీకుంది. ఆ ఆశే నన్నిలా బయలుదేరేలా చేస్తోంది" అంటూ శారీరకంగా ఉన్న వయసుకి మించిన మాటలు చెప్తూ అప్పగింతలు పలుకుతున్న ఆ బాల యోగిని కౌగలించుకొని బావురుమంది వసుంధర.

మృత్యుంజయుడి మాటలు వింటూ 'బాహ్యరూపానికి ఏడు వసంతాల వయస్సేగావి, మానసికంగా ఎంత వృద్ధుడీ బాలుడు? క్రితం జన్మం చివరవరకూ సంపాదించిన జ్ఞానమంతా ఆత్మలో పదిలపరచుకొని ఆ శరీరాన్ని మాత్రం త్యజించి, మళ్ళీ నూతన కాయాన్ని మా బిడ్డగా ధరించాడు. ఆ జన్మలో గ్రహించగా మిగిలిన జ్ఞానాన్ని ఈ జన్మలో పూరించుకుంటాడు. ఈ పునర్జన్మకు కారణమైన పుణ్యకార్యాలు నిర్వహిస్తాడు. ఈ చరితార్థునికి నేను తండ్రిని. చాలు ఎన్ని జన్మలెత్తినా ఈనాటి స్థానం దొరకటం నాలాటి సామాన్యునికి అపురూప వరం' తృప్తిగా గుండెనిండా ఊపిరి పీల్చుకున్నాడు భాస్కరం.

నిర్వ్యాపారంగా తల్లి కనులు తుడుస్తూ "అమ్మా! నా సంతోషం నీకు దుఃఖమా?" అన్నాడు మృత్యుంజయుడు.

"కాదు నాయనా! కాదు. నిన్ను విడిచి ఉండలేక నా బాధ." అంటూ కొడుకుని గాఢంగా హృదయానికి హత్తుకుంది వసుంధర.

ఆ ఇరువుర్నీ తన రెండు బాహువులతో చుట్టి ఆలింగనం చేసుకొన్న భాస్కరానికి అతని ప్రమేయం లేకుండానే కళ్ళనుండి జాలువారిన అశ్రువులు భార్యా బిడ్డల శిరస్సులనభిషేకించాయి.

ఆ రాత్రంతా తలిదండ్రులతో ఏమేమో చెప్తూ, చర్చిస్తూ గడిపివేశాడు మృత్యుంజయుడు. మధ్యలో మళ్ళీ, మళ్ళీ స్వార్థపరంగా ఆలోచించి మాట్లాడుతున్న తల్లిని "అమ్మా! ఒకవేళ మీవద్దనే ఉండిపోతాననుకో! నాకు చాలా తొందరగా మృత్యువు రావచ్చు. లేక అంగవికలుడనై, రోగాలతో బాధ పడవచ్చు. అది నీ కిష్టమైతే నీకోసం నా ఈ సుఖజీవనం వదులుకుంటాను." అన్న మృత్యుంజయుడి వాక్కులు అడ్డుకున్నాయి.

మృత్యుంజయుడి నోరు మూస్తూ "బాబూ! అజ్ఞానురాలిని. ఈ పరిస్థితికి తట్టుకోలేక ఏవేవో ఊహించి తికమక పడుతూంది నా మనస్సు. నా అదుపులో నిలవటం లేదది. నీ ఇష్టం బాబూ! నువ్వు ఎక్కడున్నా సుఖంగా, సంతోషంగా ఉండటమే నాకు కావలసింది. నీకు సంరక్షణ చేసిన ఈ చేతులు రేపటి నుంచీ ఆ భాగ్యానికి నోచుకోవుగా బాబూ! నేను ఒట్టి మూర్ఖురాలిని. నిన్ను కన్నప్పుడు నీ సాన్నిహిత్యం శాశ్వత మన్నట్లే పొంగిపోయాను. ఈనాడు నీ ఎడబాటుని భరించలేక క్రుంగి పోతున్నాను తండ్రీ! నేను అతి సాధారణ మైన మనిషినిరా" అంటూ విధవిధాలుగా బాధపడుతూ చేతులారా బిడ్డడి ఒళ్ళు నిమిరి అతని నుదుటిని చుంబించింది వసుంధర.

మృత్యుంజయుడు తన చిట్టి చేతులతో తల్లి మెడను చుట్టి కౌగలించుకొన్నాడు, ఆప్యాయంగా. పుత్ర పరిష్వంగ సుధామాధుర్యాన్ని అనుభవిస్తున్న వసుంధర తన్మయత్వంతో కనులు మూసుకొంది. కొన్ని క్షణాలు అలౌకికానందాన్ని పొందిందామె. కొడుకు తల్లిని ఓదార్చే తీరు చూసి ఆశ్చర్యానందాలతో మూగబోయాడు భాస్కరం. అతనికీ దృశ్యాలు అద్భుతంగానూ, అపురూపంగానూ ఉన్నాయి.

మృత్యుంజయుడు తలిదండ్రులను చూస్తూ చల్లగా, మృదు మధురంగా చిరునగవులు వెదజల్లాడు.

ఆ తెల్లవారు ఝామున మూడున్నర గంటలకు రామభద్రయతీంద్రులు వచ్చారు. దంపతుల్ని దీవించి మృత్యుంజయుణ్ణి తీసుకొని శ్రీశైల పుణ్య క్షేత్రానికి బయలుదేరారు.

వెడుతూ తల్లిదండ్రులిద్దరికీ ప్రణమిల్లి గడపదాటాడు మృత్యుంజయుడు. తమకు మనసైనపుడు కొమరుని చూచి రావటానికి యతీశ్వరుని అనుజ్ఞ అడిగాడు భాస్కరం.

"మీరు గృహస్థులు. మీ ధర్మాలు మీరు నిర్వర్తించండి. ఒకానొక రోజున మీ గృహంలోని కలతలు తీర్చటానికి తనంత తానే స్వయంగా వస్తాడితడు. ఈలోగా మీరు ప్రయత్నించినా

రాలేకపోవచ్చు. అంతా భగవదేచ్ఛ" అడుగులు ముందుకు వేశారు యతీంద్రులు.

వెడుతున్న గురు, శిష్యుల్ని సజల నయనాల్తో చూస్తూ వ్యథచెందిన హృదయంతో నిలబడిపోయింది వసుంధర.

అమరత్వ సిద్ధి పొందటానికి అరుగుతున్న కొమరుణ్ణి కన్నుల పండువగా చూచుకొంటూ ఆనందాశ్రువులు రాల్చాడు భాస్కరం. గురుశిష్యులిర్వురూ సందు మలుపు తిరిగారు. బాలభానుడు మేఘాల చాటుకు తప్పుకొన్నట్లనిపించింది భాస్కరానికి. గాఢమైన తిమిరం అలముకొన్నట్లనిపించింది వసుంధరకి.

నిస్సత్తువగా తూలిపోతున్న భార్యను చేరదీసి అక్కున జేర్చుకొన్నాడు భాస్కరం. "ఏమిటండీ ఈ అసంభవం ?" దుఃఖంతో భర్త బాహువుల్లో ఇమిడిపోయింది వసుంధర.

"ఇలా జరగటం అరుదు. కాని అసంభవం కాదు వసుంధరా ! మహనీయుల చరిత్రలు జ్ఞప్తికి తెచ్చుకో. వాటిని అర్థం చేసుకొని అనుసరించటానికి ప్రయత్నించు. మనం అదృష్టవంతులం. నీ గర్భం అందించిన ఫలం బహు అమూల్యమైనది. మనస్సుని అదుపులోకి తెచ్చుకో. బాబు చెప్పిన మాటలన్నీ అప్పుడే మరచిపోయావా ?" అంటూ భార్య వీపు ప్రేమగా నిమురుతూ లోపలికి తీసుకువెళ్ళాడు భాస్కరం. మంచినీ, చెడునీ తనలో కలుపుకుంటూ గంభీరంగా సాగిపోతున్న కాలంతో బాటు, భవిష్యత్తుకై ఎదురుచూట్టం ప్రారంభించారు వారు.

* * *

కథంతా విన్న ముకుందం మగతా లోకంలో కొట్టుకుపోతున్నట్లు అలాగే కూర్చుండిపోయాడు. అతడికి తన తల్లి "వాడలాగ, వీడిలాగ. మీరు చూస్తే శక్తిలేక ఇలా ఉన్నారు. ఇంక ఈ పిల్లని ఒక ఇంటిదాన్ని చేసే యోగం లేనట్లుంది" అని బెంగగా తండ్రితో అనటం గుర్తొచ్చింది. అంటే ఇతడు చెప్పినట్లు తన అన్నగారా ఈ స్వామి ? !

ముకుందానికి 'తను అవివేకంగా ఎన్ని సంవత్సరాలు గడిపాడో !' అన్పించింది. "ఇప్పుడు నన్నేం చెయ్యమంటారు స్వామీ ! మీ సలహా ప్రకారం నడుచుకుంటాను." తల వంచుకొని వినయంగా పలికాడు ముకుందం.

"నీ దురలవాట్లను మాన్చుకో. సద్బుద్ధి అలవర్చుకో. తల్లిదండ్రులకు సేవచేసి వారిని సంతోషపరచు. పరిస్థితులను ఆకళింపు చేసుకొని ఏది అందరికీ సుఖం కలిగిస్తుందని నీ మనస్సుకి తోస్తుందో దాన్ని ధైర్యంగా అనుసరించు."

"నీ చెల్లెల్ని ఒకింటిదాన్ని చెయ్యి. నీ సమయాన్ని వ్యసనాలకు వ్యయ




పరచకు. సంసారం అమర్చుకొని, గృహస్థాశ్రమ ధర్మాన్ని నిర్వర్తించు. సంఘానికి మేలు చెయ్యి." బోధించారు స్వామి.

"స్వామీ! మీకింత బలం ఎలా వచ్చింది? నాకూ అంత బలం ఉంది. కాని మిమ్మల్నెందుకు కదల్చలేక పోయాను?" విచిత్రంగా అడిగాడు ముకుందం.

"ఇది యోగశక్తి! ఈ యోగశక్తి కూడా అహంకారం ఉంటే నిష్ఫలమై పోతుంది. అహంభావానికి, మదమోహాలకు దూరంగా ఉంటూ మన బాధ్యతల్ని నెరవేర్చాలి. మనలో ఉన్న శక్తిని మనస్ఫూర్తిగా మంచికి ఉపయోగిస్తే అది తప్పక సఫలమౌతుంది."

"అంటే నా బలం ఒట్టి " సిగ్గుగా తలవంచాడు ముకుందం.

"కోపం తెచ్చుకోకు బాబూ! అది మూర్ఖపు పట్టు. అందుకే సులభంగా సడలిపోయింది." అన్నారు స్వామి.

వారిరువురూ చాలాసేపు మవునంగా ఉండిపోయారు. ముకుందానికి ఇంతకు ముందు విన్న కథంతా మళ్లీ ఇంకొక సారి మదిలో మెదిలింది.

'ఒక్కసారి ఈ స్వామిని తీసుకెళ్ళి అమ్మకి, నాన్నకి చూపిస్తే!' అన్పించింది. ఆ మాట పైకి అని "వస్తారా స్వామీ!" ఆతృతగా స్వామిని అడిగాడు ముకుందం.

"తప్పకుండాను. నడు బాబూ! ముకుందంతో బయలుదేరారు స్వామి. తల్లిదండ్రుల ఆనందాన్ని ఊహిస్తూ ముందడుగు వేశాడు ముకుందం సంతోషంగా. ముగ్గురు శిష్యులూ వారిని అనుసరించారు.



# హంస మంజీరాలు

(గత సంచిక తరువాయి)

మారు మాట్లాడకుండా తాంబూలం అందుకొని, లక్ష్మివెంట పడకగదిలోకి వెళ్ళాడు.

లక్ష్మి అందిస్తున్న తమలపాకు చిలకలను అందుకుంటూ మాటల్లో పడ్డాడు లక్ష్మితో కృష్ణమరాయుడు.

లక్ష్మి మాటతీరునూ, తీర్చిదిద్దిన అందచందాలనూ చూస్తూ కృష్ణమరాయుడు తనకు తెలియకుండానే ఆకర్షించబడుతున్నాడు.

కృష్ణమరాయుడు లక్ష్మిని రెప్పార్పకుండా చూస్తూ వుండిపోయేడు. లక్ష్మికి సిగ్గు ముంచుకొచ్చింది. పెళ్లై యిన్నాళ్ళయినా ఎప్పుడూ కృష్ణమరాయుడు

---

**సి యస్ రావు & శివదత్త్**

లక్ష్మిని అలా చూడలేదు. అంత తీరికగా మాట్లాడలేదు.

సూటిగా చూసే అతని చూపులకు తట్టుకోలేక 'యిప్పుడే వస్తా' అంటూ లక్ష్మి అతనిపక్కనుంచి లేచింది.

'లక్ష్మీ' అంటూ కృష్ణమరాయుడు ఆమె భుజంమీద చేయి వేసాడు.

ఆ స్పర్శకు లక్ష్మి తనువు పులకించి పోయింది. మనసు పరవసించిపోయింది. శరీరంలో ఏదో మెరుపు ప్రవహిస్తున్నట్లు అనిపించి లక్ష్మి తనువు ధనస్సులా వంగింది వయ్యారంగా.

కృష్ణమరాయుడు ఒక్కడుగు వెనక్కి వేసి, లక్ష్మిని పరిశీలనగా మళ్ళీ చూసాడు. నవ్వుకున్నాడు. 'ఇది తనువా ? లేక ధనువా ?' అనుకున్నాడు.

'నేను ధనువునా ?' అన్నట్లు చూసింది లక్ష్మి.

'అవును' అన్నట్లు తలవూపి, లక్ష్మికి మరింత చేరువయ్యాడు కృష్ణమరాయుడు

"సుమశరుని బాణాలు అయిదు కదా. ఆ పంచసారకాలూ నీ ముఖబింబంలోనే వున్నాయి. అరవిందంలాంటి మోము. అశోకముల్లాంటి పెదవులు, చూతము లాంటి నాసిక" అనేసరికి విప్పారిన నయనాలతో లక్ష్మి కృష్ణరాయుని కళ్ళ లోకి కొంటెగా చూసింది.

ఆ కనులే కలువలు అన్నాడు. పకపక నవ్వింది లక్ష్మి. కలహంసల కలకలంలంటి ఆ నవ్వు విన్న కృష్ణమ రాయుడు "ఆఁ ఆఁ ఆ నవ్వులే మల్లికా సారకాలు." అంటూ మన్మధుని అయిదు బాణాలూ వల్లించాడు.

"వాటిని నే సంధించలేదు కదా ?" అంది లక్ష్మి.

"సంధించకపోవడమేమిటి ? కఠోర తపోదీక్షలో వున్న పరమేశ్వరుని మనసు పార్వతివైపు మళ్ళించడానికి సుమశరుడెత్తిన ధనవులా వంగి — ఆ అయిదు బాణాలనూ నాపై సంధించావు."

"పరమశివుడు ఆగ్రహించి మన్మధుని నుసిచేసినట్లు నన్నూ మీరు నుసిచేస్తారా ?" అంది లక్ష్మి

కృష్ణమరాయుడు చిరునవ్వు నవ్వి "పరమశివుడు మన్మధుని నుసిచేసాడుగాని పార్వతిని కాదు లక్ష్మీ" అంటూ ఆమెను తన సందిట్లోకి తీసుకున్నాడు.

ధనువులా వంగిన లక్ష్మి తనువు, లతగా మారి తరువును పెనవేసుకున్నట్లు కృష్ణమరాయుని పెనవేసుకుంది.

పెళ్ళి జరిగి రెండేళ్ళు కావస్తున్నా కృష్ణమరాయునికి లక్ష్మితో అదే తొలి రేయి.

లక్ష్మి జీవితానికీ తొలిరేయి.

ఆ యింట్లో అందరూ ఎన్నాళ్ళ నుంచో కలలుగంటున్న రేయి, ఆ రేయి.

లక్ష్మీకృష్ణమరాయులుకు కలలు వచ్చే అవకాశమే లేదు ఆ రాత్రి. ఆ

రాత్రంతా వారిద్దరూ మెలకువగానే వున్నారు.

• • •

తెల్లవారింది.

లక్ష్మి బయటకు వచ్చింది.

నిద్రలేక కళ్ళు కాస్త వుబ్బాయి. ఎర్రబడ్డాయి.

రాధ పరిశీలనగా చూసి నవ్వుకుంది. ఆ నవ్వుకు బదులుగా లక్ష్మి కూడా సిగ్గుపడుతూ నవ్వుకుంది. వెంటనే రాధ కళ్ళలోకి చూసింది. రాధ కళ్ళలోని తృప్తినీ ఆనందాన్నీ చూసేసరికి లక్ష్మి కళ్ళు కృతజ్ఞతతో చెమ్మగిలాయి.

'లక్ష్మి' అంటూ గోముగా వారించింది రాధ.

లక్ష్మి వెంటనే రాధను గట్టిగా కౌగిలించుకుంది. మాటలకందని కృతజ్ఞతతో లక్ష్మి మనసు నిండిపోయింది.

లక్ష్మి మాత్రమే కాదు. పార్వతమ్మ, కామాక్షమ్మ కూడా రాధను ఆ క్షణంలో తమకోసమే అవతరించిన దేవతలా చూసారు.

"నీ రుణం ఈ జన్మకి తీర్చుకోలేనమ్మా" అంది పార్వతమ్మ.

"నేనే తొందరపడ్డానమ్మా. నాది పొరబాటే" అంది కామాక్షమ్మ.

"ఫరవాలేదులెండి. మీరు అనతగ్గవారు. నేను పడతగ్గదాన్నీను." అంది రాధ.

ఆ సాయంత్రమే తాను వచ్చిన పని అయిపోయినదంటూ తన యింటికి బయలుదేరింది రాధ.

పార్వతమ్మ బొట్టు పెట్టి, చీర, జాకెట్టు గుడ్డ అందించింది.

బొట్టు తీసుకుందిగాని చీర, జాకెట్టు గుడ్డ వద్దని వెళ్ళిపోయింది రాధ.

ఆమె వెళ్ళినవైపే చూస్తూ నిలబడిపోయింది లక్ష్మి. ఆమె పక్కనే వున్న పార్వతమ్మ "రాధ మామూలు మనిషి కాదమ్మా. యీ యింటి యిలవేలుపు" అంది లక్ష్మితో.

"ఔనత్తయ్యా" అంది లక్ష్మి.

## 33

లక్ష్మి కాపురం చక్కబడిందన్న తృప్తితో కామాక్షమ్మకు వేయి ఏనుగుల బలం వచ్చింది. పార్వతమ్మకు తమ వంశం నిలబడుతుందన్న ఆశ చివురించింది.

కామాక్షమ్మ తన వూరుకు ప్రయాణమైంది.

"ఇప్పుడేవంత తొందర అత్తయ్యా" అన్నాడు కృష్ణమరాయుడు

"అదేమిటి బాబు? పెళ్ళి జరిగి రెండేళ్ళు కావస్తూ వుంది. ఇంతవరకూ యిల్లూ, వ్యవసాయం పనివాళ్ళమీదనే వదిలేసాను కదా. ఇంకా ఎన్నాళ్ళుండమంటావు. సంక్రాంతికి నువ్వూ అమ్మాయి వస్తే సంతోషిస్తాను. తప్పకుండా రావాలి." అని పండగపిలుపు కూడా కానిచ్చేసి పార్వతమ్మతో కూడా

చెప్పి, లక్ష్మిని మళ్ళీ వప్పజెప్పి వెళ్ళి పోయింది కామాక్షమ్మ.

ఎవరికోసమూ ఆగని కాలం వేగంగా దొర్లిపోతోంది.

రోజు రోజుకీ లక్ష్మి — కృష్ణమ రాయుడు చేరువ అవుతున్నారు. ఒకరి నొకరు అర్థంచేసుకొంటున్నారు. అన్యోన్యంగా వుంటున్నారు.

తన చేతులారా దూరం చేసుకున్న రాధ కృష్ణమరాయుడ్ని తన గుండెల్లోనే దాచుకుంది. ఆమె అనుక్షణం అతన్ని ఆరాధిస్తూనే వుంది. కృష్ణమరాయునికి గతం అప్పుడప్పుడు తలపుకు వచ్చినా తనను అవమానించిన సంఘటన తలుచు కొని మనసు త్రిప్పుకుంటున్నాడు.

కాలమే క్రమక్రమంగా కృష్ణమ రాయునిలో మార్పు తెచ్చింది. కాలం గడుస్తున్నా రాధ మనసుకు మరుపు చేరువ కాలేదు. జ్ఞాపకాలు గతాన్ని తవ్వి తవ్వి వెలికితీస్తూనే వున్నాయి.

తీయని గతాన్ని స్మరిస్తూ, కృష్ణమ రాయుని రూపాన్ని ఆరాధిస్తూ యోగినిలా, ఒక తపస్వినిలా గడుపుతోంది కాలం రాధ.

కృష్ణమరాయుని కంటపడకుండా అతను ఆలయానికి రాని సమయాల్లోనే దైవదర్శనానికి వెడుతూ, మిగిలిన వేళల్లో మనసులోనే తన దైవాన్ని నిలుపుకుని — తలపుంతోనే కాలం వెళ్ళ బుచ్చుతోంది రాధ

రోజులు దొర్లిపోతున్నాయి.

లక్ష్మికి నెల తప్పింది.

పార్వతమ్మ సంతోషానికి పట్టపగ్గాలు లేవు. మొట్టమొదట రాధకు ఆ శుభవార్త అందజేసింది. ఆ తర్వాత కామాక్షమ్మకు తెలియపరిచింది. లక్ష్మికి నెల తప్పిం దన్న తరువాత కృష్ణమరాయుడు లక్ష్మిని మరింతగా పట్టించుకోసాగాడు. ఎక్కువ సమయం లక్ష్మితో గడుపుతున్నాడు.

కాని లక్ష్మికి రాధ చెప్పినట్లు అను క్షణం కృష్ణమరాయుని అభిరుచికి నచ్చే ట్లు నటించడం చేతకావడంలేదు. ఇంక నటన కూడా అవసరం లేకపోయింది. రాధ కృష్ణమరాయుని మనసుకు కాస్త దూరం కావడంతో లక్ష్మి చేరువ కాసాగింది

లక్ష్మికి నెలలు నిండాయి.

కామాక్షమ్మ కూతుర్ని పురిటికి తీసుకువెడతానంటూ వచ్చింది.

"అక్కడ మాత్రం నువ్వు ఒక్కర్తివే కదా. యిక్కడైతే యిద్దరమూ వుంటాము" అంటూ పార్వతమ్మ కామాక్షమ్మను కూడా ఆపు చేసింది

కృష్ణమరాయుని యింట్లోనే లక్ష్మికి పురుడు పోసారు. తొలికానుపు ఆడపిల్ల.

యిరవై ఒకటవ రోజున పాపకు నామకరణం చేసారు.

పేరు శాంతి.

ఆ రాత్రి వూరు మాటుమణిగాక

పార్వతమ్మ కబురుమీద పిల్లనీ తల్లినీ చూడడానికి వచ్చింది రాధ.

శాంతిని తన వడిలో పడుకోపెట్టు కొని ముద్దాడి హృదయానికి హత్తుకుంది. ఆ క్షణంలో తానే తల్లి అయినంతగా పొంగిపోయింది రాధ.

కాసేపు కూర్చుని వెళ్ళిపోయింది. ఆమెలో ద్వేషం లేదు. ఆరాధనకూ ప్రేమకూ ప్రతిరూపంగా తయారైంది రాధ. లక్ష్మికి జరిగిన ప్రతి శుభం తనకు జరిగినట్లే పొంగిపోతుంది. తృప్తి పడుతోంది. లక్ష్మిలో తనను చూసు కుంటోంది.

## 34

జమీందారు వీరేంద్రరావు ఓ రోజున కృష్ణమరాయునికి - విందుకి రమ్మని ఆహ్వానం పంపించాడు.

కొత్తగా వచ్చిన జిల్లా కలెక్టరు దొర గారి గౌరవార్థం విందు ఏర్పాటు చేసాననీ-దానికి రావలసిందిగా కోరుతూ మనిషిచేతికి ఉత్తరం యిచ్చి పంపిం చాడు.

విందుకు వెళ్ళడమా మానటమా అన్న మీమాంసలో పడ్డాడు కృష్ణమ రాయుడు. సాటివాడు పిలిచినప్పుడు కాదనడం బాగోదేమో అనుకున్నాడు.

జరిగినది తలచుకుంటే వెళ్ళబుద్ధి కావడం లేదు.

రాధ యింటికి ఆనాడు వచ్చినది వీరేంద్రరావేనని బయట ఆగివున్న గుర్రపుసార్దును చూసి గ్రహించాడు కృష్ణమరాయుడు.

ఆ విషయంకోసం విందుకు వెళ్ళక పోవడం సబబుగా తోచలేదు. చివరకు విందుకు వెళ్ళడానికే నిశ్చయించు కున్నాడు.

విందుకు హాజరయ్యాడు కృష్ణమ రాయుడు.

వీరేంద్రరావు అందరి జమీందార్లకు మర్యాదలు చేసినట్లే కృష్ణమరాయునికి కూడా మర్యాదలు చేసాడు. కొత్త కలెక్టరుదొరగారికి పరిచయం చేసాడు.

విందు పూర్తయింది.

కలెక్టరు బయలుదేరి వెళ్ళిపోయాడు.

మిగిలిన జమీందార్లు కూడా బయలు దేరుతున్నారు.

"ఇక నేనూ వెళ్ళొస్తాను వీరేంద్ర రావుగారు" అన్నాడు కృష్ణమరాయుడు.

"మనిద్దరం కాస్త ఏకాంతంగా మాట్లాడుకోవాలి. ఉదయాన్నే వెడుదురు గాని" అని ఆపుచేసాడు వీరేంద్రరావు కృష్ణమరాయున్ని.

మాట కాదనలేక కృష్ణమరాయుడు ఆగాడు.

'రాధ గురించి మాట్లాడతాడేమో' అనుకున్నాడు కృష్ణమరాయుడు. నిజా నిజాలు తేలిపోతాయి అనుకున్నాడు.

వచ్చిన అతిథులు అంతా వెళ్ళి పోయారు ఒక్క- కృష్ణమరాయుడు తప్ప.

వీరేంద్రరావు తన గదిలోకి తీసుకు వెళ్ళాడు కృష్ణమరాయున్ని.

"ఇది నా అంతరంగిక మందిరం. ఇందులోకి నాకు ఎంతో ఆత్మీయు లను కున్నవారిని గాని తీసుకురాను" అన్నాడు వీరేంద్రరావు.

కృష్ణమరాయుడు గది నలుమూలలా పరికించి చూసాడు.

గోడలకు పులిచర్మాలూ, దుప్పి కొమ్ములూ, అడవిదున్నతలలూ తగిలించి వున్నాయి.

నేలమీద తివాసీలు పరచివున్నాయి. సోఫాలూ, కుర్చీలు కాకుండా పరుపులూ, బాలీసులతో భారతీయ సాంప్రదాయ పద్ధతిలో అలంకరించబడి వుంది.

కృష్ణమరాయుడూ, వీరేంద్రరావూ చెరో పరుపుమీదా బాలీసులకు అనుకొని ఎదురెదురుగా కూర్చున్నారు.

"మన కుటుంబాల మధ్య మీ తాతలనాటి నుంచీ మా తాతలనాటినుంచీ స్నేహమే గాని, ఏనాడూ అపార్థాలులేవు" అన్నాడు వీరేంద్రరావు.

"నిజమే! కాదని ఎవరన్నారు?" అన్నాడు కృష్ణమరాయుడు.

"ఎవరో అన్నారని కాదు. మనం తరచు కలుసుకుంటూ వుంటే కదా స్నేహం, పరిచయం పెరిగేది"_

"తరచుగా కలుసుకోవడానికి ఎలా వీలుపడుతుంది? ఎవరి పనులు వారికి వుంటాయి కదా?"

"మనసంటూ వుంటే మార్గాలు దొరక్కపోవు. నేను వచ్చేవారం చింతల పూడి అడవులకు వేటకు వెడుతున్నాను. మీరూ రాండి."

"వేటంటే నాకంత సరదా లేదు." అన్నాడు కృష్ణమరాయుడు.

"ఎందుకనీ?"

"కారణం లేదు. ఇష్టంలేదు అంతే."

"వేట మనలాంటి వాళ్ళకు తగిన వినోదం."

"కావచ్చు. కొంతమందికి నచ్చక పోవచ్చు కదా."

"పోనీలెండి. మీరు చిన్నవారైనా ధర్మ కార్యాలలోనూ, ప్రజా సంక్షేమ కార్య కలాపాలలోనూ ఆసక్తి చూపిస్తున్నారు. మీ తాతగారూ, మీ నాన్నగారూ కూడా అంతే. అందుకే యీ చుట్టుపక్కల మీరంటే సామాన్య ప్రజలందరికీ గౌరవం అభిమానం."

"ఉన్నవాడు లేనివాడిని ఆదుకోవడం అన్నది ధర్మం కదా."

"నిజమే అలా ధర్మం కదా అని లేనివాళ్ళని ఆదుకుంటూపోతే ఉన్నవాడు కూడా లేనివాడు అయిపోయే ప్రమాదం కూడా వుంది కృష్ణమరాయా" అన్నాడు వీరేంద్రరావు నవ్వుతూ.

"బళ్ళు ఓడలు కావచ్చు. ఓడలు బళ్ళు కావచ్చు. ఉన్నవాడు లేనివాడై నంత మాత్రాన వచ్చిన నష్టం ఏమీలేదు. ఆత్మాభిమానం, మానవతా పోగొట్టు కోకుండా వుండాలి మ. షి."

"నిజం చెప్పారు. మీ పెద్దలు కూడా

మాటకోసం మనిషికోసం ప్రాణం పెట్టే వారట. మా నాన్నగారు అంటూ వుండే వారు" అన్నాడు వీరేంద్రరావు.

ఇంతలో దివాన్ ఓ పత్రం పట్టుకొని వచ్చి వీరేంద్రరావు చేతికి అందించాడు.

"నా కెందుకు యిస్తారు. కృష్ణమ రాయుడిగారికే యివ్వండి" అన్నాడు వీరేంద్రరావు.

"ఏమిటిది?" అంటూ కృష్ణమరాయుడు దివాన్ అందించిన పత్రాన్ని తీసుకున్నాడు.

చదివాడు.

"ఇంతకాలం మీరు మాటవరసకి కూడా చెప్పలేదే" అన్నాడు కృష్ణమ రాయుడు.

"అవసరం రాలేదు కాబట్టి మరచి పోయాం ఇప్పుడు అవసరం వచ్చింది కాబట్టి గుర్తుకుతెచ్చుకున్నాం" అన్నాడు వీరేంద్రరావు.

"మొత్తం ఎంతో లెక్క కట్టండి దివాన్ జీ" అంటూ పత్రాన్ని దివాన్ జీ చేతికిచ్చాడు కృష్ణమరాయుడు.

"లెక్క కట్టే వుంచాను. మొత్తం వడ్డీతోసహా తొంభై వేల అయిదువందలైంది బాబు" అన్నాడు దివాన్ జీ.

"సరే, ప్రస్తుతం నాదగ్గర అంత కేష్ లేదు. మా తూర్పు పొలం ఏభై ఎకరాలూ - లక్షకు తక్కువవేయదు. చెరువు కింద పొలం. అది మీకు రాసి యిస్తాను. ఏర్పాట్లు చెయించండి" అన్నాడు కృష్ణమరాయుడు.

"నేను చెప్పలేదా దివాన్ జీ-మాటకు కట్టుబడి నిలబడే వంశం వారిది. ఏనాడో తండ్రిగారు చేసిన అప్పు యీనాడు కొడుకు తీరుస్తున్నారంటే-ఆలోచించండి, వారిలో నిజాయితీ. మరొకరైతే పత్రం కాలదోషంపట్టిందని తప్పించుకుంటారు."

"అదేమన్న మాట. పత్రం కాలదోషం పట్టవచ్చు మాటకి కాలదోషం వుంటుందా? మనిషి మరణించినా మాట మిగిలి పోతుంది. దస్తావేజు రాయించండి దివాన్ జీ" అన్నాడు కృష్ణమరాయుడు.

విందుకు వెళ్ళిన ఫలితంగా చెరువు కింది ఏభై ఎకరాల మాగాణీ చేయిజారి పోయింది. వీరేంద్రరావు తన సరిహద్దు కామందు అయ్యాడు.

తిరిగివచ్చి యీ విషయం ఎవ్వరికీ చెప్పలేదు కృష్ణమరాయుడు.

ఆప్తుడైన పూర్ణయ్యకూ, తల్లికి కూడా చెప్పలేదు. చెబితే బాధపడతారనే చెప్పలేదు. జరిగినది తనలోనే దాచుకున్నాడు.

కాని తనకు వున్న ఆస్తిలో ఆ యాభై ఎకరాలే గుండెకాయ. దాని నుంచే ఎక్కువ ఆదాయం. ఇక మిగిలింది నూటఏభై ఎకరాల దాకా వున్నా-ఉన్న పొలం పోయిన పొలమంత మంచిది కాదు.

కృష్ణమరాయుడు వీరేంద్రరావుకు ఏభై ఎకరాలు రాసిచ్చినట్టు ఎవ్వరికీ చెప్పలేదు. పార్వతమ్మకూ, ఆఖరికి పూర్ణయ్యకూ కూడా తెలీదు.

కాని సంక్రాంతి నెలవచ్చి, పంటలు యింటికివచ్చే సమయానికి పార్వతమ్మకు పంట తక్కువ వచ్చినట్లు అర్థమైంది.

ఓరోజు సాయంత్రం "ఏంబాబూ! యీ ఏడాది ధాన్యం రెండు గాదులలోకే వచ్చాయి. కళ్ళంలోనే జేరం యిచ్చే సావా?" అని అడిగింది పార్వతమ్మ కృష్ణమరాయుణ్ని.

"లేదమ్మా-పాత బాకీ తీర్చడంకోసం కొంత పొలం రాసివ్వాల్సి వచ్చింది" అని ముక్తసరిగా చెప్పాడు.

"పాత అప్పుకోసం ఆస్తి రాసిచ్చావా? ఎవరికి?"

"వీరేంద్రరావుకు."

"ఎన్నెకరాలూ?"

"ఏభై ఎకరాలు."

"మొత్తం బాకీ ఎంత?"

"దానికీ దానికీ సరిపోతుంది."

"అంత అప్పు నువ్వుచేసినదేనా?"

"నేను కాకపోయినా నేను తీర్చాల్సిన అప్పే."

"అంటే నాన్నగారు చేసిన అప్పా?"

"అవును. ఎవరైతేనేమమ్మా. అప్పు చేసాక తీర్చాలి కదా?"

"అందుగురించి కాదు బాబూ! ఆయన ఎప్పుడూ ఏ విషయం నాతో చెప్పేవారు కాదు. యింకా యిలాంటివి ఎన్ని వున్నాయోనని భయపడుతున్నాను."

"భయపడితే పోతాయా అమ్మా?" అని లేచాడు కృష్ణమరాయుడు.

పార్వతమ్మకు ఆస్తి తగ్గడం సంగతి ఆలశ్యంగా తెలిసింది గాని, గ్రామంలోని రైతాంగానికి వీరేంద్రరావు జనం ఆ భూమిని స్వాధీనం చేసుకున్ననాడే తెలిసింది.

వీరేంద్రరావు కృష్ణమరాయుడికి సరిహద్దు భూస్వామి అయ్యాడు. అతను రాకపోయినా అతని జనం వ్యవసాయం కోసం తరుచు మాధవగిరి రావాల్సి వస్తోంది.

అక్కడ నుంచే ముసలం ప్రారంభమైంది.

వీరేంద్రరావు జనం ప్రతి చిన్న విషయానికీ కృష్ణమరాయుడి పనివారితో కజ్జాకి దిగుతున్నారు.

కృష్ణమరాయుని ఎదుట మాత్రం తలలు వంచేవారు.

అంతేకాకుండా ఏ ముహూర్తాన వీరేంద్రరావుకి భూమి బాకీ కింద రాసి ఇచ్చాడో, అనాటినుంచీ కృష్ణమరాయుడికి చెడ్డరోజులు ప్రారంభమయ్యాయి.

తన భూమిలోని ధాన్యం కుప్పలు అంటుకున్నాయి ఓసారి. సంవత్సరం పంట అంతా నాశనమైపోయింది

ఏదో ప్రమాదవశాత్తూ జరిగివుంటుందనుకున్నారు అంతా

కాని యేటా ఏదో నష్టం జరుగుతూనే వుంది. కుప్ప తగలబడడమో, పశువులు మరణించడమో, మాయం కావడమో, ఏదో నష్టం జరుగుతూనే వుంది. కృష్ణమ

రాయుడు ఆర్థికంగా దెబ్బతింటున్నాడు. ధర్మకార్యాలూ, దైవకార్యాలూ ఏవీ మానలేదు. అన్ని కార్యక్రమాలూ, దాన ధర్మాలూ ఎప్పటిలాగే సాగుతున్నాయి.

దాంతో కృష్ణమరాయుడు అప్పులు చేయక తప్పడంలేదు.

ఇలా ఎందుకు జరుగుతోందో కృష్ణమరాయుడు ఏనాడూ ఆలోచించ లేదు.

యీ నష్టానికి వెనక వీరేంద్రరావు హస్తం వుందని కృష్ణమరాయుడు ఏనాడూ వూహించలేదు,

కాని వీరేంద్రరావు దీక్ష కృష్ణమ రాయుణ్ని బికారినిచేసి నిలబెట్టాలని అంత కష్ట పడడానికి కారణం రాధ తనను అవమానించడం, తిరస్కరించడం.

కృష్ణమరాయుడు బికారై నిలబడితే వీరేంద్రరావు రాధకు చేరువ కావచ్చన్న వూహతోనే యిన్ని పన్నాగాలు పన్నీ, మొదట కృష్ణమరాయుని ఆస్తిని కాజేసి, ఆ తరువాత పక్క భూస్వామిగా చేరి, తన జనం చేత రహస్యంగా నష్టాలు కలుగజేస్తున్నాడు.

కాం గ్రామంలోని జనం, పూర్ణయ్యా వీరేంద్రరావు జనం పనే అయివుంటుం దని అనుకున్నారు. కాని వాళ్లు దొరకడం లేదు.

ఏది ఏమైతేనేం, యీ నష్టాల మూలంగానూ, యీ నష్టాలవల్ల కలిగిన యిబ్బందుల మూలంగానూ, పార్వతమ్మ బెంగపెట్టుకుంది.

లక్ష్మికి మళ్ళీ నెలతప్పడం, ఈసారి కొడుకు పుట్టడం జరిగింది.

పార్వతమ్మ బెంగ ఎక్కువైంది.

మనుమడికి ఆస్తి వుండదేమోననీ, ఇంకా రానురాను ఆస్తి తగ్గిపోయి, యిల్లు గడవడమే కష్టమవుతోందేమోననీ భయ పడుతోంది పార్వతమ్మ.

కాస్త ఖర్చులు తగ్గించుకోమని చెప్పండని పూర్ణయ్యకు చెప్పింది. పూర్ణయ్య కూడా మాటల ధోరణిలో కృష్ణమరాయునికి సలహా యిచ్చాడు.

కృష్ణమరాయుడు నవ్వుకొని, "ఏవి తప్పుతాయి? స్వామి కళ్యాణం మానెయ్యమంటారా?" అన్నాడు.

బెంగతో పార్వతమ్మ మంచం పట్టింది. లక్ష్మి పార్వతమ్మకు చేయాల్సిన సేవలన్నీ చేస్తానే వుంది. ఇక్కడ పార్వతమ్మ యిలా వుండగా అక్కడ కామాక్షమ్మకు పాము కరిచిందని కబురు వచ్చింది.

కృష్ణమరాయుడూ, లక్ష్మి వెంటనే బయలుదేరి వెళ్ళారు. కడసారి చూపు దక్కిందేగాని, కామాక్షమ్మ మాత్రం దక్కలేదు.

వియ్యపురాలు పోయిందన్న బాధ మరింత కృంగతీసింది పార్వతమ్మను. లక్ష్మికీ, కృష్ణమరాయునికీ తాను కూడా పోతే పెద్ద దిక్కు ఎవరూ లేరన్న బెంగ ఎక్కువైంది.

బెంగతోబాటు జబ్బూ ఎక్కువైంది.

ఓ రోజున పట్నంనుంచి పెద్ద డాక్టరును పిలిపించాడు కృష్ణమరాయుడు. వాకిట్లో పాత ఫోర్డుకారు వుండడంతో పట్నంనుంచి ఎవరో వచ్చారని తెల్సింది వూరందరికీ. వచ్చినది డాక్టరనీ, పార్వతమ్మకు జబ్బుగా వుందనీ, జబ్బు ఎక్కువైందనీ కూడా తెలియడానికి ఎంతోసేపు పట్టలేదు.

డాక్టరు వెళ్ళాక, పార్వతమ్మని చూడ్డానికి జనం, ముఖ్యంగా ఆడవాళ్లు రావడం మొదలుపెట్టారు. లక్ష్మికి వచ్చిన వాళ్ళకు మర్యాదలు చేయడం, జవాబు చెప్పడం ఓ పెద్ద పనిగా తయారైంది.

పార్వతమ్మ అనారోగ్యం సంగతి విన్న రాధ ఓనాటి రాత్రి భీముడుని వెంటబెట్టుకుని పార్వతమ్మను చూడటానికి వచ్చింది.

రాధను లక్ష్మి ఎంతో ఆప్యాయంగా ఆత్మీయతతో పలకరించింది.

పార్వతమ్మ పక్కనే రాధను కూర్చోబెట్టి, నిద్రపోతున్న పార్వతమ్మను లేపి 'రాధ వచ్చింది' అని చెప్పింది లక్ష్మి.

పార్వతమ్మ మెలకువ తెచ్చుకొని "వచ్చావామ్మా" అంటూ రాధచేతిని తన చేతుల్లోకి తీసుకుంది.

"ఎలా వుంది మీ ఒంట్లో - పెద్ద డాక్టరుగారు కూడా వచ్చి వెళ్ళారట?" అంది రాధ.

"ఎలా వుండట మేమిటమ్మాయి? వయసు మళ్ళాక జబ్బులు రావడం ఆ వంకన ప్రయాణానికి సిద్ధం కావడం అంతా మామూలే కదా" అంది పార్వతమ్మ నవ్వుతూ.

"అలా అనకండి. మీకు జబ్బు తగ్గిపోతుంది" అని ధైర్యం చెప్పింది రాధ.

"తగ్గినా ఎప్పటికో ఒకప్పుడు చావు తప్పదు కదమ్మా! నాకు యింక ఏ కోరికలూ లేవు. నా కోరికలన్నీ తీరాయి. ఆఖరికి మనవడ్ని కూడా కళ్ళారా చూసుకున్నాను. కాకపోతే నీ రుణం యీ జన్మలో తీర్చలేను. వచ్చే జన్మలో ఎలాగైనా తీర్చుకుంటాను" అంది పార్వతమ్మ.

రాధ "యిప్పుడవన్నీ ఎందుకులెండి. మీరు విశ్రాంతిగా పడుకోండి. నేను వెళ్ళి వస్తాను" అంటూ లేచింది.

లక్ష్మి రాధకు బొట్టుపెట్టి పెరడు గుమ్మందాకా సాగనంపింది.

"అత్తగారికి సులువుగానే వుంటుంది. కంగారు పడకండి" అని ధైర్యం చెప్పింది లక్ష్మికి రాధ.

అప్పటిదాకా వచ్చే ఏడుపును ఆపుకున్న లక్ష్మి ఆ ఓదార్పుతో ఆపుకోలేక రాధను పట్టుకొని ఏడ్చేసింది.

"ఆరు నెలల క్రితం మా అమ్మ పోయింది. ఇప్పుడు అత్తయ్యకు యిలా వుంది. నాకు తలుచుకుంటేనే భయమేస్తోంది రాధా" అని మనసులోని బాధను చెప్పుకుంది లక్ష్మి.

రాధ ధైర్యం చెప్పి, లక్ష్మిని ఓదార్చి వెళ్ళిపోయింది.

పార్వతమ్మకు మందు యివ్వడానికి వచ్చింది లక్ష్మి.

"అత్తయ్యా " అని పలకరించింది.

"ఏమిటమ్మా ?"

"మందు వేసుకోండి. యిదిగో" అంటూ చెంచాతో మందు పోసింది పార్వతమ్మ నోట్లో లక్ష్మి.

పార్వతమ్మ మందు మింగి, "కాసేపు నా దగ్గర కూర్చో అమ్మా ! అబ్బాయి యింటికి వచ్చాడా ?" అని అడిగింది ఒక్కతే కూర్చున్న లక్ష్మిని.

"ఇంకా లేదత్తయ్యా."

"పిల్లలు పడుకున్నారా ?"

"ఆఁ యిద్దరూ పడుకున్నారు."

"నువ్వు అనవసరంగా కంగారుపడి పోకమ్మా నువ్వు చిన్నదానివి. పుట్టిన ప్రతి మనిషికీ చావు ఏదో ఒకనాడు తప్పదు. ఈలోగా ఎన్నెన్నో తాపత్రయాలు."

"ఇప్పుడవన్నీ ఎందుకత్తయ్యా. మీరలా మాట్లాడితే నాకు కాళ్ళు ఆడవు".

"పోనీలే పిచ్చిపిల్లా. మాట్లాడనులే ఆ విషయాలు. రాధ గురించి నీ అభిప్రాయం ఏమిటి ?" అంది పార్వతమ్మ.

"చాలా మంచిది" అంది లక్ష్మి.

పార్వతమ్మ నవ్వుకుంది.

"ఎందుకత్తయ్యా నవ్వుతున్నావు ?" అంది లక్ష్మి.

"రాధ గురించి అన్ని విషయాలూ తెలిసాక కూడ - రాధ మంచితనం గుర్తించిన నీ మంచితనం చూసి నవ్వుకున్నానమ్మా" అంది పార్వతమ్మ

"రాధ మంచిది కాదంటారా అత్తయ్యా?" అంది లక్ష్మి నవ్వుతూ.

"చంద్రుడిలో కూడా చిన్న మచ్చ వుందమ్మా. అంతమాత్రంచేత వెన్నెలను ఏవగించుకుంటున్నామా? రాధ పుట్టుకే రాధకు మచ్చ. రాధ మనసు వెన్నెలలా చల్లనిది. నిర్మలమైనది. అసలు రాధే వెన్నెల" అంది పార్వతమ్మ కాస్త ఆవేశంగా.

"నిజమే" అంది లక్ష్మి ముక్తసరిగా.

"అందుకేనమ్మా ! నువ్వొక మాటివ్వాలి నాకు."

"చెప్పండి అత్తయ్యా మీ మాట నే నెప్పుడేనా కాదన్నానా? కాదంటానా?" అంది లక్ష్మి.

"వేణుగోపాలస్వామి మన కుల దైవం అమ్మా ! రాధ మన యిలవేలుపు. ఆమెను ఎట్టి పరిస్థితులలోనూ-మనవాళ్ళ ఎవరూ నొప్పించకూడదు. మరచి పోకూడదు. యీ వంశాన్ని నిలబెట్టిన యిలవేలుపు రాధ." అంది పార్వతమ్మ లక్ష్మితో.

"అలాగే అత్తయ్యా" అని మాటిచ్చింది లక్ష్మి.

కాసేపట్లో కృష్ణమరాయుడు కూడా యింటికి చేరుకున్నాడు. తల్లి దగ్గరకు

వచ్చి "ఎలా వుందమ్మా వంట్లో?" అని అడిగాడు

"బాగానే వుంది బాబూ" అంది పార్వతమ్మ.

"పెద్ద డాక్టరుగారు కూడా అదే మాటన్నారు. ఈ మందులు వాడితే నాలుగైదు రోజుల్లో సులువుగానే వుంటుందని"

"డాక్టర్లు అలాగే అంటారులే గాని, నువ్వు మాత్రం కాస్త యింటిపట్టున వుంటుండు నాయన. లక్ష్మికి చిన్నతనం. నేనేదేనా హడావిడి చేస్తే కంగారుపడుతుంది" అని హెచ్చరించింది పార్వతమ్మ.

"ఏమీ భయం లేదమ్మా నాలుగు రోజుల్లో తగ్గిపోతోంది జబ్బు. లేచి హాయిగా తిరుగుతావు" అని తల్లికి ధైర్యం చెప్పి వెళ్ళి పడుకున్నాడు కృష్ణమరాయుడు.

తెల్లవారింది.

లక్ష్మి కృష్ణమరాయుణ్ని నిద్రలేపింది.

ఏమిటన్నట్టు చూసాడు కళ్ళు తెరిచి కృష్ణమరాయుడు.

"అత్తయ్యకు మందు యిద్దామంటే ఎంత లేపినా లేవడంలేదు" అంది లక్ష్మి కంగారుగా

"బాగా నిద్రపట్టిందేమో. అంతలోకే అంత కంగారు దేనికి?" అంటూ మంచం దిగి తల్లి దగ్గరకు వెళ్ళాడు కృష్ణమరాయుడు.

"అమ్మా! అమ్మా!" అంటూ లేపాడు. కుదిపాడు. పార్వతమ్మలో చలనం లేదు కృష్ణమరాయుడు కూడా కంగారుపడ్డాడు తన తండ్రి చావు తనకు అంతగా గుర్తులేదు అప్పటికి తనకు తెలిసీ తెలియనితనం వెంటనే పనివాడిని పిలిచి పూర్ణయ్యను పిలుచుకు రమ్మని పంపించాడు

పూర్ణయ్య వచ్చేదాకా తల్లిని చూస్తూ తల్లిపక్కనే కూర్చున్నాడు కృష్ణమరాయుడు.

పూర్ణయ్య వచ్చి "ఏం బాబూ కబురంపావట?" అన్నాడు

"అమ్మను చూడండి" అన్నాడు కృష్ణమరాయుడు.

పూర్ణయ్య పరిశీలనగా చూసి "యింక చూడాల్సింది ఏమీలేదు బాబు. అమ్మ వెళ్ళిపోయారు" అన్నాడు పూర్ణయ్య.

లక్ష్మి భోరున ఏడుస్తూ పార్వతమ్మ మీద పడిపోయింది కృష్ణమరాయుడు కొయ్యబారిపోయాడు

పూర్ణయ్య దగ్గరుండి జరగాల్సిన తంతు జరిపించేసాడు

కృష్ణమరాయుని సంసారం పెద్ద దిక్కులేని సంసారమైంది

ఇక అన్నింటికీ మిగిలిన పెద్దదిక్కు కృష్ణమరాయుని దృష్టిలో పూర్ణయ్య,

లక్ష్మి దృష్టిలో పూర్ణయ్యతో బాటు రాధ కూడా.

* * *

పార్వతమ్మ మరణం మూలంగా కృష్ణమరాయుని బాధ్యతలు బాగా పెరిగాయి. 'ఏకులబుట్టంత తల్లి వుంటే మేరుపర్వతమంత అండ' అన్నట్టు పార్వతమ్మ వుండగా యింటివిషయాలు అంతగా పట్టించుకోవాల్సిన అవసరం వుండేదికాదు కృష్ణమరాయుడుకి. ఆమె లేకపోవడంతో అన్ని విషయాలూ తానే చూసుకోవల్సి వస్తోంది.

పిల్లల పెంపకం సంగతీ, చదువుల సంగతీ, ఇంటి వ్యవహారాల సంగతీ— అన్ని విషయాలూ లక్ష్మి కృష్ణమ రాయుడినే అడిగేది. అన్నింటికీ సలహా యిచ్చేవాడు.

శాంతికీ, శాంతి తరువాత పుట్టిన మగపిల్లవాడు—నాగార్జున—పెరిగి పెద్దవాళ్ళు అవుతున్నారు. శాంతికి అయిదేళ్ళు దాటాయి. నాగార్జునకు మూడేళ్ళు దాటాయి.

పూర్ణయ్యగారి దగ్గరే యిద్దరూ చదువుకుంటున్నారు. పిల్లల వయసుతో బాటు కృష్ణమరాయుని ఆదాయం తగ్గడంతో అప్పులూ పెరుగుతున్నాయి.

అయినా కృష్ణమరాయుడంటే ఎవ్వరికీ గౌరవం సడలలేదు. అతని ధర్మ కార్యాలూ, దానధర్మాలూ, దైవకార్యాలూ మునపటిలాగే సాగుతూనే వున్నాయి. పూర్ణయ్య కొ_స్త ఖర్చులు తగ్గించమని అన్నా 'ఏది తప్పుతుంది?' అని సమా ధానం యిచ్చేవాడు కృష్ణమరాయుడు.

కృష్ణమరాయుడు భయపడ్డాడో లేదో గాని, పూర్ణయ్య మాత్రం 'యింకా యిలా ఎన్నాళ్ళు సాగుతుంది?' అని భయపడ్డాడు.

లక్ష్మి శాంతి పెళ్ళి, నాగార్జున చదువు గురించి అప్పుడప్పుడు ఆలో చించేది. 'అన్నింటికీ ఆ దేవుడే వున్నాడు' అని సరిపెట్టుకునేది.

తీరమున్న నదిలో నడిచే పడవ ఎప్పటికో ఒకప్పటికి తీరం చేరుతుందని నమ్మకం—తీరంలేని సాగరంలో నడిచే పడవ ఎప్పటికి తీరం చేరుతుందో ఎవరికి తెలుస్తుంది? ఎవరు చెప్పగలరు?

అన్నింటికీ ఆ దేవుడే వున్నాడన్నదే సమాధానం లేని ప్రశ్నలకు సమాధానం, పరిష్కారం లేని సమస్యలకు పరిష్కారం.

(సశేషం)

# జరుగుతున్న చరిత్ర

చైనాలో జరిగే వ్యవహారాలు ప్రస్తుతం వివరంగా లోకానికి తెలుస్తున్నవి. వాటిలో ఒకటి ఆ దేశంలో నడిచే రాజకీయపు 'కుట్ర' కేసులు మానవత్వం గలవారెవ్వరూ ఆ విధంగా ఒకరిపై ఒకరు ఆరోపించుకోరని కొందరు పరిశీలకులు వ్యాఖ్యానిస్తున్నారు. ఎర్రటి ఉద్యమానికి సంబంధించిన వారంతా శ్రద్ధతో గమనించవలసిన అంశం ఆ వ్యాఖ్యలో ఇమిడివున్నదని వెంటనే విషయజ్ఞులు కొందరు వెల్లడించారు. ఆ అంశం ఎట్టిదనగా— మానవులలో గొప్ప మార్పును తెచ్చి, సమాజంలో అందరి శ్రేయస్సుకై సర్వతోముఖంగా (రాజకీయంగా, ఆర్థికంగా, మానసికంగా, సాంఘికంగా అన్నివిధాలా) ప్రగతిని వారు సాధించి, నవసమాజాన్ని ఈ పృథ్విపై స్థాపన జేయడానికి పూనుకున్న ధర్మమూర్తులుగా ఆ మానవులు రూపొందవలెనని ఎర్రటి తత్వం బోధించి విప్లవం సాధించిన తదుపరి, ప్రాణసమానమైన సాహచర్యం నెరపినవారు ఒకర్నొకరు నిందించడం, క్రూరంగా హింసించడం ఏ విధంగా సంభవమైనది? అధికారంలో వున్నవారిని ఆరాధించడం, ఆ తర్వాత అధికారంలోకి వచ్చినవారు అంతకు పూర్వం పరిపాలించిన వారి 'దుర్మార్గాలను' త్రవ్వి, తీసి, ఖండించి మరణ దండనకు సైతం గురిచేయడం ఏ విధంగా సంభావమైనది?

ఈ 'వైపరీత్యాలను' వేలెత్తిచూపించి ఎర్రటివారంటే గిట్టనివారు ఎగతాళి చేసినందువల్ల 'జాడ్యానికి' చికిత్స జరగదు. ఎర్రటి ఉద్యమాలకు ఆ యా దేశాలలో చెందినవారే ఇందు విషయమై పట్టించుకుని, ఆ ఉద్యమాలను ఉన్నతమైన మానవస్థాయికి తీసుకునిపోవలసివున్నదని పరిశీలకుల అభిప్రాయం

ఇటీవల, కేవలం ఆరాధన-అనుకరణ మార్గాలద్వారా గాక, గుణదోష పరిశీలన ఆ ఉద్యమాల అనుయాయులలో కన్పిస్తున్నదని కూడా వారంటున్నారు. మన దేశంలోని మార్క్సిస్టులు రష్యా-చైనాలపట్ల చూపే అలీనధోరణి, రష్యాను దుయ్యబట్టడానికి వెనుదీయని మార్క్సిస్టు - లెనినిస్టుల ధోరణి కప అభిప్రాయాలకు బలమిస్తున్నవని సైతం వారంటున్నారు.

నిజానికి, ఈశావాస్య ఉపనిషత్ కర్త, మహావీరుడు, బుద్ధుడు శంకరుడు, మార్క్స్ (ఎంగెల్స్), గాంధీ వంటి మహానుభావుల బోధలన్నీ తెలిసిందొకటే 'సర్వేజనా సుఖినోభవంతు!' అందుకై

*మండి జగన్నాథం*

వైరాగ్యభావంతో మానవలోకానికి విశ్వవ్యాప్తంగా సేవజేసినవారే ధన్యజీవులు।

ఆ కోవకు చెందినవారే గదా ఎర్రటివారు? వారి కార్యక్రమాలు-పద్ధతులు గిట్టనివారు సైతం వారి తత్వశుద్ధిని శంకించడం లేదు కాని వారెన్నిపాట్లు పడినా, ఎన్ని త్యాగాలు - బలిదానాలు చేసినా, చివరకు మనిషి మారలేదు అనిపించుకుంటే ప్రయోజనమేమున్నది? అందువలన, ఈ అంశాన్ని గూర్చి గంభీరంగా ఆలోచన చేసి, తగినవిధంగా సవరింపును వారు తేగలిగితేనే వారి తత్వవ్యాప్తికి-కనీసం ఇతర తత్వాలకు సమానంగా సహజీవనానికి సాధ్యమవుతుందని విమర్శకులు తెలియజేస్తున్నారు

మావో జీవించినంతకాలం దైవసమానుడు ఆయన సతీమణి పొందిన పలుకుబడి అమోఘం — నేడామెకు మరణమే దండనగా విధించబడినది కొంతకాలం శిక్షను అమలు జరుపరట। ఆ శిఖరం నుంచి ఈ పాతాళప్రవేశమా?

దీని భావమేమి? అని యోచనచేస్తే తత్వశుద్ధికితోడై నడవడి నిష్కళంకంగా అత్యున్నత పథాన గమనం చేస్తేనే, ఆ ఉద్యమం ఉజ్జ్వలంగా వుంటుంది, లేదా వక్రమార్గం పడుతుంది భావుకులైనవారివచనాలు ఆ ధోరణిలో వున్నవి

* * *

ప్రపంచంలో చైనా దిక్కు ఈ మూల।

పసిఫిక్ మహాసాగరం (ప్రశాంత మహాసముద్రం)లో ఆ వంకన శాల్వదోర్ అనే చిన్న ప్రాంతం ఒకటున్నది. అదొక స్వతంత్ర రాజ్యం అందులో నడిచే అంతర్యుద్ధంలోకి వెలుపలినుంచి అగ్రరాజ్య బలగం వచ్చి దూరింది పరిపాలించేవారికి అమెరికా మద్దత్తు, తిరగబడేవారికి రష్యా సానుభూతి పుష్కలంగా లభిస్తున్నవి ఇంత దివ్యంగా అత్యగ్రరాజ్యాల మైత్రి, సమాధానమార్గం (detente) నడుస్తున్నది। సోషలిస్టు ఇంటర్నేషనల్ సమావేశం ఆ పరిస్థితిని చర్చించి, పశ్చిమ జర్మనీకి చెందిన ప్రఖ్యాత సోషలిస్టు నాయకుణ్ణి శాల్వదోర్ సీమలోని సంఘర్షించే శక్తులను సమాధానపరచగల మార్గాన్ని అన్వేషించవలెనని కోరింది

బహుశః ఆ దూతయైన విల్లీబ్రాంట్ (Willy Brandt)యత్నం ఫలిస్తుంది అగ్రరాజ్యాలు ఏ దేశంలోనైనా అంతఃకలహం వస్తే, జోక్యం చేసుకోకుండా వుండలేవు వాటికి అది నైజమైపోయింది। అట్లని, ఆ జోక్యాన్ని తెగిందాకా లాగవు ప్రపంచయుద్ధం అంటే వచ్చే భయమంతే నమ్మండి అందువలన సమయానికి లభ్యమయ్యే దౌత్యానికి ఉభయ పక్షాలు లోలోన స్వాగతం పల్కగలవని తోస్తుంది పైకిమాత్రం తమ తమ వాదాలను అవి గంభీరంగా వల్లెవేస్తూ వుంటవి

* * *

త్వరలో రీగాన్, బ్రెజ్నెవ్ మహా శయులు ఒకసారి కలుసుకుని సాయుధశక్తిని తగ్గించి, అభివృద్ధికి అనుకూలమైన విధానాలను ఎక్కువగా అనుసరించడానికి ఒప్పందానికి రావలె నని అనుకుంటున్నట్లు తెలుస్తున్నది ఈ సంక్షులందే లోపల ఆ సమావేశం జరిగి వుంటుంది దానివలన సత్ఫలితమే రాగలదని ఆశిద్దాం

సమావేశం జరిగేలోగా, ఇటు అమెరికా నాయకుణ్ణీ, అటు రష్యా నాయకుణ్ణీ బ్రహ్మాండంగా ప్రోత్సహించే పలుకులతో తమ తమ మిత్రకోటికి చెందినవారు గొప్ప సంరంభాలు చేస్తున్నారు. ఇట్టి దృశ్యాలలో ఎన్నదగినది బ్రిటిష్ ప్రధాని, కన్సర్వేటివ్ పార్టీకి చెందిన మదాం థాచర్ గంభీరోక్తి ।

సోవియట్ యూనియన్ బలం పెరిగిందని భయపడవద్దు-మన మందరం కలసికట్టుగా వుండి హిందూ మహా సముద్ర రంగాన, పెర్షియన్ జలసంధి ప్రాంతాన మన శక్తులను సరియైన పద్ధతులలో సమీకరించుకుందాం పదండి-మన శక్తిని పెంచుకునే సాధనాల విషయం ఆలోచింతాం రండి- ఇదీ వరస ।

నిజానికి, నిష్పక్ష పర్యవేక్షకుల అంచనా ప్రకారం అగ్రాగ్రరాజ్యాలు రెండూ రమారమి సరిసమానంగానే తమ యుద్ధప్రయోజన సంపత్తిని పోగు చేసుకుని వున్నవి. తాము జాగరూకులై వున్నట్లుగా తమ జనానికి హెచ్చరిక చేయడం కోసం గంభీరమైన వాక్యాలను ధ్వనింపచడం, సంరంభాలను సాగించడం దినచర్య ఐపోయింది ఆ రాజ్యాలకు, ఆ రాజ్యాల మిత్రమండలికీ ।

రీగాన్ కేకలు 'యుద్ధచర్య'లకు నాంది ప్రస్తావనలా ? — బ్రెజ్నెవ్ నుడువులు సంఘర్షణతో ఏ కోశానా నిమిత్తంలేని మహా సామరస్యపు విధానానికి చిహ్నాలా ?

కావు. కాకున్నా ప్రపంచయుద్ధమూ రాదు, రానివ్వరు గనక । అల్పమైన సంఘర్షణలు, వాగ్యుద్ధాలు సైతం తప్పవు

ఆ విధమైన 'సహజీవనం'లో నుంచి, ప్రపంచాన అందరికీ ఉపకరించే నవ సమాజ నిర్మాణానికి (International new economic order వంటిది రావడానికి) సహచర్యలోకి అగ్రాగ్ర రాజ్యాలు మిత్రకోటితో సహా పోవలసి వున్నవి.

అదే ప్రస్థానం । అని భావుకు లంటున్నారు ఇందుకై ప్రపంచాన కొత్త నాయకత్వం రానున్నదని దీర్ఘ దర్శుల అంచనా

అలీన రంగం నేడు ఉభయపక్షాల ఆదరాన్ని పొంది వున్నది అందులో నుంచి వచ్చె ప్రేరణ అట్టి నాయకత్వానికి సహాయభూతం కావచ్చునని కూడా కొందరు విషయజ్ఞు లంటున్నారు।

Printed and Published by A Chandra Seker Rao at 5-9-88 Public Garden Road Hyderabad for YUVA Publications and Printed at Dolton Press Public Garden Road

"తీపు...తీపు...
తీపూ...అంటే?"

"అంటే,
విజయస్ప్రేతో నీవు
ఏడు నెలు ఎదిగావన్నమాట"






విజయస్ప్రే, మాంసకృత్తులు, విటమిన్లు
మరియు ఖనిజపదార్థాలతో సమ్మిళిత
మైన శిశు ఆహారం. తేలికగా జీర్ణం
కాగలదు. సులభంగా నీటిలో కరుగగలదు.
ఆరోగ్యసూత్రాలకు అనుగుణంగా తయారు
చేయబడింది. విజయస్ప్రేను చాలా
సులభంగా కలుపుకోవచ్చు. అంతర్జాతీయ
ప్రమాణాలకు అనుగుణంగా తయారు
చేయబడిన విజయస్ప్రే భారతదేశపు పసి
పాపలకు చాలా అనువైన శిశు ఆహారం.
విజయస్ప్రే తల్లి పాలవలె తియ్యగా
ఉండేట్లు తయారుచేయబడింది.
అవును, మీ పాప ఆరోగ్యానికి డాక్టర్లు
సిఫారసుచేసే శిశు ఆహారం...విజయస్ప్రే!

# విజయస్ప్రే

కన్నతల్లి అనురాగానికి
ప్రతిరూపం

ఆంధ్రప్రదేశ్ పాడి పరిశ్రమాభివృద్ధి
కార్పొరేషన్ లిమిటెడ్ వారి
ఒక శ్రేష్ఠమైన ఉత్పన్నం
(ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ
యాజమాన్య సంస్థ)

అమ్మకందార్లు:
స్పెన్సర్ & కం. లిడ్.

FDS APDDC 3071A TEL

ఇప్పుడు
అందానికి ఒక కేలమైన్

# పాండ్స్

## కేలమైన్ లోషన్

**పూసిన అందం, సంరక్షించే గుణం,
తాజా మురిపెం, మీ చర్మానికిది లాభమయం.**

చర్మానికి ఆరోగ్యంతోబాటే అది ఒక
అందాలగని కావాలని కోరుకోరామరి?
ఈ రెంటి కోసమూ యిదుగో కొత్త
పాండ్స్ కేలమైన్ లోషన్
మచ్చలేని, నిర్మలమైన శోభ-
చల్లదనం యిక మీ వంటిపైన-
గాలిలోని, సంతోషం విరిసే,
మారని ఆ తాజాదనం. మేకప్
వేసుకునే ముందైనా, లేదా
దానంతట అదిగానే వాడటానికి
వీలు. సుగంధం విరజిమ్మే,
అందాన్నిచ్చే పాండ్స్
కేలమైన్ లోషన్.






పాండ్స్

లింటాస్-PIL. CL. 4-1718 TL

